శివాద్వైతగ్రంథమాల  ప్రథమకుసుమము

# కేనోపనిషత్తు

## ఆంధ్రవ్యాఖ్యానసమేతము





వ్యాఖ్యాత :

అభినవబాదరాయణ, ఉపనిషద్వ్యాఖ్యాతృచక్రవర్తి

శైవతత్త్వప్రకాశికాసంపాదకులు

యోగిశ్రీ శ్రీపతిపండితారాధ్యుల శరభారాధ్యుడు

*

ప్రచురణ :

శైవతత్త్వప్రకాశికాకార్యాలయము

విజయవాడ - కృష్ణా

1965

# సమర్పణ

సాయుజ్యాధిష్ఠానమగు భౌతికశరీరమునకు భూలోకప్రవేశ మొసంగిన

పితృపాదులు

**వీరభద్రారాధ్యులకు**

# తొ లి ప లు కు

కేనోపనిషత్తు అష్టోత్తరశతోపనిషత్తులలో సంఖ్యాక్రమము ననుసరించి రెండవది. ఉపనిషత్తునందలి 'కే నేషితం పతతి ప్రేషితం మనః' అను ప్రథమమంత్రమునందలి కేన అను ప్రథమశబ్దము ననుసరించి యుపనిషత్తునకు కేనోపనిషత్తు అను వ్యవహారము గలిగినది.

ఈయుపనిషత్తునందు సర్వేంద్రియప్రేరకత్వము, సర్వజగచ్ఛాసకత్వము అను పరమేశ్వరుని యసాధారణలక్షణములు నిరూపింపబడినవి. త్వగాదిపంచజ్ఞానేంద్రియములును, వాగాదిపంచకర్మేంద్రియములును, మనస్సును పంచభూతములకు సంబంధించినవి. కావున నివి యన్నియును జడములు. జడములకు కర్తృత్వము లేదు. సర్వేంద్రియప్రేరకుడు పరమేశ్వరు డను విషయము సమగ్రముగా చర్చింపబడి నిర్ధారింపబడినది.

దేవతల విజయోత్సవమునకు సంబంధించిన యాఖ్యాయికద్వారా పరమేశ్వరాసాధారణలక్షణమగు సర్వజగచ్ఛాసకత్వము నిర్ధారింపబడినది. దేవతలు రాక్షసులను గెల్చితి మను గర్వముతో విజయోత్సవమును గావించుకొనుచుండ గర్వము పతనహేతు వగుట వారిని వీతగర్వులను గావించు తలంపుతో యక్షరూపమున సాక్షాత్కరించెను. దేవత లాత డెవరో గన్గొని రమ్మని వాయువును, నగ్నిని పంపిరి. యక్షుడు వారిముం దొకతృణము నుంచి కదలింపుమన వాయువు కదలింపజాలకయు, నగ్ని దహింపజాలకయు సిగ్గుతో మరలిపోయిరి. అంత నింద్రుని బంప యక్షు డంతర్ధాన మొందెను. హైమవతి ప్రత్యక్షమై యక్షరూపమున సాక్షాత్కరించినది పరమేశ్వరుడని వచించి యంతర్ధాన మందెను. ఈ విధముగ దేవతలకు జ్ఞానోదయ మయ్యెను.

ముముక్షువు లీయుపనిషత్తు నధ్యయనము గావించి స్వాల్పత్వమును పరమేశ్వరుని మహత్త్వమును గుర్తించి పరమేశ్వరోపాసన గావించి సాయుజ్యము నందుదురుగాత !

ఏతన్ముద్రణవిషయమున నా కన్నివిధముల సాయపడినవారికిని మఱియు జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, 2-వ లైను, బ్రాడీపేట, గుంటూరు-2 వారికిని నాకృతజ్ఞతాపూర్వకాభినందనములు.

— వ్యాఖ్యాత

# విషయసూచిక

## కేనోపనిషత్తు



## కేనోపనిషత్తు



## కేనోపనిషత్తు



## కేనోపనిషత్తు



## ప్రథమఖండము

## ద్వితీయ ఖండము



## తృతీయ ఖండము



## చతుర్థ ఖండము





# కేనోపనిషత్తు

## ఉపోద్ఘాతము

ఈశకేనకఠప్రశ్నముండమాండూక్యతిత్తిరిః
ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం తథా

ఈశావాస్యము, కేనోపనిషత్తు, కఠోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యము, తైత్తిరీయము, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యకము ననువానికి దశోపనిషత్తులని వ్యవహారము. కేనోపనిషత్తు సంఖ్యాక్రమమందు దశోపనిషత్తులలో రెండవది.

కే నేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
కే నేషితాం వాచ మిమాం వదంతి
చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి

ఉపనిషత్తునందలి ప్రథమఖండము – ప్రథమమంత్రమునందలి ప్రథమపదమగు 'కేన' అనుపదమును ప్రతీకముగా గొని ఉపనిషత్తునకు 'కేనోపనిషత్' అనునామ మేర్పడినది. ఈయుపనిషత్తు సామవేదము నందలి తలవకారశాఖకు సంబంధించిన దగుటచే దీనికి తలవకారోపనిష త్తనియును పేరు గలదు. కేనోపనిషత్తుయొక్క– నాలవఖండము– ఏడవమంత్రమునందు

ఉపనిషదం భో బ్రూ హీత్యుక్తా య ఉపనిషత్ బ్రాహ్మీం వావ
త ఉపనిషద మబ్రూ మేతి

అనుమంత్రమునందు 'బ్రాహ్మీ ఉపనిషత్' అను పేరుతో చెప్ప బడియున్నను నాపేరుతో నీయుపనిషత్తునకు వ్యవహారము లేదు. అధర్వ వేదమునకు సంబంధించిన మఱియొక కేనోపనిషత్తు కలదు. అయినను

సామవేదమునకు సంబంధించిన కేనోపనిషత్తే దశోపనిషత్తులలో రెండవదిగా పరిగణింపబడుచున్నది. కావున నీయుపనిషత్తునకే శివాద్వైత సంప్రదాయానుసార మాంధ్రవివరణము రచింపబడుచున్నది. ప్రమాణ గ్రంథనిర్ణయము గానిది గ్రంథవివరణమునకవకాశము లేదుగాన ప్రథమమున ప్రమాణగ్రంథనిర్ణయము గావింపబడుచున్నది.

అంగాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ
ఆయుర్వేదో ధనుర్వేదో హ్యథ గాంధర్వ ఏవ చ
అర్థశాస్త్రం సమాహత్య విద్యా హ్యష్టాదశ స్మృతాః

శిక్ష, వ్యాకరణము, కల్పము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము నను నారు వేదాంగములును, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము నను నాలుగు వేదములును, పూర్వోత్తరమీమాంసలును, న్యాయవైశేషికములును, అష్టాదశఉప మహా పురాణములును, మన్వాదిధర్మశాస్త్రములును, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థశాస్త్రము నను నాలుగువేదములును ననువాని కష్టాదశ విద్యాస్థానములని వ్యవహారము. ఏవిషయమునైనను నీయష్టాదశ విద్యాస్థానములను కూలంకషముగా చర్చించి నిర్ణయింపవలయునని శిష్టసంప్రదాయము.

ఆఅంగములలో శిక్ష వర్ణస్వరములకును, వ్యాకరణము శబ్దముల సాధుత్వాసాధుత్వముల నిర్ణయమునకును, నిరుక్తము శబ్దార్థవాక్యార్థ నిర్ణయమునకును, కల్పము క్రతువిధానమునకును, ఛందస్సు అనుష్టుబాది వృత్తనిర్ణయమునకును, జ్యోతిషము వాస్తుముహూర్తములకును సంబంధించినవి. ఋగ్వేదము యజ్ఞయాగాదివిషయకకర్మకాండబహుళము. యజుర్వేదమునందు యజ్ఞయాగాదివిషయములే గాక యుపాసనావిషయములును సమగ్రముగా నున్నవి. సామవేదము పరమేశ్వరస్తోత్ర బహుళము. అథర్వవేదమునందు లౌకికరాజకీయసంబంధివిషయములకు

ప్రాధాన్య మీయబడినది. పూర్వమీమాంస కర్మకాండగతసంశయ నివారణమునకు సంబంధించిన సూత్రగ్రంథము. అట్లే యుత్తర మీమాంస యుపాసనాకాండకు సంబంధించిన సూత్రగ్రంథము. న్యాయ వైశేషికములు తర్కశాస్త్రమునకు సంబంధించినవి. పురాణములు సర్గప్రతిసర్గవంశమన్వంతరవంశానుచరితము లను పంచలక్షణములతో నిండియున్నవి. ధర్మశాస్త్రములు లోకవ్యవస్థానిర్ణాయకవిధులతో నిండి యున్నవి. ఆయుర్వేద మారోగ్యవిషయములకును, ధనుర్వేద మస్త్ర శస్త్రప్రయోగోపసంహారవిషయములకును, గాంధర్వము సంగీతవిద్య కును, అర్థశాస్త్రము రాజ్యవ్యవస్థకును సంబంధించిన యుపవేదములు.

ఇందు శ్రుతిస్మృతిపురాణేతరవిద్యాస్థానము లాయాప్రత్యేకవిష యములకు సంబంధించిన వగుటచే విషయనిర్ణయమున నవి యంతగ నుపయోగపడవని యెంచియే శ్రుతిస్మృతిపురాణములకే ప్రాధాన్య మంగీకరింపబడినది. కాని వీనియందును వైరుధ్యముగలిగిన విషయనిర్ణ యముగావించుట యెట్లనుసంశయము గలుగుటచే

శ్రుతిస్మృతిపురాణానాం విరోధో యత్ర దృశ్యతే
పూర్వం పూర్వం బలీయం స్యా దితి వేదవిదో విదుః

శ్రుతిస్మృతిపురాణములలో స్మృతిపురాణములకు వైరుధ్యము గలిగినచో పురాణముకంటె స్మృతి ప్రబలమనియును, శ్రుతిస్మృతులకు వైరుధ్యము గలిగినచో శ్రుతి ప్రబలమనియును నిర్ణయ మంగీకరింపబడి నది. కావున విషయనిర్ణయమున నష్టాదశవిద్యాస్థానములలో వేదము ప్రమాణమూర్ధన్యమని యంగీకరింపబడినది. శ్రుతియందే వైరుధ్యము కలిగిన వైకల్పికత్వ మంగీకరింపవలయు ననియును నిర్ణయింపబడినది. ఉదితే జుహోతి, అనుదితే జుహోతి ఇత్యాదిస్థలములందు వైకల్పికత్వము నంగీకరించియే విరోధము పరిహరింపబడినది.

భిన్నభిన్నసంప్రదాయములవారు స్వసంప్రదాయానుసారముగ

నపార్థములు గల్పించుట కవకాశముండుటచే నావిషయమును పురస్కరించికొని

> బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రతరిష్యతి
> ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్

అర్థనిర్ణయము గావించునపుడే సంప్రదాయమువారైనను పురాణేతిహాసములయందలి యుపబృంహణముల ననుసరించి మంత్రార్థప్రతిపాదనము గావింపవలయునని నిర్ణయింపబడినది. శ్రుతియందే ప్రకరణమున విషయనిర్ణయము గావింపవలసివచ్చినను షడ్విధలింగసమన్వయపూర్వకముగనే ప్రకరణార్థము నిర్ణయింపవలయునని శిష్టసంప్రదాయము.

## షడ్విధలింగనిర్ణయము

> ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలమ్
> అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే

ఉపక్రమోపసంహారములు, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి యనునవి షడ్విధలింగములు. ఉపనిషత్తాత్పర్యనిర్ణయమున నివి ప్రధానస్థానము నాక్రమించుచున్నవి. ప్రతియుపనిషత్తు నందును వీనిని సమన్వయించుచునే తాత్పర్యనిర్ణయము గావింపవలయును.

> అజ్ఞానప్రభవం దుఃఖం జ్ఞానం తస్య నివర్తకమ్
> సర్వవేదాంతవాక్యానాం శ్రవణం తత్ప్రవర్తకమ్
> శ్రవణం నామ వాక్యానాం వైదికానాం పరాత్పరే
> ఉపక్రమాదిభి ర్లింగైః శివే తాత్పర్యనిర్ణయః

పరమేశ్వరు నుపాసించకపోవుటవలన మానవుడు సంసరణదుఃఖమునకు పాల్పడుచున్నాడు. తదుపాసనవలన సంసరణనివృత్తి గలుగుచున్నది. సర్వవేదాంతవాక్యములకును పరాత్పరుడగు శివునియం

దుపక్రమాదిలింగములచే తాత్పర్యనిర్ణయము గావించుటకే శ్రవణ మని వ్యవహారము.

ఉపక్రమము, ఉపసంహారము రెండును గలిసి షడ్విధలింగము లలో ప్రథమలింగము. ఉపక్రమ మనగా గ్రంథారంభము. ఉపసంహార మనగా గ్రంథాంతము. ఉపక్రమమున నారంభింపబడినవిషయ ముప సంహారమున స్పృశింపబడవలయును. ఉపక్రమమున నారంభింపబడిన విషయ ముపసంహారమున స్పృశింపబడిననే గ్రంథమున కేకవాక్యత యుండును. కావుననే యుపక్రమోపసంహారరూపలింగము తాత్పర్య నిర్ణయమున ప్రధానముగా నిర్ణయింపబడినది.

అభ్యాసము ద్వితీయలింగము. ఉపక్రమమున నారంభింపబడిన విషయ ముపసంహారమువరకును మఱల ప్రస్తావింపబడకున్న నావిష యము విస్మరింపబడవచ్చును. కావున నావిషయము ఉపసంహారము లోపల మఱలమఱల ప్రస్తావింపబడు చుండవలయును. ఈవిధముగ మఱల మఱల ప్రస్తావింపబడుటకే అభ్యాస మని వ్యవహారము.

ఫలము చతుర్థలింగము. ఫల మనగా ప్రయోజనము. 'ప్రయో జన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే' అను న్యాయము ననుసరించి ప్రతికార్యమును సప్రయోజనముగా నుండవలయును. వేదాంతశ్రవణ మునకు పరమప్రయోజనము అమృతత్వము.

అర్థవాదము పంచమలింగము. అర్థవాద మనగా ప్రతిపాదింప బడినవిషయము రోచకముగా నుండుటకు కథారూపమున నుదాహ రించుట.

ఉపపత్తి షష్ఠలింగము. ఉపపత్తి యనగా విరోధాభావము లేక సర్వజ్ఞత్వాదిసంపత్తి. ప్రతిపాద్యమానమగు విషయమున కెట్టివిరోధము లేకుండ విషయము సమన్వితరూపమున నుండుట యుపపత్తి. పరమే శ్వరుని యసాధారణలక్షణములగు సర్వజ్ఞత్వాదులు గ్రంథమున వచ్చు టచ్చట ప్రతిపాదింపబడుట యుపపత్తి.

## షడంగములు

సర్వజ్ఞతా తృప్తి రనాదిబోధః
స్వతంత్రతా నిత్య మలుప్తశక్తిః
అనంతశక్తిశ్చ విభో ర్విధిజ్ఞాః
ష డాహు రంగాని మహేశ్వరస్య

సర్వజ్ఞత్వము, తృప్తి, అనాదిబోధము, స్వతంత్రత, నిత్యాలుప్తశక్తిమత్త్వము, అనంతశక్తిమత్త్వము అనునవి షడంగములు. సర్వజ్ఞతాదులు పరమేశ్వరుని యసాధారణలక్షణములు.

## సర్వజ్ఞత

సర్వజ్ఞత :- సర్వం జానాతీతి సర్వజ్ఞః తస్య భావః సర్వజ్ఞతా. సర్వము నెఱింగినవాడు సర్వజ్ఞుడు. దేవతామండలిలో సర్వము నెఱింగినవాడు పరమేశ్వరు డొకరుడే యున్నాడు.

'కృశానురేతాః సర్వజ్ఞో ధూర్జటి ర్నీలలోహితః'
'యః సర్వజ్ఞః సర్వవి ద్యస్యైష మహిమా భువి
దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ న్యాత్మా ప్రతిష్ఠితః'

అమరకోశావగతరూఢిచేతను, వైదికరూఢిచేతను సర్వజ్ఞపదము శివైకాంతిక మని తేలుచున్నది.

ప్రత్యక్షే ణానుమిత్యా వా యు స్త్వోపాయో న విద్యతే
ఏనం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా

ప్రత్యక్షప్రమాణముచేతగాని, అనుమానప్రమాణముచేతగాని తెలిసికొనుటకు వీలుకానివిషయమును వేదము తెలియజేయుటచేతనే వేదనామము సార్థక మగుచున్నది.

యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై

తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే

బ్రహ్మను సృష్టించి బ్రహ్మకు వేదరాశి నొసంగినవాడు పరమేశ్వరు డని శ్వేతాశ్వతరము ప్రతిపాదించుచున్నది.

'ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతానాం
బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివో మేఽస్తు సదాశివోమ్'

'అంగాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ
ఆయుర్వేదో ధనుర్వేదో హ్యథ గాంధర్వ ఏవ చ
అర్థశాస్త్రం సమాహత్య విద్యా హ్యష్టాదశ స్మృతాః
అష్టాదశానా మేతాసాం విద్యానాం భిన్నవర్త్మనామ్
ఆదికర్తా కవిః సాక్షా చ్ఛూలపాణి రితి శ్రుతిః'

అను శ్రుతి చేతను, తదుపబృంహణమైన శివపురాణవాయుసంహితా ప్రమాణవచనము ననుసరించియును నష్టాదశవిద్యాస్థానములకు — ఋగాదిచతుర్వేదములకు, శిక్షాదిషడంగములకు, పూర్వోత్తరమీమాంసలకు, న్యాయవైశేషికములకు, అష్టాదశఉపమహాపురాణములకు, త్రింశత్ స్మృతులకు, కామికాద్యష్టావింశత్యాగమములకు, ఆయుర్వేద ధనుర్వేదగాంధర్వవేదఅర్థశాస్త్రము లను నుపవేదములకును నాదికర్త పరమేశ్వరు డని తెలుచున్నది. కావున సర్వజ్ఞానభాండారములగు నష్టాదశవిద్యాస్థానములకు ఆదికర్త పరమేశ్వరుడని తెలుటచే పరమేశ్వరుని సర్వజ్ఞతావిషయమున విస్తార మనావశ్యకము.

## తృప్తి

తృప్తి :- ఉన్నదానితో సంతుష్టి చెందుట తృప్తి యనియును, ఉన్నదానితో సంతుష్టి చెందక లేనిదానికై వెంపరలాడుట యసంతృప్తి

యనియును లౌకికవ్యవహారము. తృప్తి పరమేశ్వరునిషడంగములలో రెండవదిగా పరిగణింపబడుచున్నది.

'స విశ్వకృత్ విశ్వవి దాత్మయోని ర్జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్యః'

'యతో వా ఇమాని భూతాని జాయంతే'

అనుశ్రుతులు విశ్వమంతయును పరమేశ్వరసృష్టియని ప్రతిపాదించుచున్నవి.

పాదోఽస్య విశ్వా భూతాని త్రిపా ద స్యామృతం దివి

అనుశ్రుతి సమస్తబ్రహ్మాండములును పరమేశ్వరునిలో నొక భాగమని ప్రతిపాదించుచున్నది. తనకున్నదానితో సంతుష్టి చెందుట తృప్తియని వివరించినాము. ఉన్నదానితో ననుటచే లేనిది కొంత యున్నదని తేలుచున్నది. ఈవిభాగమున కవకాశ మున్నపుడే తృప్తి, అసంతృప్తి అనువాని కవకాశ మేర్పడుచున్నది. 'సర్వో హ్యేష రుద్రః' అనుశ్రుతి సర్వమును నాపరమేశ్వరుడే యనియును, నాతనికన్న భిన్నమైనది లే దనియును ప్రతిపాదించుచున్నది. కావున పరమేశ్వరునకు కోరదగినది లేదని తేలుచున్నది. కారణ మాతనిది కానిది, ఆతడు కానిది లేకపోవుటయే. ఇంకొకవిషయము. మానవులే కాదు, బ్రహ్మవిష్ణ్వాదిదేవతలును నాయాపదవులను కోరి శివారాధనము గావించినారు. ఈవిషయము

తవ శ్రియే మరుతో మర్జయంత రుద్ర ! య త్తే జనిమ చారు చిత్రమ్
పదం య ద్విష్ణో రుపమం న్యధాయి తేన పాసి గుహ్యం నామ గోనామ్

పారమేశ్వరానుగ్రహలేశమును గోరి బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు తన్మూర్తరూపమగు లింగము నభిషేకాదులచే నారాధించినారు. ఆవిధముగ నారాధించి విష్ణువు లక్ష్మీవిశిష్టమగు వైకుంఠమును పొందినాడనువిషయ మీమంత్రముచే ప్రతిపాదింపబడినది. దేవతలు శివానుగ్రహము గోరి శివు నారాధించినట్లు పురాణములందు విపులముగా

ప్రపంచింపబడినది. ఇంతియే గాదు. సర్వేశ్వరుడు సర్వకర్మఫలదాత గనుకనే శివు డితరుల నారాధించవలసిన యావశ్యకత లేదు. కారణము 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' అను శ్వేతాశ్వతరమంత్ర మేవిషయమునను తత్సముడుగాని, తదధికుడుగాని లేకపోవుటయే యని ప్రతిపాదించుచున్నది. తన కావశ్యకవిషయమున తనకన్న తద్విషయమున నధికునిగదా సేవించుట? కావున శివుని నిత్యతృప్తతావిషయమున నింతకన్న విస్తర మనావశ్యకము.

## అనాదిబోధము

బోధ మనగా జ్ఞానము. అనాదిబోధ మనగా యత్కించిదుపాయప్రాప్తమగు జ్ఞానము గాదని యర్థము. అస్మదాదులబోధ యనాది గాదు. కారణము జీవులు 'జ్ఞాజ్ఞౌ' అనుశ్రుతిచేత అజ్ఞులగుటయే. మఱి పరమేశ్వరుడో సర్వజ్ఞుడు — సర్వము నెఱింగినవాడు. అయిన సర్వ మనగా నేమి? సర్వశబ్దమునకు సమస్తమని యర్థము. సర్వజ్ఞుడనగా సమస్తము నెఱింగినవాడని యర్థము. కాలముచేత సర్వము, దేశము చేత సర్వము నని సర్వశబ్దార్థము. కాలముచేత సర్వ మనగా భూతవర్తమానభవిష్యత్తులకు సంబంధించిన సర్వము ననియును, దేశము చేత సర్వ మనగా కృత్స్నజగత్సంబంధిసర్వము ననియును సర్వశబ్దముచే వివక్షింపబడినది. ఈవిమర్శచే పరమేశ్వరునిజ్ఞానము కాలముచేతగాని, దేశముచేతగాని పరిచ్ఛిన్నము గాదని తేలుచున్నది. కాలముచేత పరిచ్ఛిన్నము గా దనుటచే పరమేశ్వరుని జ్ఞాన మొకకాలమునం దొక నిమిత్తమును పురస్కరించికొని వచ్చినది కాదనియును, సర్వకాలము లందును నొకేవిధముగా నుండునది యనియును తెలియుచున్నది.

మఱి జీవునిజ్ఞానమో యట్టిది గాదు. ఆతడు స్వాభావికముగ నజ్ఞుడు. అజ్ఞు డనగా కేవలము పాషాణాదులవలె జ్ఞానరహితుడని యర్థము గాదు. ఆతడు కించిద్జ్ఞుడు. అనుదరా కన్యా యనువాక్యము

నందలి అనుదరశబ్దమునందలి నఞ్ అల్పార్థసూచకమైనట్లు అజ్ఞశబ్దము నందలి నఞ్ అల్పార్థసూచకమై అల్పజ్ఞుడను నర్థమును బోధించుచున్నది. అల్పజ్ఞు డనగా దేశముచేతను, కాలముచేతను పరిచ్ఛిన్నమగు జ్ఞానము గలవాడని యర్థము. అట్టియల్పజ్ఞుడగు జీవుడు గురూపదేశముచే విషయపరిజ్ఞానము గలిగి శివారాధన గావించి తదనుగ్రహముచే సర్వజ్ఞుడై ముక్తు డగుచున్నాడు.

ఈవిమర్శచే పరమేశ్వరునిజ్ఞానము యత్నించిదుపాయప్రాప్తము గాకపోవుటచే ననాది యని తేలుచున్నది.

## స్వతంత్రత

స్వతంత్రత పరమేశ్వరునిషడంగములలో నాలవది. తనయిచ్ఛ ననుసరించి తనకార్యముల నేవిధమైనయడ్డంకులును లేక నెరవేర్చుకొనగలవాడు స్వతంత్రుడు. తనకార్యసాఫల్యమునకై యితరులమీద నాధారపడినవాడు పరతంత్రుడు.

> స్వ మాత్మా తంత్రం ప్రధానం యస్య స్వతంత్రః
> ఇతరః స్వస్మా దన్యః తంత్రం ప్రధాన మస్యేతి పరతంత్రః

కార్యనిర్వహణమందు తాను ప్రధానముగాగలవాడు స్వతంత్రుడు. అనగా నితరులమీద నాధారపడనివా డని యర్థము. అటులే కార్యనిర్వహణమందు తనకన్న నితరుడు ప్రధానముగాగలవాడు పరతంత్రుడు. అనగా నితరులమీద నాధారపడినవా డని యర్థము.

బృహదారణ్యకమున నంతర్యామిబ్రాహ్మణమునందు జీవుడును, సర్వభూతములును, సర్వేంద్రియములును పరమేశ్వరనియమ్యము లను విషయము స్పష్టముగా నసందిగ్ధముగా ప్రతిపాదింపబడినది.

> య ఆదిత్యే తిష్ఠ న్నాదిత్యా దంతరో య మాదిత్యో న వేద య
> స్యాదిత్యః శరీరం య ఆది త్య మంతరో యమయతి ఏష త
> ఆత్మాంతర్యా మ్యమృతః

పరమేశ్వరుడు సూర్యునియందు సూర్యునకన్న భిన్నముగ నున్నాడు. తనయందు పరమేశ్వరు డంతర్యామిగా నున్నాడనువిష యము సూర్యునకు తెలియదు. సూర్యుడు పరమేశ్వరుని శరీరభాగము లగు నష్టమూర్తులలో నొకడు. పరమేశ్వరుడు సూర్యునియం దంతర్యా మిగా నుండి సూర్యుని నియమించుచున్నాడు. ఈపరమేశ్వరుడే నీకును, సర్వమునకును అంతరాత్మగా నున్నాడు. ఈత డమృతుడు.

ఈవిధముగ ప్రతిపర్యాయము నాత్మసూర్యచంద్రమనఆదిసర్వేం ద్రియపృథివ్యాదిసర్వభూతములను పేరుపేరుతో వక్కాణించి సర్వ మును పరమేశ్వరనియమ్య మనియును, పరమేశ్వరుడు సర్వాంతర్యామి యనియును, సర్వజగన్నియామకు డనియును బృహదారణ్యకమున ప్రతిపాదింపబడినది. ఈవిషయము

ఆబ్రహ్మకీటపర్యంతాః పశవః పరికీర్తితాః
తేషాం పతిత్వా ద్దేవేశః శివః పశుపతిః స్మృతః

అని పురాణములయందు విపులముగా ప్రపంచింపబడినది. విశ్వము నియమ్యమని తేలుటచే పరతంత్ర మనియును, పరమేశ్వరుడు నియామకుడగుటచే స్వతంత్రు డనియును తేలుచున్నది. ఇంతియే గాదు. 'న తస్య కశ్చి త్పతి రస్తి లోకే న చేశితా' అనుశ్వేతాశ్వతరమంత్ర మీశ్వరుని శాసించువాడు లేడని ప్రతిపాదించుచున్నది. మఱియును 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' అనుశ్రుతి పరమేశ్వరసముడు గాని, తదధికుడుగాని లేడని ప్రతిపాదించుచున్నది. ఈవిమర్శచే పరమే శ్వరుడు సర్వతంత్రస్వతంత్రు డనియును, కర్తుమ్=చేయుటకుగాని, అక ర్తుమ్=చేయకుండుటకుగాని, అన్యథా కర్తుమ్ = మార్చుటకుగాని, సర్వాధికారములు గలవాడని తేలుచున్నది.

## నిత్యాలుప్తశక్తిమత్త్వము, అనంతశక్తిమత్త్వము

మూడుకాలములందును లోపింపనిశక్తి గలిగియుండుట నిత్యాలుప్తశక్తిమత్త్వము. అంతములేని యనగా ప్రధ్వంసాభావవిశిష్టము గాని శక్తి గలిగియుండుట యనంతశక్తిమత్త్వము. నిత్య మనగా మూడుకాలములందును నుండునది. అనగా ప్రాగభావప్రధ్వంసాభావములు లేనిదని యర్థము. నిత్యత్వవిశేషణముచేతను అలుప్తత్వవిశేషణముచేతను గతార్థ మగుటచే ననంతశక్తిమత్త్వము ప్రత్యేకాంగముగా పరిగణింపనక్కఱలే దనుశంక గలుగవచ్చును. నిత్యత్వము కాలికపరిచ్ఛేదాభావమునుమాత్రము సూచించును. అనంతత్వము దైశికపరిచ్ఛేదాభావప్రతిపాదక మగుటచే నెట్టిశంకకును తావు లేదు.

శక్తి యనగా సామర్థ్యము. సంకల్పితకార్యములు నెరవేర్చుకొనుసామర్థ్యమునకు శక్తి యని వ్యవహారము. ప్రాణికోటియందు సంకల్పితకార్యనిర్వహణసామర్థ్యము సర్వకాలములందును, యావజ్జీవమును నుండదు. కర్మవశ్యతయే దీనికి కారణము. దేవతామండలిలో పరమేశ్వరు డొకరుడే యున్నాడు కర్మవశ్యుడు కానివాడు. కర్మవశ్యత పారతంత్ర్యమునకు ప్రధానచిహ్నము. అట్లే కర్మావశ్యత స్వాతంత్ర్యమునకు ప్రధానచిహ్నము. స్వతంత్రునిశక్తి కెట్టిప్రతిబంధకమును నుండదు. కర్తు మకర్తు మన్యథా కర్తుమ్ = తనయిచ్ఛవచ్చినట్లు చేయుటకును, ఇచ్ఛ లేనపుడు చేయకుండుటకును, లేక ఒకరకముగా చేసినదాని నన్యథాకరించుటకును సమర్థుడగువాని శక్తి యప్రతిహత మనుటలో సందేహమునకు తావు లేదు. ఇందు కైహికముగ సార్వభౌమాధికారమే నిదర్శనము. సామ్రాజ్యమున నాతనియధికార మప్రతిహతము. శిక్షించినను, క్షమించినను, శిక్ష నన్యథాకరించినను నాతని ప్రశ్నించుట కెవరికిని నధికారము లేదు.

ఇక పారమేశ్వరశక్తివిషయము గాంతము. ఆతనిశక్తి యనగా నధికారము నిత్యము = మూడుకాలములందును నుండునది, అలుప్తము

=లోపము లేనిది, అనంతము=నశించనిది. సార్వభౌమాధికారమునకు పరకీయాక్రమణవలన లోపము సంభవింపవచ్చును. శక్తిమత్తరుల యెదుట కుంటువడవచ్చును. కాని పరమేశ్వరునిశక్తివిషయ మట్లు గాదు, కారణము సర్వమును, సర్వప్రాణులును నాతనిస్సృష్ట్యంతర్భూత ములే. ఐనను 'పుత్రా దిచ్ఛే త్పరాజయమ్' అనున్యాయము ననుసరించి పారమేశ్వరసృష్టియందును తదధికు డుండవచ్చునుగదా యన్న 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' యను శ్వేతాశ్వతరశ్రుతి పరమే శ్వరసముడుగాని, తదధికుడుగాని లేడని ప్రతిపాదించుటచే నట్టిసందేహ మునకు తావే లేదు. కానిచో 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ' ఇత్యాది శ్రుతులకు వైయర్థ్య మాపాదించును. మరియును బహీశ్వరవాదము నంగీకరింపకతప్పదు. ఈవాదము శిష్టజనాభ్యర్హితము కాకపోవుటచే నింతట విరమించి ప్రకృత మనుసరింతము.

ఇప్పటివరకును షడ్విధలింగవిషయమును, పారమేశ్వరాసాధా రణలక్షణములగు సర్వజ్ఞతాదిషడంగములవిషయమును వివరింపబడి నది. ఇక షడ్విధలింగసమన్వయవిషయము గాంతము.

## కేనోపనిషత్తు - షడ్విధలింగసమన్వయము

### ఉపక్రమము

షడ్విధలింగములలో నుపక్రమోపసంహారములు ప్రథమలిం గము. ఉపక్రమోపసంహారముల ననుసరించియే ప్రతిపాద్యమానవిషయ ప్రాధాన్యగౌరవములు నిర్ణయింపబడును. ఏదియే నొకమహాప్రయోజ నము నుద్దేశించియేగదా గ్రంథరచన గావించుట. కావున నాప్రయో జనవిషయ ముపక్రమమునందు—ఆరంభమునందు ప్రతిపాదింపబడవల యును. గ్రంథాంతమున — ఉపసంహారమున మఱల ప్రస్తావింపబడవల యును. కానిచో నేకవాక్యత యుండదు.

ప్రకృతము కేనోపనిషత్తు. ఉపనిషత్తులు

యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై
తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే

ముముక్షువునకు విషయవివేచనము గలిగించి యుపాసనా ప్రవృత్తి నుత్పాదించుట కేర్పడినవి. ముముక్షు వనగా మోక్తు మిచ్ఛుః = విడివడగోరినవా డని యర్థము. దేనినుండి? మరణ మాసన్నము గాన మరణమునుండి. మరణానంతరము మఱల జన్మ యవశ్యంభావి గాన పునర్భవమునుండి. అయిన నేమి గావింపవలయును? అవిరెండును అనగా జననమరణములు లేనివానిని సేవింపవలయును. అట్టివాడు దేవతామండలిలో మృత్యుంజయు డొకడే యున్నాడు. వాని నుపాసించినగాని యీరెంటినుండి మోక్షము లభింపదు. కావుననే వేదము

'త్రియంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్'
'వ్రత మేత త్పాశుపతం త త్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ'

పాశుపతవ్రతము నవలంబించి త్ర్యంబకారాధనము గావింపవలయునని శాసించుచున్నది. కావున త్ర్యంబకారాధనము గావింపవలయునన్నా విషయము సమగ్రముగా తెలియవలయును. శివు డెవరు? ఆతనికిని తనకును నేమి సంబంధము? ఆతని నుపాసించుట యెట్లు? ఉపాసనాఫల మేమి? — ఈవిషయములను సోదాహరణముగ, అసందిగ్ధముగ ప్రతిపాదించుటయే యుపనిషత్తుల ప్రధానకర్తవ్యము. కావుననే యుపనిషదారంభమున పరమేశ్వరప్రస్తావ మావశ్యకమగుచున్నది.

## ఉపక్రమసమన్వయము

కే నేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
కే నేషితాం వాచ మిమాం వదంతి
చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి

మంత్రార్థము :— ఎవనిచేత ప్రేరింపబడినదై మనస్సు అభిలషితమునుగూర్చి ప్రసరించుచున్నది? ఎవనిచేత కూడినదై ప్రాణవాయువు మొదటిదిగా ప్రవర్తించుచున్నది? ఎవనిచేత ప్రేరింపబడిన వాక్కును ఉచ్చరించుచున్నారు? ఏ దేవుడు నేత్రశ్రోత్రములను వానికిసంబంధించిన విషయములను చేర్చుచున్నాడు ?

ఇది కేనోపనిషత్తునందలి ప్రథమమంత్రము. ఇయ్యది ముముక్షు ప్రశ్నవాక్యము. ఇందు ముముక్షువుయొక్క మనఃప్రాణవాఙ్నేత్రశ్రోత్రము లెవనిప్రేరణచే స్వకృత్యములు నిర్వహించుచున్నవని గురువును ప్రశ్నించుట వర్ణింపబడినది. ఈప్రశ్నతోడనే గ్రంథ ముపక్రమింపబడినది. ఇందు మనఆదిప్రేరణద్వారా ధీప్రేరకత్వరూపపరమేశ్వరలింగము సూచింపబడినది. ఏసర్వశక్తిమంతునిశాసనమునకు లోబడి విశ్వము స్వకృత్యనిర్వహణము గావించుచున్నదను ప్రశ్నద్వారా సర్వజగచ్ఛాసకత్వరూపబ్రహ్మలక్షణము ప్రతిపాదింపబడినది.

మంత్రమునందు ధీప్రేరకత్వలింగము ప్రతిపాదింపబడినది. 'క ఉ దేవో యునక్తి' అనువాక్యమునందు ధీప్రేరకుడు దేవుడని ప్రతిపాదింపబడినది.

'అమరా నిర్జరా దేవాః'
'రాజా భట్టారకో దేవః'
'దివ్యోపపాదుకా దేవాః'

అను నమరకోశవాక్యముల ననుసరించి దేవశబ్దమునకు త్రిదశు లనియును, నాటకములో రాజపాత్రధారి యనియును, అయోనిజు డనియును నర్థము. కాని యీయర్థములన్నియును నీప్రకరణమున ననుప యుక్తములే. అయిన నీప్రకరణమున దేవశబ్దమున కర్థ మేమి?

'యో దేవోఽగ్నౌ యోఽప్సు యో విశ్వం భువన మావివేశ
య ఓషధీషు యో వనస్పతిషు తస్మై దేవాయ నమః'

'ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతాః కేవలో నిర్గుణ శ్చ'

'నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా
మేకో బహునాం యో విదధాతి కామాన్
త త్కారణం సాంఖ్యయోగాధిగమ్యం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః'

ఇందు మొదటిమంత్రమునందు ఏ దేవు డగ్నియందును, జల మందును, సమస్తవిశ్వమునందును, ఓషధులయందును, వృక్షములం దును వంతర్యామిగా నున్నాడో ఆ దేవునకు నమస్కారమని ప్రతిష్ఠా దింపబడినది. రెండవమంత్రమునందు ఒక దేవుడు సర్వభూతములయం దును గూఢముగా నున్నా డనియును, సర్వవ్యాపి యనియును, సర్వ భూతముల కంతరాత్మగా నున్నా డనియును, కర్మాధ్యక్షు డనియును, సర్వభూతములకు నివాసస్థాన మనియును, సాక్షి, చేతనుడు, కేవలుడు, నిర్గుణు డనియును ప్రతిపాదింపబడినది. మూడవమంత్రమునందు నిత్యు లగు జీవులలో నిత్యుడును, చేతనులగు జీవులలో చేతనుడును, సర్వ భక్తులకోరికలను దీర్చువాడును, సర్వకారణుడును, సాంఖ్యయోగము చేత పొందదగినవాడుననగు దేవు నుపాసించి సర్వపాశములనుండి విడివడవచ్చునని ప్రతిపాదింపబడినది.

ఈమూడుమంత్రములయందును సంతర్యామిత్వ సర్వవ్యాపిత్వాది పారమేశ్వరాసాధారణలక్షణములు ప్రతిపాదింపబడినవి. మఱియును తదుపాసనచే సర్వపాశమోక్షరూపముముక్షూపాస్యత్వలింగము ప్రతిపాదింపబడినది. ఇంతియే గాదు. ఈమూడుమంత్రములందును యో దేవః, ఏకో దేవః, జ్ఞాత్వా దేవమ్ అని కర్తృకర్మస్థానములయందు దేవశబ్దము ప్రయోగింపబడినది. దేవశబ్దసామాన్యార్థము ప్రకరణానుపయోగిగావున దేవశబ్దమునకువిశేషార్థ మేదైన నుండవలయును. ఏన నది యేది? పైన నుదాహరింపబడిన మూడుమంత్రములును శ్వేతాశ్వతరమునందలివి. శ్వేతాశ్వతరమునకు మంత్రోపనిషత్తను వ్యవహారము గలదు. శ్వేతాశ్వతరము శివనామప్రచుర మగుటచే శైవోపనిషత్తనుట నిర్వివాదము. కావున దేవశబ్దము శివపర్యాయవాచక మని యంగీకరింపకతప్పదు.

క్షరం ప్రధాన మమృతాక్షరగ్ం హరః
క్షరాత్మానా వీశతే దేవ ఏకః
త స్యాభిధ్యానా ద్యోజనా తత్త్వభావా
ద్భూయ శ్చాంతే విశ్వమాయానివృత్తిః

ప్రకృతి పరిణామశీలము. శివు డమృతుడు, అక్షరుడు. మఱియును జీవజగచ్ఛాసకుడు. శివుని ధ్యానించుటవలనను, (లింగరూపమున) ధరించుటవలనను, శివు డగుటవలనను విశ్వమాయానివృత్తి యగు ననగా ప్రకృతిసంబంధము పూర్తిగా వదలునని మంత్రార్థము. ఈమంత్రము నందు జీవజగచ్ఛాసకత్వరూపపారమేశ్వరలింగము ప్రతిపాదింపబడినది. ఇంతియే గాదు. శివధ్యానధారణతత్త్వభావములవలననే విశ్వమాయానివృత్తి యగునని ప్రతిపాదింపబడుటచే శివు డొకరుడే ముముక్షూపాస్యు డనియును ప్రతిపాదింపబడినది. మఱియును హరశబ్దమునకు పర్యాయపదముగా దేవశబ్దము ప్రయోగింపబడుటచే హరశబ్దమువలె

దేవశబ్దమును శివపర్యాయవాచకమని తేలుచున్నది. కావున దేవశబ్దమునకు శివునియందు వైదికరూఢి యనుట నిర్వివాదము.

దేవశబ్దము శివునియందు వైదికరూఢమని ప్రతిపాదించుచు నింతవఱకు వివరింపవలసివచ్చినది. ఇక ప్రకృత మనుసరింతము. ఈవిమర్శచే కేనోపనిషత్తునందలి ఉపక్రమగతమగు ప్రథమమంత్రమునందలి 'క ఉ దేవో యునక్తి' అనువాక్యమునందలి దేవశబ్దమునకు శివు డర్థమనుట పరమరాద్ధాంతము. కావున కేనోపనిషత్తు శివాద్వైతసంప్రదాయప్రతిపాదకమనుట నిర్వివాదము.

కేనోపనిషదుపక్రమగతప్రథమమంత్రము పారమేశ్వరాసాధారణలింగమగు ధీప్రేరకత్వరూపజగచ్ఛాసకత్వమును ప్రతిపాదించుటచే శివైకాంతిక మనుట వివాదాతీతము.

## ఉపసంహారసమన్వయము

ఉపసంహార మనగా గ్రంథాంతము అనగా గ్రంథమునందు ప్రారంభింపబడినవిషయమును పూర్తిచేయుట. ఇయ్యది గ్రంథమునందలి అంతిమమంత్రమునందే ప్రతిపాదింపబడవలయునను నియమము లేదు. ఏఘట్టమునందు విషయపరిసమాప్తి చేయబడునో యాఘట్టమే ఉపసంహార మనుట శిష్టసంప్రదాయము.

ఇహ చే దవేదీ దథ సత్య మస్తి
న చే దిహావేదీ న్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి

ఈలోకమునం దీజన్మమునందు తెలిసికొనినయెడల పరమేశ్వరుడున్నాడు. ఈలోకమునం దీజన్మమునందు తెలిసికొననియెడల చాల నష్టము. కావున ధీరు లన్నిభూతములవిషయమును చక్కగా విచారించి

తెలిసికొని యాలోకమునుండి ప్రకృష్టదశను పొంది శివు లగుచున్నా రని మంత్రార్థము.

ఇయ్యది ద్వితీయఖండమునందలి పంచమమంత్రము. ఇయ్యదియే ఉపసంహారమంత్రము. దీనితో ద్వితీయఖండము పూర్తియైనది. తరువాత తృతీయఖండ మారంభమగును. తృతీయఖండమునందు దేవతావిజయోత్సవాఖ్యాయిక ప్రస్తావింపబడినది. చతుర్థఖండమునందు ఫలవిషయము ప్రతిపాదింపబడినది.

ఉపక్రమోపసంహారముల కేకవాక్యత యుండవలయును. ఉపక్రమమునం దీశ్వరప్రస్తావము గావింపబడినదని వివరించినాము. కావున నుపసంహారమందును నీశ్వరప్రస్తావము గావింపబడవలయును. కానిచో నేకవాక్యతకు భంగము కలుగును.

కేనోపనిషత్తునందలి 'ఇహ చే దవేదీత్' అను నుపసంహారమంత్రమునందు ప్రథమవాక్యమునందు సత్యశబ్దమును, తృతీయవాక్యమునందు అమృతశబ్దమును ప్రయోగింపబడినవి. సత్య, అమృతశబ్దములు రెండును శివవాచకములుగా వైదికరూఢి నందినవి.

సత్య మేవ జయతే నానృతం
సత్యేన పంథా వితతో దేవయానః
యే నాక్రమంతి ఋషయో హ్యాప్తకామాః
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ముండకము 3-1-6

పరమేశ్వరుడు సర్వాతిశాయిగా నున్నాడనియును, పరమేశ్వరుని చేత దేవయానమార్గము వ్యాప్తమై యున్నదనియును, పారమేశ్వర నిధానమున్న ప్రదేశమున కాప్తకాములగు ఋషులు పయనించుచున్నా రనియును ముండకము ప్రతిపాదించుచున్నది. ఈమంత్రమునందు సత్యశబ్దము దహరాంతర్వర్తిపరముగా ప్రయోగింపబడినది. దహరాంతర్వర్తి శివు డనువిషయము

'రుద్రో జనానాం హృదయే సన్నివిష్టః'
'ప్రాణే ష్వంత ర్మనసో లింగ మాహుః'

ఇత్యాద్యనంత శ్రుతులచే ప్రతిపాదింపబడినది.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా

అనుగీతావచనము దహరాంతర్వర్తి శివు డనియే ప్రతిపాదించుచున్నది. దేవత లొకప్పుడు విష్ణుసన్నిధి కేగి నీయుపాస్యదైవ మెవ రని ప్రశ్నింప

తతోఽవ్యయాత్మా స హరిః స్వహృత్పంకజకాయినమ్
దర్శయామాస దేవానాం మురారి ర్లింగ మైశ్వరమ్

తనహృదయపుండరీకమున విరాజిల్లుచున్న పారమేశ్వరలింగమును చూపెనని వామనపురాణమున ప్రతిపాదింపబడినది. ఈవిమర్శచే దహరాంతర్వర్తి యీశ్వరుడని తెలుచున్నది. కావున ముండకమునందు ఆప్తకాములగు ఋషులకు ప్రాప్యస్థానముగా నిర్ణయింపబడిన సత్యశబ్దవాచ్యతత్త్వము శివతత్త్వమని తెలుచున్నది.

## అమృతుడు

ఇప్పటివరకును సత్యశబ్ద మీశ్వరవాచక మని నిర్ణయింపబడినది. ఇక నమృతశబ్దవిషయము గాంతము. మృఙ్ ప్రాణత్యాగే అనుధాతువునకు క్తప్రత్యయము చేర్చుటవలన మృతశబ్ద మేర్పడుచున్నది. భావార్థక క్తప్రత్యయము చేరిన మృతశబ్దమునకు మరణమని యర్థము. కర్త్రర్థక క్తప్రత్యయముచేరిన మరణింపనియని యర్థము. న విద్యతే మృతం యస్య సః అమృతః = మరణములేనివా డనియును, న మృతః అమృతః = మరణించనివా డనియును నమృతశబ్దార్థము. ఇక దేవతామండలిలో మరణములేనివాడు, మరణింపనివా డెవరో గాంతము.

'మృత్యుంజయః కృత్తివాసాః' అనునిఘంటువు ననుసరించి దేవతా మండలిలో మృత్యుంజయశబ్ద మొక్క శివునియందే రూఢి నందినది.

క్షరం ప్రధాన మమృతాక్షరగ్ం హరః
క్షరాత్మానా వీశతే దేవ ఏకః
త స్యాభిధ్యానా ద్యోజనా త్తత్త్వభావా
ద్భూయ శ్చాంతే విశ్వమాయానివృత్తిః

అను శ్వేతాశ్వతరమంత్రము ప్రకృతి పరిణామశీల మనియును, శివు డమృతుడు=మరణము లేనివాడును, పరిణామము లేనివాడు నని యును ప్రతిపాదించుచున్నది. ఈమంత్రమునం దమృతశబ్దము హరశబ్ద మునకు విశేషణముగా ప్రయోగింపబడినది. ఈమంత్రము ననుసరించి శివు డమృతుడు=మరణములేనివా డని తేలుచున్నది.

## అమృతశబ్దార్థము-జాబాలము

ఒకప్పుడు బ్రహ్మచారులు యాజ్ఞవల్క్యుని సమీపించి

అథ హైనం బ్రహ్మచారిణ ఊచుః
కింజప్యే నామృతత్వం నో బ్రూహీతి

ఏదేవునినామజపమువలన మా కమృతత్వము కలుగునో చెప్పు మని ప్రశ్నించిరి. యాజ్ఞవల్క్యుడు 'శతరుద్రియేణేతి'=శతరుద్రియ మనగా రుద్రాధ్యాయజపముచే నమృతత్వము గలుగునని సమాధానము చెప్పి ప్రశ్నకు సమాధానము రాలేదని బ్రహ్మచారులు శంకింపవచ్చు నని తలంచి

ఏతాని హ వా అమృతస్య నామధేయాని,
ఏతై ర్హ వా అమృతో భవతి

రుద్రాధ్యాయమునందలి రుద్రగిరిశాదినామము లమృతుని వని

యును, అమృతునిజపమువలన నమృతు డగుననియును చెప్పినవిషయము జాబాలోపనిషత్తునందు గలదు.

## అమృతశబ్దార్థము-బృహదారణ్యకము

ఒకప్పుడు విదేహాధిపతియగు జనకుడు బహుదక్షిణాకమగు యజ్ఞము గావించెను. ఆయజ్ఞమునకు కురుపాంచాలదేశములనుండి బ్రాహ్మణులు వచ్చిరి. అంత జనకునకు వీరిలో నెవ రనూచానతము లను (సాంగం వేద మధీత్య త మేవ అను పశ్చాత్ ఉక్త్వా సనూచానః = శిక్షాదిషడంగములతో నాలుగువేదముల నధ్యయనము గావించి శిష్యుల నధ్యయనము చేయించినవా డనూచానుడు) నాలోచన గలిగి సాలంకృతములగు వేయిగోవులను రావించి మీలో బ్రహ్మిష్ఠుడగునాత డీగోవులను దక్షిణగా గైకొనుగాక యని వచించెను. కాని వారియం దెవరును నాదక్షిణను గైకొనుటకు ముందుకు రారైరి. అంత యాజ్ఞవల్క్యుడు తనశిష్యుడగు సామశ్రవుని పిలిచి యీగోవులను తోలుకొనిపొమ్మని యాజ్ఞాపించెను. అది గాంచి మహర్షు లీతడు మనలో బ్రహ్మిష్ఠుడా యని క్రోధావిష్టు లైరి. కాని యొకరును నాతని ప్రశ్నించుటకు సాహసింపరైరి. అంత జనకునిహోతయగు అశ్వలుడను నాతడు యాజ్ఞవల్క్యుని గాంచి నీవు మాలో బ్రహ్మిష్ఠుడ ననిగదా ఆవులను తోలుకొనిపొ మ్మనినావు? మేము బ్రహ్మిష్ఠునకు నమస్కరింతుము. మేమును గోవులకొఱకే వచ్చితి మని వచించి యాజ్ఞవల్క్యుని ప్రశ్నింప నారంభించెను. యాజ్ఞవల్క్యు డాతనిప్రశ్నలకు సమాధాన మిచ్చినంతనే జారత్కారవుడు, లాహ్యాయని, చాక్రాయణుడు, గార్గి, ఉద్దాలకుడు, శాకల్యుడు మొదలగువా రడిగినప్రశ్న యడుగకుండ ప్రశ్నింప నారంభించిరి. యాజ్ఞవల్క్యుడును తడబడకుండ నన్నిప్రశ్నలకును తగిన సమాధానము లిచ్చి వారిని సంతృప్తిపరచినాడు.

తరువాత యజ్ఞకర్త జనకుడు తనసందియములను ప్రదర్శించి

సమాధాన మొసంగుమని యడిగెను. యాజ్ఞవల్క్యుడును జనకునిసర్వ సందియములకు తగినసమాధానము లొసంగి యాతని తృప్తిపరచెను. చివరకు జనకుడు మోక్షవిషయకప్రశ్న గావించెను. యాజ్ఞవల్క్యు డిచ్చిన సమాధానములకు తృప్తి సనక మరలమరల మోక్షవిషయక ప్రశ్ననే యడుగుచుండెను. ప్రతిసమాధానాంతమునను గోసహస్రాశ్వా దులను సమర్పించుచుండెను. చివరకుసర్వసందేహానివారణ మైనంతనే జనకుడు తనరాజ్యమును సమర్పించి ఆత్మార్పణము గావించెను.

ఇయ్యది బృహదారణ్యకోపనిషత్తుయొక్క తృతీయాధ్యాయము నందలి గాథ. ఈయధ్యాయమునందలి సప్తమబ్రాహ్మణమునకు అంత ర్యామిబ్రాహ్మణ మని పేరు. ఈబ్రాహ్మణమందు ప్రాశ్నికు డుద్దాలకుడు. ఉద్దాలకుడు యాజ్ఞవల్క్యుని గాంచి 'యజ్ఞదక్షిణగా నిర్ణయింపబడిన గోసహస్రమును తోలుకొనిపొమ్మని యాజ్ఞాపించినావు. అంతర్యామి విషయము సమగ్రముగా వివరించి గోవులను తీసికొనిపొమ్ము. ఈవిష యము తెలియక, సమగ్రముగా వివరింపక ఆవులను తోలుకొనిపోయిన నీతల పడిపోవు నని పలికెను. అంత యాజ్ఞవల్క్యు డంతర్యామివిషయ మును వివరించుట కారంభించెను. అంతర్యామివిషయము వివరింప బడుటచే సప్తమబ్రాహ్మణమున కంతర్యామిబ్రాహ్మణ మను సార్థక వ్యవహారము కలిగినది.

> యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద
> యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయతి ఏష
> త ఆత్మాంతర్యా మ్యమృతః

ఎవడు పృథివియందుండి పృథివికన్న భిన్నముగ నున్నాడో, ఎవనివిషయము పృథివికి తెలియదో, ఎవనికి పృథివి శరీరభాగమో, ఎవడు పృథివియందుండి పృథివిని నియమించుచున్నాడో ఈయమృతుడు నీకును నంతర్యామిగా నున్నాడు.

ఇయ్యది యంతర్యామిబ్రాహ్మణమున నంతర్యామినిర్ణయప్రస్తావమున మొదటిమంత్రము. ఈవిధముగ నాబ్రాహ్మణమున జలఅగ్ని అంతరిక్ష వాయుద్యులోకఆదిత్యదిక్చంద్రతారకసర్వభూతప్రాణవాక్చక్షుః శ్రోత్రమనోవిజ్ఞానములను ప్రస్తావించి జలాదుల కంతర్యామిగానున్న పరమేశ్వరుడే నీయందును నంతర్యామిగా నుండి నిన్ను శాసించుచున్నాడని ప్రతిపాదింపబడినది. ఇందు ప్రతిపర్యాయమును 'ఏష త ఆ త్మాంతర్యా మ్యమృతః' అనువాక్యము ప్రతిఖండమునందును మకుటముగా ప్రయోగింపబడినది. మఱియును నాసర్వనియామకతత్త్వ మమృతశబ్దవాచ్య మని ప్రతిపాదింపబడినది.

జాబాలబృహదారణ్యకోపనిషత్తులందు ప్రతిపాదింపబడిన యమృతతత్త్వ మొకటి యనియును, నాతత్త్వము రుద్రాధ్యాయప్రతిపాదితశివతత్త్వముకన్న భిన్నము గా దనియును నంగీకరింపకతప్పదు. కానిచో నేకవాక్యతకు భంగము కలుగును.

జననమరణరూపసంసరణబంధమునుండి విడివడగోరినవానికి ముముక్షు వని వేదాంతములయందు వ్యవహారము. జన్మించినాడు, మరణ మాసన్నముగ నిత్యసన్నిహితముగ నున్నది. మరణము లేకుండ జేసికొనినచో మఱల జన్మించవలసిన యావశ్యకత యుండదు. 'ధ్రువం జన్మ మృతస్య చ' అనుగీతావాక్యము మృతునకు జన్మ తప్పదని బోధించుచున్నది. కావున ముముక్షువునకు ప్రస్తుతకర్తవ్యము మృత్యువునుండి విడివడుట – అనగా నమృతుడు = మరణములేనివా డగుట. అయిన నీస్థితి యెవరివలన గలుగును? మరణములేనివానిని సేవించిన, ఉపాసించిన మరణములేనిస్థితి సంభవించును.

ఈయుద్దేశముతోడనే బ్రహ్మచారులు యాజ్ఞవల్క్యు నభిగమించి 'కింజప్యే నామృతత్వం నో బ్రూహి' = ఎవరినామము జపించిన, ఎవరి నుపాసించిన మా కమృతత్వము కలుగునని ప్రశ్నించిరి. యాజ్ఞవల్క్య

డమృతుడు శివు డనియును శివనామము జపించిన నమృతత్వము = మరణ రాహిత్యము గలుగుననియును, శివమహిమ రుద్రాధ్యాయము - నమ కమునందు - ప్రస్తావింపబడిన దనియును సమాధాన మొసంగినాడు.

వ్యక్తిగౌరవము ననుసరించి యాతనివాక్యములకు విలువ యుండును. యాజ్ఞవల్క్యుడు జనకునియజ్ఞములో సమావేశమైనవారిలో నొకడు. జనకుడు సమావేశమైనవారిని గాంచి మీలో ననూచానతము డగునాత డీగోసహస్రదక్షిణను గైకొనుగాక యని వచింప నెవరును సిద్ధపడమి తా నాదక్షిణను గ్రహించి బ్రాహ్మణు లెదిరింప వారి ప్రశ్నలకు సంతృప్తికరములగు సమాధానముల నొసంగి జనకునకు బ్రహ్మవిద్యోపదేశము చేసిన గురువు. మఱియును నాదిత్యునివలన వేదము నభ్యసించినవాడు. అట్టియనూచానతముడగు యాజ్ఞవల్క్యుడు గావించిన తత్త్వనిర్ణయమున నెట్టిసందేహమునకును నవకాశము లేదు. కావున యాజ్ఞవల్క్యుడు జాబాలములో బ్రహ్మచారుల కుపదేశించిన తత్త్వమును, బృహదారణ్యకములో జనకాదుల కుపదేశించిన తత్త్వ మును నొకటియే యనియును, నయ్యది రుద్రాధ్యాయప్రతిపాదితశివ తత్త్వమే యనియును తెలుచున్నది.

ముముక్షుశబ్దమునకు మరణమునుండి విడివడగోరువా డని యర్థ మని వివరించినాము. అమృతీభవనమే, మరణములేనివా డగు టయే ముముక్షువుయొక్క పరమాశయము. కావున ముముక్షుత యన్నను, అమృతీభవన మన్నను నొకటియే. ఈకారణమువలననే యుపనిషత్తులందు ముముక్షుప్రశ్నలందుగాని, గురుసమాధానములందు గాని యమృతశబ్దము ప్రచురముగా నున్నది.

అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్య యామృత మశ్నుతే — ఈశ
ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్ — కేన
హృదా మనీషా మనసాభిక్లృప్తో య ఏతద్విదు రమృతా స్తే భవంతి — కఠ
స ఏషోఽకలోఽమృతో భవతి త దేష శ్లోకః — ప్రశ్న

ఇంకొకవిషయము. పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ నిర్వేద మాయాత్ = లోకములు కర్మఫలవ్యాప్తములని నిర్విణ్ణుడైన వ్యక్తి 'తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే = ముముక్షువై, సంసారబంధమోక్షము గోరి యాత్మబుద్ధి ప్రకాశకుడగు శివుని శరణుపొందెదనని సంకల్పించి జుష్ట స్తత స్తే నామృతత్వ మేతి = శివానుగ్రహము లేక అమృతత్వము లభింపదను నిశ్చయమునకు వచ్చి వ్రత మేత త్పాశుపతం తత్సమాచరే మ్ముముక్షు రపునర్భవాయ = మరణాభావపూర్వక అపునర్భవముకొఱకు పాశుపత వ్రతము నవలంబించి ఉర్వారుక మివ బంధనా న్మృత్యోర్ముక్షీయ = పండినదోసకాయ తొడిమనుండి యూడునట్లు మృత్యువునుండి విడివడుటకు పురా తనయిత్థో రచిత్తా ద్ధిరణ్యారూప మవనే కృణుధ్వమ్ = మరణమునకుపూర్వమే రక్షణముకొఱకు శివారాధన మారంభించినాడు. ఈశం తం జ్ఞాత్వా అమృతా స్తే భవంతి = శివు నుపాసించి యమృతుడు = మరణరహితుడు, శివుడైనాడు. కావున వేదవేదాంతముల పరమతాత్పర్యము శివారాధనవలననే యమృతత్వము లభించుననియును, అమృతత్వమే పరమలక్ష్య మనియును తెలుచున్నది.

ఈవిమర్శచే నుపసంహారమంత్రమునందలి సత్యాఅమృతశబ్దములు శివవాచకములని తెలుటచే నుపక్రమోపసంహారముల యేకవాక్యతకెట్టిభంగమును లేదని తెలుచున్నది.

## అభ్యాసమ:

ఉపక్రమగతవిషయము నుపసంహారములోపల మఱిలమఱిల ప్రస్తావించుటయును, లేక ఫలవిషయమును ప్రస్తావించుటయును అభ్యాసమని వివరించినాము. కేనోపనిషత్తునం దుపక్రమమున పరమేశ్వరుని ధీప్రేరకత్వరూపలింగము ప్రతిపాదింపబడిన దనియును, ఉపసంహారమునం దమృతశబ్దముచే పరమేశ్వరప్రస్తావము గావింపబడిన దనియును

వివరించినాము. ఈవిషయ ముపక్రమోపసంహారములమధ్య నేవిధముగ నభ్యసింపబడినదియు గాంతము.

ప్రథమఖండము – ద్వితీయమంత్రమున 'అమృతా భవంతి' అను వాక్యముచే నమృతీభవనరూపఫలము ప్రస్తావింపబడినది. నాలవమంత్రమునందు 'త దేవ బ్రహ్మ త్వం విద్ధి' అనువాక్యముచే బ్రహ్మప్రస్తావము గావింపబడినది. ఈవాక్యము 5, 6, 7, 8 మంత్రములయందు మఱలమఱల మకుటవాక్యముగా గైకొనబడినది. ద్వితీయఖండము – నాలవమంత్రమునందు అమృతత్వప్రాప్తికి విద్య సాధనముగా ప్రతిపాదింపబడినది. ఐదవమంత్రమునం దమృతీభవనరూపఫలప్రస్తావము గావింపబడినది.

## అపూర్వత

వేదేతరప్రమాణాప్రాప్తత అపూర్వత. కేనోపనిషత్తునందు మన ఆదిసర్వేంద్రియప్రేరకుడు పరమేశ్వరు డనియును (1–1), ఇంద్రియసంబంధము తొలగినగాని యమృతీభవనమున కవకాశము లేదనియును (1–2), బ్రహ్మతత్త్వము సర్వేంద్రియాతీత మనియును (1–3), ఉపాసన యమృతప్రాప్తిసాధన మనియును, ఈజన్మమునందే పరమేశ్వరారాధనము గావింపవలయు ననియును లేనిచో గలుగు నష్టము భరింపరాని దనియును, కావున ధీరులు సర్వభూతవిషయమును సమగ్రముగా చర్చించి యీలోకసంబంధము వదలి యమృతు లగుచున్నా రనియును (2–5) నీమొదలగువిషయములు ప్రతిపాదింపబడినవి. ఈవిషయములు వేదాంతములయందుదప్ప మఱియేయితరగ్రంథమునందును లభింపవు. ఒకవేళ నీవిషయము లితరగ్రంథములందు లభించినను నాగ్రంథముల యం దుపనిషత్తులందు వర్ణింపబడినవిషయములే యనువదింపబడినవి.

## ఫలము

ఫల మనగా ప్రయోజనము. ఫలము నుద్దేశింపక యెవరును నేకార్యమును చేయరు. ముముక్షు వుపనిషదధ్యయనము గావించుట సాయుజ్యరూపమహాఫలము నుద్దేశించియే. ఈవిషయము ముముక్షు శబ్దమువలననే సూచింపబడుచున్నది. మోక్తు మిచ్ఛుః ముముక్షుః = ముముక్షు వనగా విడివడుటకు కోరినవాడు. దేనినుండి విడివడుటకు గోరినవాడు?

కామాన్ యః కామయతే మన్యమానః
స కామభి ర్జాయతే తత్రతత్ర
పర్యాప్తకామస్య కృతాత్మన స్తు
ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః        ముండక 3-2-2

సకామకర్మల నాచరించుటవలన కర్మఫలానుభవమునకై యాయాలోకములయందు మఱలమఱల జన్మించుచున్నాడు. పర్యాప్త కాముడగువానికి కోరిక లన్నియును నశించుటచే మఱల జన్మ లేదు. కావున సకామకర్మాచరణము జన్మపరంపరకును, పర్యాప్తకామత్వము జన్మరాహిత్యమునకును కారణ మగుచున్నది. మరణింపకున్న జన్మ యుండదు. అయిన మరణింపకుండుట కేమి గావింపవలయును? జన్మ యిచ్చినవాని యనుగ్రహ మున్నగాని మరణము తొలగదు. 'సోఽకామయత బహు స్యాం ప్రజాయే యేతి' 'య దిదగ్ం సర్వ మసృజత' పరమేశ్వరుడు సంకల్పపూర్వకముగ నీసృష్టి గావించెనని తేలుటచే 'తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే' ఆత్మబుద్ధిప్రకాశకుడగు నాపరమేశ్వరుని శరణుపొంది 'త్రియంబకం యజామహే' ఆపరమేశ్వరు నుపాసించి 'మృత్యో ర్ముక్షీయ మామృతాత్' మృత్యువునుండి విడివడుదును, అమృతునినుండి విడివడ ననునిశ్చయమునకు వచ్చినాడు. కావున మృత్యుమోక్షమే ఫల మని తేలుచున్నది.

# అర్థవాదము

అర్థ మనగా ప్రయోజనము. ప్రయోజనము సాధించువిషయ మున తత్ప్రవృత్తి గలిగించుటకై రోచకముగా నుపపాదించు నాఖ్యాయిక కర్థవాద మని పేరు. లోకమునందును ధర్మాచరణమం దభిని వేశము గలిగించుటకై ధర్మము నాచరించి తత్ఫలము ననుభవించిన వారికథల నుదాహరణముగా ప్రతిపాదించుట ప్రచారమునం దున్నది. ఇట్టివే హరిశ్చంద్రాదులకథలు.

ప్రకృతవిషయము పరమేశ్వరమహిమాప్రస్తావముద్వారా శివాల్పత్వమును ప్రతిపాదించి తద్ద్వారా పరమేశ్వరారాధనప్రవృత్తి గల్పించి తరించుటకు మార్గమును చూపుట. ఇయ్యది ప్రథమద్వితీయఖండము లందు ప్రతిపాదింపబడినది. మూడవఖండమునం దుదాహరణముగా దేవతలవిజయోత్సవము ప్రతిపాదింపబడుచున్నది.

ఒకప్పుడు దేవాసురులకు యుద్ధము సంభవించినది. అందు శివానుగ్రహమువలన దేవతలు జయించిరి. కాని యావిషయమును మఱచి-శివారాధనవలననే తమ కీస్వర్గాధిపత్యాదులు సమకూరిన వని యును, శివానుగ్రహమువలననే తమ కీమహిమ గలిగిన దనియును మఱచి - దేవతలు 'అస్మాక మే వాయం విజయః' = ఈవిజయము మనదే. మనమై యీవిజయమును సాధింపగలిగినాము. 'అస్మాక మే వాయం మహిమా' = ఈమహిమయంతయును మనదే యని గర్వించి విజయోత్సవము చేసికొనసాగిరి. దేవతలు శివారాధన గావించి స్వస్వపదవులు పొందిరనువిషయము

తవ శ్రియే మరుతో మర్జయంత రుద్ర ! య త్తే జనిమ చారు చిత్రమ్
పదం య ద్విష్ణో రుపమం న్యధాయి తేన పాసి గుహ్యం నామ గోనామ్

అనుమంత్రముచే ప్రతిపాదింపబడినది. మఱియును నీవిషయము

బ్రహ్మణః సృష్టికర్తృత్వం విష్ణో ర్దానవమర్దనమ్
స్వర్గాధిపత్య మింద్రస్య శివపూజావిధేః ఫలమ్

అనుశ్లోకముచే పురాణములందుపబృంహింపబడినది. మఱియును నింద్రాదిదిక్పాలకులు శివారాధన గావించి యాయాపదవులు పొందిరనువిషయము స్కాందాంతర్గతకాశీఖండమునందలి శివశర్మోపాఖ్యానమున విపులీకరింపబడినది.

గర్వము పతనహేతువు. గర్వియగువాడు గర్వాతిరేకమువలన కన్నుమిన్నెఱుంగక కావించునకార్యములకు మితియుండదు. గర్వము నశించినగాని స్వస్థితియు, పరస్థితియు తెలియదు. ఈవిషయము చక్కగా నవగతమైనగాని తనయల్పత్వమును గమనించి వ్యక్తి ధర్మాచరణమున కుత్సహింపడు. కావున స్వారాధకులగు దేవతలు గర్వమువలన నధఃపతనము జెందనున్నారని యెంచి పరమేశ్వరుడు దేవతలు విజయోత్సవము గావించుకొనుచున్న ప్రదేశమునకు కొలదిదూరమున యక్షరూపమున ప్రాదుర్భవించెను.

దేవత లాయక్షుని గాంచి యాత డెవరో తెలిసికొనగోరి యగ్నిని నీ వేగి యాత డెవరో తెలిసికొనిర మ్మని పంపిరి. అగ్నియును నాతనిసన్నిధి కేగెను. అంత నాయక్షు డగ్నిని 'నీ వెవ' రని యడుగ 'నే నగ్నిని, జాతవేదుడ' నని సమాధాన మొసంగెను. (అగి గతౌ అను ధాతువువలన అగతి కుటిల మూర్ధ్వం వా గచ్ఛతీతి యను నిష్పత్తి వలన నిష్పన్నమైన అగ్నిశబ్దమునకు కుటిలముగాగాని, యూర్ధ్వముగాగాని ప్రసరించువా డని యర్థము. జాతే జాతే విద్యత ఇతి జాతవేదాః అనువిగ్రహమువలన నిష్పన్నమైన జాతవేదశబ్దమునకు ప్రతిప్రాణియందును జాఠరాగ్నిరూపమున నుండువాడని యర్థము). అది విని యక్షుడు 'అయిన నట్టినీప్రభావ మే' మని యడుగ 'ఈపృథివియందలి సర్వమును దహింతు' నని సమాధాన మిచ్చెను. 'మంచిది, ఈగడ్డిపోచను

దహించు' మని యక్షు డాతనిముం దొకతృణము నుంచెను. అగ్నియును తనశక్తినంతయు నుపయోగించియును దహింపజాలక లజ్జితుడై తిరిగి పోయి 'యాత డెవరో తెలియ' దని చెప్పెను.

అంత దేవతలు 'ఆత డెవరో తెలిసికొనిర' మ్మని వాయువును పంపిరి. వచ్చినవాయువును గాంచి యక్షుడు 'నీ వెవరవు? నీప్రభావ మే' మని యడుగ 'నేను వాయువును. నన్ను మాతరిశ్వుం డందు' రని సమాధాన మిచ్చెను. 'అయిన నీప్రభావ మే' మని యడుగ వాయువు 'పృథివియందలి సర్వమును కదలింపగల' నని సమాధాన మిచ్చెను. 'మంచిది. దీనిని కదలించు' మని యక్షు డాతనిముం దొకతృణము నుంచెను. వాయువును నాతృణమును కదలింపజాలక లజ్జితుడై తిరిగి పోయి 'యాత డెవరో తెలియ' దని చెప్పెను.

అంత దేవత లింద్రుని గాంచి 'నీ వేగి యాత డెవరో కనుగొనిర' మ్మన నింద్రు డాయక్షుడున్న ప్రదేశమున కేగెను. కాని యక్షు డంత ర్ధానమయ్యెను. అంత నిర్విణ్ణుడై యింద్రు డేమి చేయుటకును పాలుపోక నలుదెసలు పరికించుచుండ నాకాశమున హిమవత్పుత్రికయగు నుమా దేవి కన్పడ నాయక్షు డెవరని యామె నడిగెను. యక్షరూపమున ప్రాదుర్భవించినయాతడు పరమేశ్వరు డనియును, నాతనియనుగ్రహము వలననే దేవతలు జయము గాంచిరనియును, ఆకారణమువలననే యీ యుత్సవమును గావించుకొనుచున్నా రనియును చెప్పెను. అంత నింద్రుడు యక్షరూపమున తమయొద్దికి వచ్చినది పరమేశ్వరుడే యని తెలిసికొనెను.

ఇప్పటివర కాఖ్యాయికావిషయము వివరింపబడినది. ఇక నీయాఖ్యాయిక నుపనిషత్తునందు నిబంధించుటలో నుద్దేశ మేమియో గాంతము. ఆఖ్యాయిక దేవతలవిజయోత్సవముతో నారంభమైనది. రాక్షసులను జయించి దేవతలు విజయోత్సవ మారంభించినారు.

ఇంద్రాదిదిక్పాలకులు శివారాధన గావించి స్వస్వపదవుల నందినారు. కాని శివానుగ్రహమువలననే తాము రాక్షసులను జయింపగలిగినా మనువిషయమును మఱచి 'అస్మాక మే వాయం విజయః, అస్మాక మే వాయం మహిమా' అని గర్వించినారు. గర్వ మధఃపతనమునకు కారణము. గర్వప్రవేశముతో వివేకము నశించును. అంతతో స్వపర విషయకజ్ఞానము నశించును. కావున నింద్రాదులకు స్వాల్పత్వజ్ఞానము గలిగించుతలంపుతో పరమేశ్వరుడు యక్షరూపమున నవతరించి సర్వ భక్షకుడగు నగ్నియొక్కయు, ప్రకంపనుడగు వాయువుయొక్కయు వీర్య మల్పాల్పమని రుజువుచేసెను. దానితో దేవతలకు స్వాల్పత్వ జ్ఞానము గలిగి గర్వభంగ మైనది. జ్ఞానోదయ మైనది. అంతట వారు తమకు గర్వభంగము గావించినవ్యక్తి సామాన్యుడు గాడని నిర్ణయించి కొని యావిషయము తెలిసికొనుట కింద్రుని పంపిరి. ఇంద్రు డేగునప్పటి కావ్యక్తి యంతర్ధానమందుటచే నేమి చేయుటకును తోచక దిసలు పరికించుచుండ హైమవతి ప్రత్యక్ష మయ్యెను. ఆమె నడుగ నామె పరమేశ్వరుడే యారూపమున వచ్చెనని సమాధానము చెప్పెను. హైమవత్యుపదేశముతో నింద్రునకు బ్రహ్మవిషయకజ్ఞానము గలిగెను.

ఇక విషయవిమర్శ గావింతము. గర్విష్ఠులగువారికి గర్వముక కాఘాతము గలుగుటయే జ్ఞానోదయమునకు నాంది. మంచిది. ఇంత వర కే మైనది? గర్వము ఛిన్నాభిన్న మైనది. అంతటితో నే మైనది? స్వాల్పత్వజ్ఞానము గలిగినది. కాని గర్వభంజకు డెవరో తెలియలేదు. కారణ మగ్నివాయువులకు గర్వభంగము గావించినవ్యక్తి యక్షరూప మున నున్నాడు. కాని యక్షున కింత సామర్థ్యమా? కావున గర్వ భంగము గావించినవ్యక్తి సామాన్యయక్షుడు గాడు. అయిన నెవరు? తెలిసికొనుట యెట్లు? ఇంద్రుడు స్వర్గాధిపతి. కావున నాతని పంపిరి. ఆవ్యక్తి యంతర్థానమందెను. అయిన తెలిసికొనుట యెట్లు?

అగ్నివాయువులకు గర్వభంగమైనది. సిగ్గుపడి మరలిపోయినారు. కాని తమకు గర్వభంగము గావించినవ్యక్తి యెవరో తెలిసికొనుటకు వారు ప్రయత్నింపలేదు. కారణము గర్వభంగమువలన గలిగిన లజ్జాతిశయమే. గర్వభంగమువలన వివేకము గలుగవలసినది. కాని లజ్జ యాస్థానము నాక్రమించినది. వివేకము గలిగిన వారు వస్తుతత్త్వవిచారమునకు ప్రయత్నించెడివారు. లజ్జ గలుగుటచే వారు మరలిపోయిరి. తమభంగపాటును విన్నవించికొని తృప్తి జెందిరి.

తరువాత నేగినవా డింద్రుడు. ఆత డేగునప్పటికి యక్షు డాస్థానమున లేడు. ఏమి చేయవలయును? అగ్నివాయువులవలె మరలిపోవలసినవాడే. కాని యొకవిశేష మున్నది. ఇంద్రునకు పరీక్ష లేదు, గర్వభంగము గాలేదు. కావున నాతడు తిరిగిపోవలసిన యావశ్యకత లేదు. అగ్నివాయువులవలె గాక యాతనికి వివేకోదయ మైనది. ఆలోచింప నారంభించినాడు——

విజయోత్సవమున నిదేమి? ఈయక్షు డెవరు? దహనప్రకంపనులకు గలిగిన యీపరాభవ మేమి? సర్వభక్షకుడు తృణమును దహింపలేకపోయినాడా? బ్రహ్మాండముల నుఱ్ఱూత లూగించు ప్రకంపనుడు గడ్డిపోచను కదలించలేకపోవుటయా? ఎంత యాశ్చర్యము! ఆశ్చర్యములలో నాశ్చర్యము నా కాతనిదర్శనమైన గాలేదే! అగ్నివాయువుల శక్తిని పొల్లు గావించిన యాతడు సర్వశాసకుడు, సర్వేశ్వరుడు గావలయును! ఆతనిని సాక్షాత్కరింపజేసికొనుట యెట్లు? ఇది యొకయగ్నివాయువుల గర్వభంగమే గాదు! ఈగర్వభంగము సర్వదేవతామండలికిని లజ్జాకారణము గాక కనువిప్పు గావలయును. పరాభవకారణమైనను నగ్నివాయువులకు యక్షరూపముననైనను నాసర్వేశ్వరదర్శన మైనది. నా కామాత్రమైనను —— పరాభవపూర్వకదర్శనమైనను —— గాలేదు. నేను పంపినవారిపరాభవము నాది గాదా? మంచిది. ఏమైనను నా కాతనిదర్శన మగుట యెట్లు?

ఈవిధముగ పరితపించి తద్దర్శనమునకై తహతహలాడుచు నేమి చేయుటకును, నెటు బోవుటకును తోచక నిర్విణ్ణుడై నలుదెసలు పరికించుచుండెను. నిర్వేదము స్థిరత నందుటచే నుపదేశార్హత గలిగినది. విద్యాస్వరూపిణియు, పరమేశ్వరుని యర్ధాంగమగు హైమవతి సాక్షాత్కరించినది. ఉపదేశ మిచ్చినది. ఏ మని? యక్షరూపమున సాక్షాత్కరించినది యీశ్వరుడట! ఆతనియనుగ్రహమువలననే దేవతలు రాక్షసులను జయింపగలిగినారట!

ఈవిమర్శవలన తేలిన సారాంశ మేమో గాంతము. ఈయాఖ్యాయికవలన నీక్రిందివిషయములు స్పష్టముగా ప్రతిపాదింపబడినవి.

1. జీవుల యల్పశక్తిమత్త్వము
2. పరమేశ్వరుని సర్వశక్తిమత్త్వము
3. శివానుగ్రహము లేనిది యేకార్యమును నెరవేరదు
4. గర్వము పతనహేతువు
5. గర్వభంగము వివేకోదయమునకు హేతువైననే కార్యకారియై వస్తుతత్త్వజ్ఞానమున కుపయోగపడును
6. వివేకోదయమై తత్త్వజ్ఞానాభినివేశము గలిగినగాని యుపదేశార్హత గలుగదు
7. తత్త్వజ్ఞానమాత్రమువలన సాయుజ్యము లభింపదు
8. సాయుజ్య ముపాసనామాత్రముచేతనే సాధ్య మగును

ఇందు మొదటియాఱువిషయములును నాఖ్యాయికోద్దేశవివరణసందర్భమున వివరింపబడినవి. ఇక చివరిరెండువిషయములను గాంతము. కేవలతత్త్వజ్ఞానమువలన సాయుజ్యము లభింప దనునది మొదటివిషయము. అగ్నివాయువులు యక్షునిసన్నిధి కేగినారు. పరీక్షింపబడినారు. స్వశక్తివైయర్థ్యమును గాంచి మరలి వచ్చినారు. అప్పటికిని నాయక్షు డెవరో తెలిసికొనవలయునను నభిలాషయే వారికి

గలుగలేదు. మఱి యింద్రునివిషయ మట్లు గాదు. ఇంద్రుడు యక్ష విషయమును తెలిసికొనుటకు మొదట నగ్నిని, తరువాత వాయువును పంపినాడు. వారిద్దఱును పరాభూతులై వచ్చినతరువాత తాను స్వయముగ నేగినాడు. యక్షు డంతర్ధానమందినాడు. తరువాత హైమవతీదర్శన మైనది. ఆమె నడిగినాడు. ఆమె బ్రహ్మయని సమాధాన మిచ్చినది. ఇంద్రునకు విషయపరిజ్ఞానము గలిగినది. ఆఖ్యాయిక పూర్తియైనది.

ఇక నాఖ్యాయికలో ఫలవిషయ మేవిధముగా ప్రతిపాదింపబడినదో గాంతము. ఈవిషయము చతుర్థఖండమున రెండుమూడు మంత్రములయందు ప్రతిపాదింపబడినది.

'అగ్ని ర్వాయు రింద్ర స్తే హ్యేన న్నేదిష్ఠం పస్పర్శు
స్తే హ్యేన త్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి'

అగ్నివాయ్వింద్రులు యక్షసమీపమున కేగినారు. కావున దేవతలందరిలో శ్రేష్ఠులైనారు. ఈముగ్గురిలో నింద్రుడు హైమవతిని దర్శించి యక్షుడు బ్రహ్మయని యామెవలన తెలిసికొనుటచే శ్రేష్ఠతము డైనాడు.

ఆఖ్యాయిక ఇంద్రుని శ్రేష్ఠతమత్వవర్ణనతో ముగిసినది. కాని యింద్రున కమృతత్వము గలిగినటుల వర్ణింపలేదు. కావున నమృతత్వము కేవలబ్రహ్మవిషయకజ్ఞానమున ప్రాప్తించదని తేలుచున్నది. అమృతత్వప్రాప్తికి పూర్వరంగ మీయుపనిషత్తునందే ప్రథమఖండమునందలి

| | |
|---|---|
| ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి | 1–2 |
| విద్యయా విందతేఽమృతమ్ | 2–4 |
| ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి | 2–5 |

అనుమంత్రములచే ప్రతిపాదింపబడినది. అస్మాత్ లోకాత్ = ఈలోకమును విడిచి, ప్రేత్య=ప్రకృష్టదశను పొంది, అమృతాః=మరణ

రహితులు, (శివులు అనగా శివసాధర్మ్యమును పొందినవారు) భవంతి= అగుచున్నారు. మఱియును నీప్రకృష్టదశాప్రాప్తికి విద్యయా=ఉపాసన సాధనమని ప్రతిపాదింపబడినది. కావున నమృతత్వము కేవలబ్రహ్మావిష యకపరిజ్ఞానమువలన గలుగ దనియును, నయ్యది యుపాసనైకమాత్ర సాధ్య మనియును తేలుచున్నది.

## ఉపపత్తి

ఉపపత్తి యనగా విరోధాభావ మని వివరించినాము. సర్వజ్ఞ తాదిసంపత్తి కుపపత్తి యనియును వ్యవహారము గలదు. విరోధాభావ మనగా ప్రతిపాద్యమానవిషయమునం దెట్టివైరుధ్యమును లేకుండుట. ప్రతిపాద్యమానవిషయము జీవాల్పత్వపరమేశ్వరమహత్త్వప్రతిపాదన ద్వారా ఉపాసనయందు ప్రవృత్తి గలిగించి సాయుజ్యమునకు మార్గ మును చూపవలెను. ఈవిషయము ప్రథమద్వితీయఖండములయందు ప్రతిపాదింపబడినది. మఱియును నీవిషయము తృతీయఖండమున నాఖ్యాయికారూపమున ప్రపంచింపబడినది.

> కే నేషితం పతతి ప్రేషితం మనః
> కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
> కే నేషితాం వాచ మిమాం వదంతి
> చక్షుఃశ్రోత్రం క ఉ దేవో యునక్తి

ఇయ్యది కేనోపనిషత్ప్రథమఖండమునందలి ప్రథమమంత్రము. పరమేశ్వరప్రేరణచేతనే సర్వప్రాణులును జీవింపగలుగుచున్నా రని యీమంత్రమునందు ప్రతిపాదింపబడినది. ఆఖ్యాయికయందును శివాను గ్రహమువలననే దేవతలు జయింపగలిగినా రనువిషయమును ప్రతి పాదించుటద్వారా ప్రథమమంత్రప్రతిపాదితజీవపరమేశ్వరాశ్రయత్వము ప్రపంచింపబడినది. ఈవిషయ ముపనిషదంతరమునందును

కో హ్యే వాన్యా త్కః ప్రాణ్యా ద్య దేష ఆకాశ ఆనందో న స్యాత్ అనుమంత్రముచే ప్రతిపాదింపబడినది.

## కేనోపనిషత్తు - శివాద్వైతము

ఇప్పటివరకును కేనోపనిషత్తునందు షడ్విధలింగసమన్వయవిషయము ప్రతిపాదింపబడినది. ఇక కేనోపనిషత్తు శివాద్వైతసంప్రదాయానుసారి యనువిషయము గాంతము.

శివాద్వైతశబ్దమునందు శివ అద్వైత అను రెండుఖండము లున్నవి. శివతత్త్వము నిర్ణయింపబడినగాని శివఅద్వైతశబ్దముల సంబంధము నిర్ణయింపబడదు. కావున ప్రథమమున శివతత్త్వవిషయము గాంతము.

మానవుడు స్వశక్తివైఫల్యమునగాని తన్ను శాసించు—తన్నే గాదు సర్వప్రాణులను, సర్వభూతములను శాసించు — ఒకసర్వశక్తిమత్తత్వ మున్నదను వివేకము గలవాడు కాడు. ఇయ్యదియే, ఈపరాధీనతయే యాతని నాస్తికునిగా మార్చును. ఇదియే యాతనియుపాసనారంగప్రవేశమునకు నాంది.

ఈవైఫల్య మొకరంగమునమాత్రమే గాదు, సర్వరంగముల యందును — 1. జన్మించుటయందు, 2. జీవించుటయందు, 3. కర్మాచరణమందు, 4. చివరకు మరణించుటయందును స్పష్టముగా గాన్పించుచున్నది. ఎట్టిపరాధీనత! ఎట్టివైఫల్యము!

## చతుర్విధపరాధీనతలు

1. జన్మ – తనకు తెలియని సమయమున తన కీజన్మ ప్రాప్తించినది. కాని విశేష మేమన లోకమున మానవుడు శీతాతపచోరబాధానివారణసంకల్పముతో సర్వవిధసుఖసాధనసమన్వితమగు గృహమును

నిర్మించుకొనుచున్నాడు. ఒకగృహనిర్మాణమే గాదు, సర్వసౌకర్యము లును తనకొఱకై, తానై యేర్పాటు చేసికొనుచున్నాడు. కాని తన జీవికకు సాధనమైన యీసర్వాంగసుందరమగు శరీరమును తనకొఱ కెవరో నిర్మించియిచ్చినారు. ఇయ్యది ప్రథమపరాధీనత.

2. జీవించుట — జీవించుట యనగా శరీరము కృశించకుండ నాహారాదులచే పోషించికొనుట. ఆహారమును గైకొనుచున్నగాని శరీరము కార్యనిర్వహణసమర్థముగా నుండదు. శరీరపోషణ కావశ్యక ములైన ధాన్యజలాదులును తాను సృష్టించికొనినవి గావు. అవియును నెవరో తనకొఱకై నిర్మించియిచ్చినవే. ఇయ్యది ద్వితీయపరాధీనత.

3. కర్మాచరణము — కర్మ యనగా చేయుట. కర్మలు రెండు రకములు శారీరకములు, విహితములు నని. శరీరపోషణమునకై, శరీరము నీరోగముగ నుండుటకై గావింపవలసిన కర్మలు శారీరకములు. పోషింపబడుచున్నగాని, నీరోగముగ నున్నగాని శరీరము కార్యనిర్వహణసమర్థము గాదు. తనయిష్టమువచ్చిన పదార్థము, తనకోరిక ననుసరించి భుజించుటకు వీలులేదు. మితముగ, నారోగ్యమును గాపాడు కొనుచు, తనయిష్టము వచ్చినప్పుడు గాక నిర్ణీతసమయములయందే భుజింపవలయును. ఇయ్యది శారీరకకర్మవిషయపరాధీనత. ఇక విహిత కర్మలవిషయము గాంతము. విహితకర్మ లనగా విధింపబడినకర్మలు. ఇవి నిత్యనైమిత్తికకామ్యభేదముచే త్రివిధములు. సంధ్యావందనాదులు నిత్యములు, శ్రాద్ధాదులు నైమిత్తికములు, పుత్రకామేష్ట్యాదులు కామ్యములు. విహితము లనగా విధింపబడిన వని యర్థము. ఎవరిచేత? తన చేతమాత్రము గాదు. అయిన నెవరిచేత? ఇందును పరాధీనత తప్ప లేదు. ఇయ్యది తృతీయపరాధీనత.

4. మరణము — మరణ మనగా ప్రాణాపగమము. ప్రాణ మనగా చలనశక్తి. చలనశక్తిని గోల్పోవుట మరణము, తద్విశిష్టత మరణా

భావము నని లోకానుభవము. లోకమున నేమానవుడును మరణమును కావలెనని కోరికొనడు. మరణించిన బాగుండు ననుకొనుటయు గలదు. కాని యది యేనైరాశ్యముననో, సంకల్పము నెరవేరకపోవుటవలననో యనుకొనుమాట. ఆమాట యనుకొనుటలో నాతనియుద్దేశము వెంటనే మరణింపవలయునని గాదు, ఆతనిసంకల్పము నెరవేరవలయునని. ఆసంకల్పము నెరవేరిన నాత డాయావేశమున మరణించినను నందును నాతనిపరాధీనతయే స్పష్టముగా గోచరించును. ఇయ్యది చతుర్థ పరాధీనత.

ఈచతుర్విధపరాధీనతలే మానవుని ఆస్తికునిగా మార్చుచున్నవి. ఆస్తికు డనగా పరమేశ్వరుడు సర్వశాసకు డున్నాడను భావము గలవాడు. నాస్తికు డనగా నట్టిభావము లేనివాడు. ప్రపంచమునందలి జనాభాలో నేకోలదిమందియో నాస్తికు లున్నారు. బౌద్ధాదులు నాస్తికులని ప్రతీతి. సర్వలక్షణసంపన్నమగు వైదికమతమునందలి యేకొలదిలక్షణములనో ప్రధానముగా గొని యేర్పడిన యాధునిక మతములే నాస్తికమతములగు బౌద్ధాదులు. అహింసకు ప్రాధాన్య మొసంగినవి బౌద్ధజైనములు. ఈరెంటియందును జైనము అహింస కిచ్చిన ప్రాధాన్య మత్యధికము. ఈవిమర్శ యిట నప్రస్తుతము. ప్రకృత మనుసరింతము.

ఆస్తికశబ్దమునకు మరియొకయర్థము గలదు. ఆస్తికు లనగా వేదప్రామాణ్యమాత్రము నంగీకరించినవా రని యీసంప్రదాయము వారి నిర్వచనము. ఈసిద్ధాంతముప్రకారము శబ్దమున కేగాని యర్థమునకు ప్రాధాన్యము లేదు. ఇయ్యది పూర్వమీమాంసాసంప్రదాయమునకు సంబంధించిన సిద్ధాంతము. జైమిని పూర్వమీమాంసాసంప్రదాయ ప్రవర్తకుడు. ఈసిద్ధాంతమున కర్మయే ఫలదానసమర్థము.

కర్మయే ఫలదానసమర్థ మనువిషయము గాంతము. ఈసంప్రదాయమున కర్మ యనగా యజ్ఞయాగాదికము. యజ్ఞయాగాదికర్మల

వలన నపూర్వ ముత్పాదింపబడి యాయపూర్వమే తత్కర్మలకు నియత ములైన ఫలముల ననుభవింపజేయునని యీసంప్రదాయమువారి సిద్ధాంతము. ఇయ్యది యెంతవరకు సమంజసమో గాంతము. ఒకడు చౌర్యము చేసినాడు. చౌర్యము లోకపరిపాటి ననుసరించి నేరము. నేరములకు సాంఘికమర్యాద ననుసరించి శిక్ష నియతము. చోరుని చౌర్యవిషయమును విచారించి రాజుగాని, తదధికృతులుగాని శిక్ష విధించుచున్నారు. శిక్షాకాల మైనతరువాత నాతని విడిపించుచున్నారు. ఇయ్యది లోకానుభవమున నున్నవిషయము. ఇందు గమనింపదగిన విషయము — నేరము సంకెలలై యాతని బంధించుటలేదు. కారా గారమున నుంచి శిక్ష ననుభవింపజేయుటలేదు. కారాగారవాసకాల మున చోరునకు తిండి పెట్టుటలేదు. శిక్షాకాల మైనతరువాత నాతని విడిచిపెట్టుటలేదు.

## అపూర్వవాదము

ఇక పూర్వమీమాంసాసంప్రదాయవిషయము గాంతము. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' ఇత్యాదివిధుల ననుసరించి యాచ రింపబడిన జ్యోతిష్టోమాదియాగములకు స్వర్గాదులు భోగస్థానములుగా నిర్ణయింపబడినవి. స్వర్గకామనతో నాచరింపబడిన జ్యోతిష్టోమయాగము వలన నపూర్వ ముత్పాదింపబడి స్వర్గాదులయందు భోగము ననుభ వింపజేయునని జైమినీయసిద్ధాంతము.

ఇక విషయవిమర్శ గావింతము. లోకపరిపాటియందు చౌర్యము శిక్ష ననుభవింపజేయుటలేదు. రాజు నేరమును విచారించి శిక్ష ననుభ వింపజేయుచున్నాడు. కాని పూర్వమీమాంసాసంప్రదాయమునందో యజ్ఞయాగాదిరూపకర్మానుష్ఠానమువలన నపూర్వ ముత్పాదింపబడి యదియే స్వర్గాదులయందు భోగము ననుభవింపజేయునని సిద్ధాంతీక రింపబడినది. కాని యీవాదము విమర్శసహము గాదు. చోరుడు చేసిన

కార్యమువలె జ్యోతిష్టోమమును కర్మయే. కర్మయే ఫలదానసమర్థమైన చౌర్యరూపపాపకర్మవలన నపూర్వ ముత్పాదింపబడి యాయపూర్వమే శిక్ష ననుభవింపజేయవలయును. కాని యట్లు జరుగుటలేదు. నేరమును విచారించి తగినశిక్షను విధించి శిక్ష ననుభవింపజేయుటకు లోకపరిపాటి యందు రాజను నొకవ్యక్తి యున్నాడు. కాని జైమినీయసంప్రదాయ మున రాజస్థానీయుడగు ఫలానుభావయిత లేడు. ఆసంప్రదాయమున ఫలానుభావయితృత్వస్థాన మపూర్వమున కంటగట్టబడినది. అయిన నీ యపూర్వ మనగా నేమి? యజ్ఞయాగాదులందు దేవతల నుద్దేశించి యగ్నియందు వ్రేల్చబడిన హవిర్ద్రవ్యములు భస్మమై యపూర్వము నుత్పాదించునని వారికల్పన. ఇది యొకయపూర్వవాదము. మఱియును లోకానుభవమునకును విరుద్ధమగు విషయము.

ఇంతకుపూర్వము చతుర్విధపరాధీనతావిషయము వివరింపబడి నది. ఇందు జననము మొదటిది, మరణము చివరిది. ఈరెండును ప్రాణుల యిష్టానిష్టములతో సంబంధములేకయే సంభవించుచున్నవనుట పరమ సిద్ధాంతము. మానవులు భూలోకవాసులు. భూలోకము మానవులు సృష్టించినది గాదు. భూలోకమున మానవు లాచరించిన యజ్ఞాదుల ఫలానుభవస్థానమైన స్వర్గమును భూలోకవాసులు సృష్టించినది గాదు. తల్లోకవాసులగు దేవతలు సృష్టించినదియును గాదు. అయిన నీలోక ముల నెవరు సృష్టించిరి?

## అపూర్వవాదనిరాసము

లోకములను, లోకవాసులను సృష్టించి, జీవులకును, భోగముల కును గావలసిన సర్వపదార్థజాతమును నేర్పాటుగావించినయాతని మరచి, మరచియనుట యేల, ఆతనియస్తిత్వమును గమనించు సామ ర్థ్యము లేక భోగస్థానమగు స్వర్గలోకమునుమాత్ర మంగీకరించి, స్వర్గ ప్రవేశమునకు తా మొనరించు యాగరూపకర్మలకు సామర్థ్యము లేదని

తెలిసికొనియు నపూర్వము నొకదానిని కల్పించికొని లోకవేదసిద్ధమగు నీశ్వరాస్తిత్వమును గమనింపని యీయవైదికవాదము శిష్టజనసమ్మతము కాదు. కారణ మేతత్సంప్రదాయము నిరీశ్వరవాదమునకు సంబంధించిన దగుటయే. వేదప్రామాణ్యము నంగీకరించినను ననీశ్వరవాదులగుటచే నీసంప్రదాయమువారును నాస్తికు లనకతప్పదు.

ఇంకొకవిషయము — వేదప్రామాణ్యము నంగీకరించినారు. ఇందును శబ్దమునకు ప్రాధాన్యము నంగీకరించినారు. కాని యట్టిప్రాధాన్యము నర్థమున కంగీకరింపలేదు. ఇదియును లోకవిరుద్ధమైన విషయమే. లోకమున శబ్దార్థములకు సమప్రాధాన్య మున్నది. అర్థ మనగా శబ్దముచే ప్రతిపాదింపబడు వస్తువు. శబ్ద మనగా పేరు. శబ్దములేని యర్థముగాని, అర్థములేని శబ్దముగాని లోకమున లేదు. మఱియును లోకమున వీనిరెంటికిని సమప్రాధాన్యమే యంగీకరింపబడినది. ఈలోకపరిపాటినిగూడ పరికింపక కేవలశబ్దమునకుమాత్రమే ప్రాధాన్య మంగీకరించి యర్థమును త్రోసిరాజనిన యీసంప్రదాయము లోకానుభవవిరుద్ధ మనకతప్పదు.

జైమిని కర్మప్రధానమగు సంహితాభాగమునందలి సందిగ్ధఘట్టములను నిర్ణయించునుద్దేశముతో 'అథాఽతో ధర్మజిజ్ఞాసా' అను సూత్రముతో నారంభించి పూర్వమీమాంసాశాస్త్రమును ప్రవర్తింపజేసినాడు. ఉత్తరమీమాంసయందును నీన్యాయములే విషయనిర్ణయమున ప్రమాణములుగా గైకొనబడినవి. కాని పూర్వోత్తరమీమాంసల కొకప్రధానభేద మున్నది. పూర్వమీమాంసయందు కర్మానుష్ఠానమునకును, శబ్దార్థములలో శబ్దమునకునుమాత్రమే ప్రాధాన్య మంగీకరింపబడినది. కాని యుత్తరమీమాంసయం దుపాసనతోపాటు కర్మకును, శబ్దముతోబాటు అర్థమునకును సమప్రాధాన్య మీయబడినది. మఱియును కర్మోపాసనాప్రధానములగు సంహితోపనిషత్తులు రెండును సమగ్రముగా సమన్వయింపబడినవి.

'గాథపతిం మేథపతిం రుద్రం జలాషభేషజమ్'

'ఆ వో రాజాన మధ్వరస్య రుద్రగ్ం హోతారం సత్యయజగ్ం
రోదస్యోః

అగ్నిం పురా తనయిత్నో రచిత్తా ద్ధిరణ్యరూప మవసే కృణుధ్వమ్'

ఈమంత్రములు రెండును నధ్వరరాజు రుద్రు డని ప్రతిపాదించు చున్నవి. అధ్వరానుష్ఠానమునుమాత్ర మంగీకరించి యధ్వరరాజగు రుద్రవిషయమును ప్రస్తావించకుండుటలో జైమినియుద్దేశ మే మైయుండును? వేదప్రామాణ్యమును, ఈశ్వరాస్తిత్వమును నంగీకరింపని బుద్ధాదులవలె సంపూర్ణ నాస్తికుడు గాకపోయినను జైమిని వేదప్రామాణ్యము నంగీకరించినను నిరీశ్వరవాదిగాన నాస్తికు డనకతప్పదు.

బాదరాయణుడు తనసూత్రగ్రంథమున నాయాప్రకరణముల యందు జైమినిని ప్రమాణముగా గైకొనినాడు. సూత్రగ్రంథమునకు భాష్యము రచించిన నీలకంఠుడును 'అథాఽతో ధర్మజిజ్ఞా సేత్యారభ్య అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దా దిత్యేతావత్పర్యంత మేక మేవ శాస్త్రమ్' పూర్వోత్తరమీమాంస లేకగ్రంథముయొక్క రెండుభాగములని నిర్ణయించుచు జైమినికి ప్రామాణికత నంగీకరించినాడు. నిరీశ్వరవాదిని జైమినిని ప్రామాణికునిగా నంగీకరించుట యెట్లన్న విచారింతము.

వాస్తవము వచింపవలయునన్న జైమిని నిరీశ్వరవాది యనుటకు వీలు లేదు. వేదప్రామాణ్యమును త్రోసిరా జనిన బౌద్ధులవాదమును ఖండించి వేదప్రామాణ్యమును నిలిపినగాని ఆర్యమతము, వైదికమతము సుస్థిరము గాదని యెంచి జైమిని కేవలవేదప్రామాణ్యమును స్థాపించుటకై యత్నించినాడు. ఈయావేశములో నిరీశ్వరవాదిత్వదోష మాపతించునను నాలోచనగూడ లేకుండపోయినది. కాని వేదప్రామాణ్యము నిలిచిన నీశ్వరాస్తిత్వము స్థాపింపబడినట్లే యని యాతనియుద్దేశము. కావున జైమిని సేశ్వరవాదియేగాని నిరీశ్వరవాది గాడని తేలుచున్నది.

అభీష్టార్థవ్యయేనాపి జయతి క్షేత్రహారిణమ్
లబ్ధే క్షేత్రే స దుష్ప్రాపః స్యా దర్థ ఇతి నిశ్చయాత్

అన్యాక్రాంతమైన క్షేత్రము స్వాధీనమైన డబ్బుకు కర వుండదని యెంచి యభీష్టార్థమును – నిలువయున్నదానిని, సంపాదించినదానిని – వ్యయించియైనను క్షేత్రహర్తను జయించుట లోకమున ననుభవమున నున్నవిషయమే. అట్లే యభీష్టార్థ మీశ్వరాస్తిత్వమైనను దానిని త్రోసిరాజని యైనను వేదప్రామాణ్యమును నిలుపుకొనిన తద్ద్వారా ఈశ్వరాస్తిత్వమును నిలుపుకొనినట్లే. ఈయుద్దేశముతోడనే జైమిని వేదప్రామాణ్యస్థాపనకై ప్రాకులాడినాడు.

జైమినికాలమున నీశ్వరాస్తిత్వమును, వేదప్రామాణ్యమును నంగీకరింపని బౌద్ధులు విపరీతప్రచారము గావించుచుండిరి. వేదప్రామాణ్యమును నిలుపుకొనిన నీశ్వరాస్తిత్వము స్థాపింపబడినట్లే.

అయిన వేదముయొక్క గొప్పదన మేమి? తత్ప్రామాణ్యస్థాపనకై ప్రయత్నించు టెందుకు? ప్రపంచమునం దనేకవాఙ్మయము లున్నవి. సంస్కృత, బౌద్ధ, జైన, పారసీక, క్రైస్తవ, మహమ్మదీయ మొదలైనవి ప్రపంచవాఙ్మయమునందలి శాఖలు. వీనియన్నింటియందును నత్యంతప్రాచీనమైనది సంస్కృతవాఙ్మయమే. ఇంతియే గాదు. సంస్కృతేతరవాఙ్మయములందు దేనియందును జీవేశ్వరజగచ్ఛర్చకు సంబంధించిన విషయములు లేనేలేవు. ఇటీవల నేకొలదియో గన్పడుచున్నను నయ్యవి సంస్కృతవాఙ్మయమునుండి గైకొనబడినవియే. ప్రాచీనతమముగనుకనే సంస్కృతవాఙ్మయమునకుగల గౌరవ మద్వితీయము. అందును వేదవాఙ్మయమునకుగల వైశిష్ట్య మపారము.

ఆరంభమునుండి యిప్పటివరకును వేదమునం దెట్టిమార్పును లేదు. అధ్యాయములందుగాని, అష్టకములందుగాని, అనువాకములయందుగాని, వాక్యములయందుగాని, పదములయందుగాని యెట్టిమార్పును

లేదు. ఆసేతుహిమాచల మొకటియే పాఠము. ఒకవాక్యము తరుగ లేదు, ఒకవాక్యము పెరుగలేదు. ఒకతరమునుండి మరియొకతరమునకు సంక్రమించుచు నారంభమునుండి యిప్పటివరకును నేకవిధముగా, నేవి ధమైనమార్పును లేనిది వేద మొకటియే. కావుననే వేదముయొక్క గౌరవ మద్వితీయము, నపారము నని తెలుచున్నది.

మిగిలినగ్రంథములకన్న వేదముల కొకవైశిష్ట్య మున్నది. ఇతర గ్రంథములం దనుభూతవిషయములు, ఊహ కందినవిషయములకు సంబంధించిన వర్ణనముమాత్రమే యుండును. కాని వేదమునందో యా విధముగ గాదు.

ప్రత్యక్షే ణానుమిత్యా వా య స్యోపాయో న విద్యతే
ఏనం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా

ప్రత్యక్షానుమానప్రమాణముల కందనివిషయములను నిర్ణయించుటచేతనే వేదనామ మన్వర్థ మగుచున్నది.

ఇప్పటివరకును ఆస్తికనాస్తికమతవిషయములను వివరించుచు ప్రసక్తానుప్రసక్తిగ వేదముల ప్రాచీనతావిషయమును, తద్వైశిష్ట్య గౌరవములును, నీశ్వరాస్తిత్వవిషయమును వివరింపబడినవి. ఇక వేద ప్రతిపాదితతత్త్వవిషయము గాంతము.

## వేదశబ్ద నిర్వచనము

వేద మనగా నేమియో వివరించినగాని తత్ప్రతిపాదితతత్త్వవిషయము స్పష్టము గాదు. ఋగ్యజుస్సామాథర్వసంహితలకుమాత్రమే వేదసంజ్ఞ యని యొకసంప్రదాయము. సంహితోపనిషత్సమష్టికి వేద సంజ్ఞ యని మఱియొకసంప్రదాయము. ఉపనిషత్తుల కిచ్చిన ప్రామాణ్యమును సంహితల కిచ్చుట కంగీకరింప రొకసంప్రదాయమువారు. ఋగాదిసంహితలకు కాలనిర్ణయము గావించినారింకొకసంప్రదాయము వారు. ఈవిషయములను చర్చించిన గ్రంథవిస్తర మగునుగాన నింతట సంక్షేపించి ప్రకృత మనుసరింతము.

శిష్టసంప్రదాయమున సంహితోపనిషత్తులకు సమప్రాధాన్య మంగీకరింపబడినది. సంహితలు కర్మప్రధానములు, ఉపనిషత్తు లుపాసనా ప్రధానములు. ఇంతమాత్రమున సంహితలయం దుపాసనావిషయము లును, ఉపనిషత్తులయందు కర్మవిషయములును లేవని గాదు. సంహితలయం దచ్చటచ్చట ప్రతిపాదింపబడిన యుపాసనాభాగమునకు సంబంధించినవిషయములకు వివరణ ముపనిషత్తులయందు విస్తృతముగా నుండుటచేతను, ఉపాసనాకాలమునందును నపరిహార్యములైన నిత్యనైమిత్తికకర్మాదులవిషయము సంహితలయందును నుండుటచేతను పరస్పరాపేక్ష యున్న దనకతప్పదు. కావున రెండును నేకగ్రంథ మనియును, రెంటికిని కర్త పరమేశ్వరుడే యగుటచే నేకకర్తృకము లనియును తేలుచున్నది. ఇక సంహితోపనిషత్తులయందు ప్రతిపాదింపబడిన తత్త్వవిషయము గాంతము.

ప్రథమమున నీశ్వరాస్తిత్వవిషయమునను, జగద్విషయమునను లోకానుభవమును గాంతము. జన్మజీవికానిర్వాహణకర్మాచరణమరణములయందు మానవుడు పరాధీనుడై ఆస్తికు డగుననువిషయము వివరించినాము. అస్తీ త్యాస్తికః = ఉన్నా డనుభావముగలవా డాస్తికుడు. తన్నును, తనవంటిప్రాణులను, భూతములను, సర్వమును శాసించువా డొకడు అస్తి = ఉన్నా డనుభావము గలవా డాస్తికుడు. కాని మానవున కీభావ మెప్పుడు గలుగును? ఈశ్వరాస్తిత్వము = లోకానుభవము.

తనసంకల్పములన్నియును తా ననుకొనినప్పుడు, తా ననుకొనినవిధముగా, నేవిధమగు లోపము లేకుండ నెరవేరుచున్నంతవరకును నివి యంతయును తనమహిమయే యని భావించుచుండును. కాని లోకమునందు నిత్యమును సంభవించుచున్న సంఘటలను గాంచుచున్నను నాతనికి తనపరాధీనతగాని, అస్తి కశ్చి దనుభావముగాని గలుగదు.

తనకుగలిగిన సంతానవిషయమున తనసంబంధ మెంత? తాను సంతానవంతుడు గాబోవుచున్నా ననువిషయము తనకు తెలియదు. ఈవిషయము తెలిసినను స్త్రీపుంవివక్ష లేదు. స్రావపాతాదులవిషయమున తా నేమి చేయగలడు? ఏమియును తెలియనివిషయమున తనకుగలబాధ్యత యెంత? బాధ్యతయేలేని సంతానవిషయమున తనదియని చెప్పుకొనుటతో సిగ్గేల లేదు?

ఆహారము దొరకక యలమటించువారి నెందఱిని నిత్యమును గాంచుటలేదు? అయిన తన కీసమృద్ధి యెట్లు గలిగినది? వారిదారిద్ర్యమునకును, తనసమృద్ధికిని కారకు లెవరు? ఒకవేళ సమృద్ధివిషయమున తాము కర్తలు గావచ్చును. కాని యెంతమూర్ఖుడైనను కోరి దారిద్ర్యమును తెచ్చుకొనునా? కావున దారిద్ర్యసమృద్ధులకు కారకు లన్యులని తేలుటలేదా?

ఇక మరణవిషయము గాంతము. తనకండ్లయెదుట నెందరు మరణించుచున్నారు? ఎవరును తామై కోరి మరణించుటలేదే? అందరును నవశముగ మరణమునకు పాల్పడుచున్నవారే! అయిన తానును మరణించకతప్పదా? అయిన నింతవరకు శాశ్వతునివలె ప్రయత్నించుటలో నుద్దేశ మేమి? మరణ మవశ్యంభావియైన దీప ముండగనే చక్కబెట్టుకొనవలయునను త్వర యేది? త్వరపడుదమన్నను త్వరపడి యేమి చేయవలయును?

ఎట్టిపరాధీనత! ఈవిశాలప్రపంచమునందు తా నెంత? దీనితో తన కేమి సంబంధము? ఇందు తనది, తాను సృష్టించిన దణుమాత్రమైన నున్నదా? అన్నిటిమాట యటుంచి తన కధిష్ఠానమైన యీశరీరము మాత్రము తనదా? తాను నిర్మించినాడా? తనవంటివారేగదా తనతలిదండ్రులును? ఎంత విచిత్రమైన సృష్టి? ఇయ్యది తనవంటి యల్పులవలన నగునా? రథప్రాసాదాదులను గాంచిన నెంతమంది యెంతకాలము

శ్రమించి నిర్మింపగలుగుచున్నారు? అయినను నెక్కడనో లోప ముండ నేయుండును?

ఈనిర్మాణమైనను నెంతగ శ్రమించి యభ్యసించిన నలవడినది? అయిన దీనికి ప్రథమగురు వెవరై యుండురు? ఎంతగ శ్రమించినను నేఘటపటాదులవంటి వస్తువులనుమాత్రమో సృష్టింపగలుగుచున్నాము. కాని యొకశరీరమును నిర్మింపగలమా? అన్యులరక్తము నన్యుల కివ్వగలము. అన్యులహృదయ మన్యులయం దుంచగలము. కాని రక్తమునుగాని, హృదయమునుగాని సృష్టింపగలమా? ఘటము నిర్మించగలము. ఘటనిర్మాణమున కావశ్యకములగు మృజ్జలాదులు సిద్ధముగా నున్న నిర్మాతల మని గర్వించగలము. అయిన నీమృజ్జలాదు లెవరు నిర్మించినవి? ఈవిచిత్రవిశ్వనిర్మాత యెవరు?

ఈచర్చవలన నీవిచిత్రవిశ్వనిర్మాత యొక డున్నాడని తేలినది. అయిన నాతని కేమైన పే రున్నదా? ఆత డేరూపమున నున్నాడు?— అనుప్రశ్నలు వెంటనే బయలుదేరును. 'అయ్యది నామరూపరహితమైన తత్త్వము. దానికి నామరూపము లెక్కడివి? ఏపేరుతోనైనను పిలువవచ్చును. ఏరూపముతోనైనను ధ్యానింపవచ్చు'నని యొకసంప్రదాయమువా రనుచున్నారు. అయ్యది వాస్తవమున నిర్గుణము. సగుణస్థితియం దేపేరుతోనైనను వ్యవహరింపవచ్చు'నని యొకసంప్రదాయమువారు. ఆతత్త్వము శివశబ్దవాచ్యమని శైవులు. విష్ణుశక్తిస్కందగణపతిసూర్యనామవాచ్య మని వైష్ణవశాక్తస్కాందగాణాపతసౌరులు. నామరూపరహితత్త్వవాదనిరాసము.

అయిన నీసంప్రదాయములం దేది ప్రామాణికమో గాంతము. ఇందు మొదటిసంప్రదాయమువారివాదమును గాంతము. తత్త్వము నామరూపరహిత మని వారివాదము. దీని కేమైనను ప్రమాణము గలదా? లేక వారిప్రవచనమే యాధారమా? అసలు నామరూపరహిత

మగు నొకతత్త్వ ముండుట కవకాశ మున్నదా? ఈవిషయము నను భవ మంగీకరించునా? ఆతత్త్వముయొక్క నామరూపములు నిర్ణయిం చుటకు వే ఆధార మేమైన గలదా? లేక యీయల్పజ్ఞులవాదముల మీాద నాధారపడవలసిన దేనా? ఈప్రశ్న మనతోనే యారంభమై మనచే తనే పరిష్కరింపబడవలసియున్నదా? లేక ఇతఃపూర్వమే పరిష్కృత మైనదా?

ఈవిచిత్రవిశ్వనిర్మాతకు నామకరణమహోత్సవము చేయుబా ధ్యత తమపైన పడినదని యొకసంప్రదాయమువారు కో దేవః = దేవు డెవ డని ప్రశ్నించుకొని హరిహరాత్మకో దేవః = హరిహరాత్మకుడు దేవు డని సమాధానము చెప్పికొనినారు. ఇంతకుపూర్వమే వైష్ణవ శైవములు ప్రసిద్ధమతములుగా నున్నవి. ఆరెండుమతములందును హరి హరు లుపాస్యదైవములు. కాని యీక్రొత్తమతమువారికి దేవుడు లేడు! ఇది గాంచి వారు హరిహరు లిద్దఱిని గలిపి యొకక్రొత్తదేవుని సృష్టించికొని యాతనికి 'హరిహరు' డని నామకరణమహోత్సవము జరుపుకొనినారు.

ఈసత్యమును గమసించి - తమహరిహరుడు కల్పితుడను విష యమును గమనించి - మతమునం దాదరమును గోల్పోవచ్చునని భావించి యియ్యది సగుణవిషయము, కాని నిర్గుణవిషయమున నామ రూపములే లేవని ప్రతిపాదించినారు. అంతటితో నూరకొనినారా? నిర్గుణవిషయమును ప్రచారము చేయుటకై బ్రహ్మశబ్దము నంగీకరించి బాదరాయణసూత్రములకు వ్యాఖ్యానము రచించికొనినారు. అందు మొదటిసూత్రమున అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా - బ్రహ్మశబ్దముండుటచే నానిర్గుణతత్త్వము బ్రహ్మశబ్దవాచ్య మనినారు. కాని వాస్తవము వచింపవలయునన్న బ్రహ్మశబ్దమును వారి కనుకూలముగా లేదు.

బృహబృహివృద్ధౌ అనుధాతువునుండి బృహతి బృంహయతి యనువ్యుత్పత్తి ననుసరించి నిష్పన్నమైన బ్రహ్మశబ్దమునకు విస్తరించి

విస్తరింపజేయు తత్త్వమని యర్థము. ఈయర్థము నంగీకరించిన వారి వాదము నిలువదు. బృంహాయతి = విస్తరింపజేయునది. దేనిని? జగత్తునని చెప్పకతప్పదు. జగద్విషయము వచ్చునప్పటికి జగత్తు మిథ్యయనినారు. మిథ్యాత్వసాధనకై మాయ నంగీకరించినారు. యా మా సా మాయా = ఏది లేదో యది మాయ యని నిర్వచించినారు. మాయ సత్యమా, అసత్యమా యన్న సదసదనిర్వచనీయ మనినారు. ఈసర్వవిధకల్పనలకు ప్రమాణ మేమనిన శాస్త్రాణ్యవిద్యావద్విషయాణి = శాస్త్రములు మూర్ఖులకొఱకనినారు. స్వపక్షసాధనకై సర్వలోకాంగీకృతములగు ప్రత్యక్షానుమానోపమానశబ్దములు చాలక అధ్యారోపాపవాదములను శరణుజొచ్చినారు. ఈవిధముగ కల్పితవాదభూయిష్ఠమగు నీసంప్రదాయమును విమర్శించుచు కాలహరణము చేయుటకంటె ప్రకృత మనుసరించుట యుక్తము.

ఇక ప్రచారములోనున్న సంప్రదాయములవిషయము గాంతము. ఒకకాలమున శైవశాక్తవైష్ణవగాణాపతస్కాందసౌరము లను నారు మతములు ప్రచారమున నుండెడివి. కాని యం దిప్పుడు శైవశాక్త వైష్ణవములుమాత్రము ప్రచారమున నున్నవి. ఈషణ్మతములయం దేది ప్రామాణికమో గాంతము.

సూర్యు డుపాస్యుడుగాగల మతము సౌరము.తన్మతానుయాయులు సౌరులు. సూర్యుడు విశ్వాంతఃపాతి. విశ్వముతోబాటు సూర్యుడును నావిచిత్రనిర్మాతృసృష్టిలోనివాడే. సృష్ట్యంతర్భూతుడు సృష్టికర్త యగుట కవకాశము లేదు. స్కందగణపతు లీశ్వరునికుమారు లను విషయము జగత్ప్రసిద్ధము. సమ్రాట్టున్నంతవరకును యువరాజునకు సామ్రాజ్యాధిపత్యము సంక్రమింపదు. సృష్ట్యంతర్భూతులగు స్కందగణపతులకు విశ్వనిర్మాతృత్వ మంటగట్టుట యన్యాయ్యము. ఇప్పటికి సౌరస్కాందగాణాపతములవిషయము తేలిపోయినది. ఇక వైష్ణవ విషయముగాంతము.

వైష్ణవమున విష్ణువుపాస్యదైవము. విష్ణువును 'జాతో బ్రహ్మన్నభిపాతి తృతీయమ్' 'బ్రహ్మావిష్ణురుద్రేంద్రా స్తే సంప్రసూయంతే' అను ప్రమాణములవలన జన్మకలవాడని తెలుచున్నది. ఒకప్పుడు దేవత లుపాస్యదైవవిషయమున ప్రశ్నింప

తతోఽవ్యయాత్మా స హరిః స్వహృత్పంకజశాయినమ్
దర్శయామాస దేవానాం మురారి ర్లింగ మైశ్వరమ్

విష్ణువు స్వహృత్పంకజశాయియగు శివలింగమును చూపినట్లు వామనపురాణమున ప్రపంచింపబడినది.

తవ శ్రియే మరుతో మర్జయంత రుద్ర! య త్తే జనిమ చారు చిత్రమ్
పదం య ద్విష్ణో రుపమం న్యధాయి తేన పాసి గుహ్యం నామ గోనామ్

ఈమంత్రమునందు దేవతలందరివలె విష్ణువును లింగరూపియగు రుద్రు నారాధించి లక్ష్మీవిశిష్టమగు వైకుంఠమును పొందినట్లు ప్రతిపాదింపబడినది. మఱియును మహాప్రళయస్థితిని వర్ణించు శ్వేతాశ్వతరమునందలి

యదా తమ స్త న్న దివా న రాత్రి
ర్న స న్న చాస చ్ఛివ ఏవ కేవలః
త దక్షరం త త్సవితు ర్వరేణియం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ

అను మంత్రి మా కాలమున సదసన్ని షేధముగావించుచు శివుడొకడే విరాజిల్లుచున్నా డని ప్రతిపాదించుచున్నది. శివ ఏవ కేవలః అనుటచే బ్రహ్మేంద్రాదులతో పాటు విష్ణువునకును నాకాలమున నస్తిత్వము లేదని తెలుచున్నది. కావున జన్మప్రళయములుగలిగి యుపాసకుడగు విష్ణు వివిచిత్రవిశ్వనిర్మాత యనుటకు వీలు లేదు.

ఇక శాక్తవిషయము గాంతము. శ్రుతులలో శక్తిపారమ్యప్రతిపాదకమంత్రములు లేకపోవుటచేత నే బ్రహ్మాండపురాణమునందలి

లలితాసహస్రనామములను, అష్టాదశమహాపురాణాంతర్గతమగు దేవీభాగవతమును శరణుజొచ్చవలసిన స్థితి యేర్పడుటచే ప్రమాణదరిద్రమగు నీమతము శిష్టజనాంగీకారమును పొందుట కర్హము గాదు.

ఇప్పటివఱకును సౌరస్కాందగాణాపతవైష్ణవమతములయుపాస్యదైవములు సృష్ట్యంతర్భూతు లగుటచేతను, శాక్తము ప్రమాణదరిద్రమగుటచేతను శిష్టజనసమ్మతములు గావని ప్రతిపాదింపబడినది. ఇక శిష్టమగు శైవవిషయము గాంతము.

ఈవిచిత్రవిశ్వనిర్మాత యొక డున్నాడని వివరించినాము. ఆ నిర్మాత యెవ రనువిషయమునగల భిన్నభిన్నసంప్రదాయములవిషయము చర్చించి యాసంప్రదాయములు శిష్టజనాంగీకార్యములుకావని వివరించినాము. మఱియును నీచర్చ మనతో నారంభము కాలే దనియు వివరించినాము. కారణము మనకుగలిగిన సందేహములు మానవసృష్టితోనే యారంభమైనవి. కనుక యవి యానాడే పరిష్కరింపబడియుండవలెను.

ఇంకొకవిషయము. ప్రత్యక్షానుమానప్రమాణముల కందని విషయములను నిర్ణయించుటలో వేదము పరమప్రమాణగ్రంథ మని వివరించినాము. మనకుగలిగిన సందేహమును – ఈవిచిత్రవిశ్వనిర్మాత యేనామముచేత పిలువబడుచున్నా డనువిషయమును – వేద మెట్లు పరిష్కరించినదో గాంతము.

## సృష్టిస్థితిసంహారములు

ఇచట నొకవిషయమును గమనింపవలయును. మానవునకు జన్మస్థితిమరణము లున్నట్లే విశ్వమునకును సృష్టిస్థితిలయము లున్నవి. కాని విచిత్ర మేమన మానవునకు జన్మకారణము కొంతవఱకు తలిదండ్రులని యొప్పుకొన్నను స్థితిమరణములకు వారు కారణము గారు. కాని

విశ్వముయొక్క సృష్టిస్థితిలయముల కాతత్త్వ మొకటియే కారణముగా నున్నది. తలిదండ్రులు సంతానముయొక్క జన్మకు కేవలము ద్వార భూతులేగాని కారణముగా వ్యవహరింపబడుటకు దగరు. జన్మకుగాని, స్థితి కనగా పోషణమునకుగాని, చివరకు మరణమునకుగాని కారణ భూతులు కాకపోవుటయే కారణము. కావున నీవిశ్వముయొక్క మూడు కృత్యములకును — సృష్టిస్థితిలయములకు — కారణ మాతత్త్వమే యని తేలుచున్నది. ఈవిషయ ముపనిషత్తులయందు

యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్ర యంత్యభిసంవిశంతి, త ద్విజిజ్ఞాసస్వ త ద్బ్రహ్మేతి

ఈసర్వభూతము లేతత్త్వమునుండి జన్మించుచున్నవో, దేనిచేత పోషింపబడుచున్నవో, దేనియందు లయమగుచున్నవో ఆతత్త్వము బ్రహ్మము అనుమంత్రముచే ప్రతిపాదింపబడినది.

మాయాం తు ప్రకృతిం వింద్యా న్మాయినం తు మహేశ్వరమ్
త స్యావయవభూతై స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్

మాయ యనగా ప్రకృతి యనియు, మహేశ్వరుడు మాయి యనియు ననగా మాయ గలవాడనియు, నామహేశ్వరునియొక్క అవ యవములైన జీవులచే నీజగత్తు వ్యాప్తమైన దనియు శ్వేతాశ్వతరము ప్రతిపాదించుచున్నది. ఈమంత్రము జగత్తుయొక్క సృష్టిని ప్రతిపాదించు చున్నది.

యదా తమ స్త న్న దివా న రాత్రి
ర్న స న్న చాస చ్ఛివ ఏవ కేవలః
త దక్షరం త త్సవితు ర్వరేణియం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ

మహాతమోవస్థయందు, దివారాత్రివిభాగములేని కాలమున, సదసద్విభాగము లేనికాలమున శివు డొకడే విరాజిల్లుచున్నాడని

యీమంత్రము ప్రతిపాదించుచున్నది. ఈమంత్రమునందు ప్రళయకాలస్థితి వర్ణింపబడినది, కావున శ్వేతాశ్వతరసంప్రదాయము ప్రకారము సృష్టిలయములకు కారణభూతుడు శివు డని తేలుచున్నది.

ఇక శ్వేతాశ్వతరముయొక్క ప్రతిపత్తివిషయము గాంతము. శ్వేతాశ్వతరమునకు మంత్రోపనిషత్తనువ్యవహార మున్నది. వేదాంత సిద్ధాంతమును ప్రతిపాదించువానిలో శ్వేతాశ్వతర మగ్రస్థానము నాశ్రయించుచున్నది. ఈయుపనిషత్తునందు మిగిలినయుపనిషత్తులందువలె గాక ముముక్షువులకుగావలసిన బ్రహ్మవిద్యావిషయములు సమగ్రముగా ప్రతిపాదింపబడినవి. కావుననే బ్రహ్మవిద్యావిషయబోధకమంత్రములు బహుళముగా నుండుటచే నీయుపనిషత్తునకు మంత్రోపనిషత్తను వ్యవహారము గలిగినది. ఇతరోపనిషత్తులందు కొన్ని విషయములు ప్రత్యేకముగా గైకొనబడి విపులీకరింపబడినవి. కావుననే శ్వేతాశ్వతరమున కుపనిషత్తులలో నగ్రస్థాన మీయబడినది.

ఈయుపనిషత్తునం దా అధ్యాయము లున్నవి. ప్రథమాధ్యాయమునందు కాలము, స్వభావము, నియతి, యదృచ్ఛ, భూతములు, ప్రకృతి, పురుషుడు జగత్కారణము గావని ప్రపంచింపబడి శివు డొకడే జగత్తున కభిన్ననిమిత్తోపాదానకారణమని ప్రతిపాదింపబడినది. ద్వితీయాధ్యాయమున పరమేశ్వరు నుపాసించువిధానము ప్రతిపాదింపబడినది. తృతీయాధ్యాయ చతుర్థాధ్యాయములందు పరమేశ్వరుని స్వరూపవర్ణనమును, గుణకర్మవర్ణనమును గావింపబడినవి. పంచమాధ్యాయమునందు జీవస్వరూపవర్ణనమును, పాశస్వరూపవర్ణనమును గావింబడినవి. అమృతత్వవిషయమును ప్రపంచింపబడినది. ఆఅవయధ్యాయమునందు కాలాకాశాదులు జగత్కారణము గావని నిరాకరించి పరమేశ్వరుడే జగత్కారణమని నిరూపించి తదుపాసనముచేతనే యమృతత్వము = మరణరాహిత్యము, శివత్వము — ప్రాప్తించునని నిరూపింపబడినది.

## నామకరణము - శ్వేతాశ్వతరము

సమగ్రవిషయప్రతిపాదకమగు శ్వేతాశ్వతరమున నావిచిత్రవిశ్వ నిర్మాతకు — విశ్వముయొక్క సృష్టిస్థితిలయములకు కారణభూతుడైన వానికి — ఏమి నామకరణము గావింపబడినదో గాంతము.

ఒకప్పుడు బ్రహ్మవాదులగు మహర్షులు విశ్వముయొక్క సృష్టి స్థితిలయములకు కారణభూతమగు తత్త్వ మెయ్యది యనుసంశయము గలిగి శ్వేతాశ్వతరునియొద్దకు చేరి యీవిధముగ చర్చ నారంభించిరి—

ఓం బ్రహ్మవాదినో వదంతి —
కిం కారణమ్ ? బ్రహ్మ? కుతః స్మ జాతాః?
జీవామ కేన ? క్వ చ సంప్రతిష్ఠా (ష్ఠితాః)?
అధిష్ఠితాః కేన సుఖేతరేషు
వర్తామహే ? బ్రహ్మవిదో వ్యవస్థా

విశ్వమునకు కారణమగు బ్రహ్మతత్త్వ మెయ్యది? దేనినుండి జన్మించితిమి? దేని నాధారముగా గొని జీవించుచున్నాము? లయ కాలమున దేనియందు లీనమగుచున్నాము? యదధిష్ఠితులమై సుఖ దుఃఖములయందు ప్రవర్తించుచున్నాము? ఓబ్రహ్మవేత్తలారా! ఈసర్వమునకును వ్యవస్థ యేది?

ఇయ్యవి మహర్షులకు బ్రహ్మవిషయజిజ్ఞాసువులకు గలిగిన ప్రశ్నలు. ఈప్రశ్నలను చర్చించి విశ్వముయొక్క సృష్టిస్థితిలయకారణ మగు తత్త్వ మేది యని నిర్ణయించుసందర్భమున

కాలః స్వభావో నియతి ర్యదృచ్ఛా
భూతాని యోనిః పురుష ఇతి చింత్యమ్
సంయోగ ఏషాం న త్వాత్మభావా
దాత్మా ప్యనీశః సుఖదుఃఖహేతోః

కాలమా ? స్వభావమా ? నియతియా ? యదృచ్ఛయా ? పంచభూతములా ? ప్రకృతియా ? పురుషుడా ? వీనిలో నేయొకటి యీవిశ్వము యొక్క సృష్టిస్థితిలయములకు కారణము ? లేక వీనిసమష్టియా ? లేక పురుషుడా ? అని చర్చించి కాలాదు లేయొకటిగాని, లేక వీనిసమష్టిగాని చేతనత్వాభావమువలన కారణము గాదనియును, కాలాదులలో పురుషుడు చేతనుడైనను సుఖదుఃఖాభిభూతుడగుటవలన నాతడును కారణము గాదను నిశ్చయమునకు వచ్చిరి. ఎంత చర్చించినను నీవిషయము చర్చలవలన తేలునది గాదను నిర్ణయమునకు వచ్చి

> తే ధ్యానయోగానుగతా అపశ్యన్
> దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్
> యః కారణాని నిఖిలాని తాని
> కాలాత్మయుక్తా న్యధితిష్ఠ త్యేకః

వారు ధ్యానయోగము నవలంబించి కాలాదిసర్వకారణముల నధిష్ఠించి విశ్వసృష్టిస్థితిలయరూపమహాక్రీడాపరాయణుడైన పరమేశ్వరుని శక్తిని సాక్షాత్కరింపజేసికొనిరి. తరువాత నాధ్యానయోగప్రభావమువలననే

> సర్వాజీవే సర్వసంస్థే బృహంతే
> అస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే
> పృథ గాత్మానం ప్రేరితారం చ మత్వా
> జుష్ట స్తత స్తే నామృతత్వ మేతి.

సర్వప్రాణులకును జీవనకారణమైనట్టియు, సర్వులకును ప్రళయకాలమున నాశ్రయమైనట్టియును, ననంతమునగు నీబ్రహ్మచక్రమునందు అనగా విశ్వమునందు జీవుడు జననమరణపరంపరకు లోనై యాతాయాతములు గావించుచున్నాడు. ప్రేరకుడగు నాకారణస్వరూపు నీచక్రముకంటె భిన్నునిగా నుపాసించి పిమ్మట నాతనిచే ననుగ్రహింపబడినవాడై యమృతత్వమును, మరణరాహిత్యమును పొందుచున్నాడని తెలిసికొనిరి.

ఇప్పటివఱకు జరిగిన చర్చయొక్క సారాంశము :—

మనకు గలిగినట్లే బ్రహ్మవాదులగు మహర్షులకును నీవిచిత్రవిశ్వనిర్మాత యెవ రనుసందియము గలిగినది. కాలస్వభావాదులలో నేది యీవిశ్వమునకు కారణ మని చర్చించిరి. కాలాదు లచేతనము లగుటచే కారణ మగుటకు వీలు లే దనునిర్ణయమునకు వచ్చిరి. విశ్వమునకు కాలాదులసమష్టి కారణమా యన్న నచేతనములసమష్టియును కారణ మగుటకు వీలు లే దని నిర్ణయించికొనిరి. ఇక విశ్వమునందు చేతనులు జీవులు కన్పించుచున్నారు. జీవులు విశ్వకారణ మందమన్న సుఖదుఃఖాభిభూతులగుటవలన జీవులును కారణ మగుటకు వీలు లే దనునిర్ణయమునకు వచ్చిరి.

ఇంతియే గాదు. ఈవిధముగ నెంతకాలము చర్చించినను సమాధానము దొరుకదను నిర్ణయమునకు వచ్చి ధ్యానయోగము నవలంబించి కాలాదుల నధిష్ఠించి విశ్వకారణమగు నొకతత్త్వ మున్నదని తెలిసికొనిరి. మఱియును నాతత్త్వము సర్వమునకు ప్రాణాధార మనియు, సర్వమున కాశ్రయ మనియు, నయ్యది యీవిశ్వమునకన్న భిన్నముగా నున్న దనియు, నాతత్త్వమునుపాసించి తదనుగ్రహమువలన నమృతత్వము పొందవచ్చు ననియు తెలిసికొనిరి. కాని యాతత్త్వ మేదియో యింతవరకును నిర్ణయము కాలేదు.

సంయుక్త మేతత్ క్షర మక్షరం చ
వ్యక్తావ్యక్తం భరతే విశ్వ మీశః
అనీశ శ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః

క్షర మనగా పరిణామశీలమైన విశ్వమును, అక్షర మనగా పరిణామములేని యాకారణతత్త్వమును సంయుక్తము లనగా నొకదానితో నొకటి పిండిపిసుకులవలె కలిసియున్నవి. వ్యక్తావ్యక్తస్థితులుగల

విశ్వము నీశ్వరుడు భరించుచున్నాడు. అస్వతంత్రుడగు జీవుడు భోక్తయై పాశబద్ధు డగుచున్నాడు. ఈశు నుపాసించి పాశమోక్షము నందుచున్నాడు.

ఈమంత్రమునందు విశ్వేశ్వరులయొక్క సంబంధమును, జీవుని పాశబద్ధత్వమును, పరమేశ్వరోపాసనవలన పాశమోక్షమును వర్ణింపబడినవి. మఱియును నావిశ్వంభరు డీశుడని ప్రతిపాదింపబడినది.

క్షరం ప్రధాన మమృతాక్షరగ్ం హరః
క్షరాత్మానా వీశతే దేవ ఏకః
త స్యాభిధ్యానా ద్యోజనా త్తత్త్వభావా
ద్భూయ శ్చాంతే విశ్వమాయానివృత్తిః

ఈమంత్రమునందు జీవజగచ్ఛాసకుడు హరు డని ప్రతిపాదింపబడినది. ఆహరుని ధ్యానించుటవలనను, లింగరూపమున శరీరమున ధరించుటవలనను, నాతత్త్వమును భావించుటవలనను నీవిశ్వసంబంధము నివర్తించునని ప్రతిపాదింపబడినది.

తరువాత తృతీయాధ్యాయమునందు

ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః
య ఇమాన్ లోకా నీశత ఈశనీభిః

అద్వితీయుడగు రుద్రు డొకడే యీ లోకముల నన్నింటిని శాసించుచున్నాడని ప్రతిపాదింపబడినది. ఈమంత్రమునందు రుద్రశబ్దము ప్రయోగింపబడినది.

ఇక విషయవిమర్శ గావింతము. విశ్వనిర్మాణకారణమగు తత్త్వమీశహరరుద్రాదిశబ్ద వాచ్య మని శ్వేతాశ్వతరసిద్ధాంతము. ఈశాది శబ్దములు

శంభు రీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః
హరః స్మరహరో భర్గ స్త్ర్యంబక స్త్రిపురాంతకః
వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః

అను నమరకోశమువలన శివపర్యాయవాచకములని తెలు చున్నది. కావున నావిచిత్రవిశ్వనిర్మాతృతత్త్వము శివు డనుట శ్వేతా శ్వతరమునందలి బ్రహ్మవాదిమహర్షుల చర్చయొక్క సారాంశము.

శ్వేతాశ్వతరము శివనామభూయిష్ఠమగుటచే శైవోపనిష త్తనుట నిర్వివాదము. మఱియును నీయుపనిషత్తు పంచరుద్రములలో నిది. కైవల్య, జాబాల, శ్వేతాశ్వతర, కాలాగ్నిరుద్ర, అథర్వశిరస్సులను నైదింటికిని పంచరుద్రము లను వ్యవహార మున్నది. ఈకారణముచేతను శ్వేతాశ్వతరము శైవోపనిషత్తనియే తెలుచున్నది.

ఈచర్చవలన నీవిచిత్రవిశ్వనిర్మాతకు నామకరణము చేయు సందర్భమున మనకు గలిగిన సందేహము బ్రహ్మవాదులగు మహర్షు లకు గలిగి వారు చర్చించి యాతత్త్వము కాలస్వభావాదులలో నేది యును గాదనియును, నయ్యది శివమహేశ్వరరుద్రాదిశబ్దవాచ్య మని యును నిర్ణయించిరను విషయము మంత్రోపనిషద్వ్యవహారముగల శ్వేతాశ్వతరమున చక్కగా వివరింపబడిన దని తేలుచున్నది. ఇక జీవేశ్వరజగత్సంబంధవిషయము గాంతము.

## జీవేశ్వరజగత్సంబంధము

దృశ్యమానము, ననుభూయమానమగు జగత్తును పరిశోధించి విమర్శించిన దీనియందు పరస్పరభిన్నములగు కొన్నితత్త్వములు గాన్పిం చుచున్నవి. ఇందు పృథివ్యప్తేజోవాయువులు ముఖ్యములు. ఇయ్యవి పరస్పరవిలక్షణములుగా నున్నవి. ఈభూతవికారములగు పదార్థజాత ముతోనే విశ్వము నిండియున్నది. మఱియును నీభూతములు వ్యస్తముగ గాక పరస్పరసమ్మిశ్రితములయియే వినియోగావస్థ నందుచున్నవి. వీనిని అనగా పార్థివాప్యతైజసవాయవ్యపదార్థములను ప్రాణులు విని యోగించికొని జీవించుచున్నారు. భోక్తలు జీవులు, భోగ్యము పదా

ర్థజాతము. భోక్తృభోగ్యములకన్న విలక్షణమగు నొకతత్త్వ మనుభ వమున నున్నది. అదియే యాకాశము. ఆకాశ మనగా కాలీప్రదేశము. ఇయ్యది విశ్వసమవస్థానమునకును, భోక్తలగు జీవుల జీవికానిర్వహణ మునకును సంబంధించిన గమనాగమనములకును నావశ్యక మగుచు న్నది. ఈచర్చవలన పరస్పరవిలక్షణమగు నాకాశాదిభూతపంచకమును, జీవులును నను తత్త్వము లున్నవని తేలుచున్నది. ఆకాశాదిభూత పంచకసమష్టికే జగత్తని వ్యవహారము.

విచిత్రవిశ్వనిర్మాతయగు నొకతత్త్వ మున్నదనియును, నయ్యది శివమహేశ్వరరుద్రాదిశబ్దవాచ్య మనియును పూర్వగ్రంథమున వివరిం చినాము. ఈతత్త్వమే

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ
ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ

జీవమనస్సర్వేంద్రియభూతపంచకసృష్టి గావించుచున్నది. పాంచభౌతిక మగు శరీరమును సృష్టించి జీవుల కొసంగి వారియనుభవమున కావశ్య కములగు వ్రీహియవాదులను నిర్మించియిచ్చినది. ఈవిధముగ శరీరాది కమును నిర్మించి జీవుల కొసంగి పరమేశ్వరుడు సర్వప్రేరకుడై విరాజిల్లు చున్నాడు.

## త్రితత్త్వసిద్ధాంతము

ఈచర్చవలన జీవజగదీశ్వరు లను మూడుప్రధానతత్త్వము లున్నవని తేలుచున్నది. తత్త్వములవిషయమున భిన్నభిన్నసంప్రదా యము లున్నవి. తత్త్వము లిరువదియైదని కపిలుడు. కాపిలసంప్రదా యమునకు సాంఖ్య మని పేరు. పాతంజలసంప్రదాయమున తత్త్వము లిరువదియాఱు. కాపిలపంచవింశతితత్త్వములకన్న పాతంజలమున నీశ్వ రతత్త్వ మధికము. కపిలుడు నిరీశ్వరవాది. పతంజలి యీశ్వరాస్తి

త్త్వము నంగీకరించినవాడుగాన సేశ్వరవాది. పురాణసిద్ధాంతమున తత్త్వములు ముప్పదియాఱు. ఇంకొొకసంప్రదాయమున తత్త్వములు తొంబదియాఱు.

ఏసంప్రదాయమున తత్త్వము లెన్ని యన్నను ప్రధానతత్త్వములగు జీవేశ్వరజగత్తత్త్వములం దంతర్భూతములే. నిరీశ్వరవాదియగు కపిలునిసిద్ధాంతమున నీశ్వరు నంగీకరించలేదుగాన పురుషభిన్నములగు పృథివ్యాదిచతుర్వింశతితత్త్వములును జగత్తునకు సంబంధించినవే. కావున కాపిలమున పురుషజగత్తులు రెండే ప్రధానతత్త్వములు. మిగిలిన పాతంజలాదిసంప్రదాయములందు జీవేశ్వరజగత్తులు మూడే ప్రధానతత్త్వములు. సాంఖ్యేతరసంప్రదాయములన్నియును నీశ్వరాస్తిత్వము నంగీకరించిన సంప్రదాయములు.

ఇప్పటివఱకును తత్త్వములవిషయమునగల భిన్నభిన్నసంప్రదాయములను వివరించినాము. ఇక బ్రహ్మవిద్యావిషయమునగల సంప్రదాయములవిషయము గాంతము.

జీవేశ్వరజగత్తు లను మూడు ప్రధానతత్త్వము లనియును, నందు ఈశ్వరుడు ప్రేరకుడును, జీవుడు భోక్తయును, జగత్తు భోగ్యము ననియును వివరించినాము. ఈమూడును సత్యతత్త్వములని యొకసంప్రదాయము. ఇందు బ్రహ్మతత్త్వ మొకటియే సత్యతత్త్వ మనియును, జగత్తు మిథ్య యనియును, బ్రహ్మయే యొకదశయందు జీవశబ్దవాచ్యుడగుచున్నా డనియును మఱియొకసిద్ధాంతము. ఈరెండుసంప్రదాయములందును నెయ్యది యనుభవసిద్ధమో, విమర్శసహమో, ఉపనిషత్సమ్మతమో గాంతము.

## చర్చాప్రయోజనము

జీవేశ్వరజగచ్చర్చకు ప్రయోజన మేమి?

లోకమున ప్రాణులు సహజముగనే ఆహార నిద్రా మైథున ప్రవృత్తిగలవియై యున్నవి. ఈవిషయమున నెవరును నేమియును బోధింప నక్కఱలేదు. పుట్టినప్పటినుండి కొంతకాలమువఱకును నాహార సంపాదనప్రయత్నమున సామర్థ్యము లేకున్నను నాకలిదప్పులు సహజముగనే యుండును. ఆకలియైనపుడు శిశువులు రోదనము చేయుట యనుభవసిద్ధమగు విషయమే. క్రమముగ శరీరము వృద్ధియగుచున్న కొలదియు నాహార మధిక మగుచుండును. కొలది కాలమునకు శిశువు లాకలిదప్పులను గుర్తెఱిగి యాహారపానీయములకొఱకై ప్రయత్నింతురు. క్రమముగ వారు స్వయముగనే యాహారపదార్థసంపాదనమున వ్యగ్రు లగుదురు. ఆహారమువలెనే నిద్రయును సహజలక్షణమే. దీని కితరులతో నేమియును సంబంధము లేదు. నిదురవచ్చినపుడు సుఖమునుగూడ పరిగణింపక నిదురించుట యనుభవమునన్న విషయమే.

ఇక మైథునవిషయము గాంతము. రసాదిసప్తధాతువులలో నేడవది శుక్రము. ఆహారము క్రమముగా జఠరాగ్నివలన పచనమై శుక్రరూపమున పరిణతి చెందును. ఇయ్యది పురుషునియందు శుక్రమనియును, స్త్రీయందు శోణితమనియును వ్యవహరింపబడుచున్నది. ఈసప్తమధాతు వొకవయస్సువరకును సర్వశరీరవ్యాపిగానుండును. యుక్తకాలమున నిర్గమనోన్ముఖ మగును. పురుషులయం దీవయస్సును నిర్ణయించుట దుష్కరము. కాని స్త్రీలయందు స్పష్టముగా గాన్పించుచున్నది.

శోణితనిర్గమనకాలమునకు పూర్వము బాలిక కన్యక యనియును, నగ్నిక యనియును, రజస్వల యనియును మూడు పేరులతో వ్యవహరింపబడుచున్నది.

అష్టవర్షా భవే త్కన్యా నవవర్షా తు నగ్నికా
దశవర్షా భవే ద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా

కన్యతే కామ్యత ఇతి కన్యా= కోరబడునది కన్య. అనగా తాను కోరుస్థితికి రాలేదని కన్యాశబ్దార్థము. నగ్నికా అనాగతార్తవా= నగ్నిక యనగా ఆర్తవము = శోణితము నిర్గమనోన్ముఖము కాలేదని యర్థము. రజస్వలా = రజః శోణిత మస్యా అస్తీతి రజస్వలా = శోణితముగలది యని శబ్దార్థము. సర్వశరీరవ్యాపి యగు శోణితము నిర్గమనోన్ముఖమై క్రమముగా స్థానమునకు చేరుచున్నస్థితియం దున్నదని యర్థము. యుక్తకాలము వచ్చునప్పటికి శోణితము వెలువడును. ఈసమయమున బాలిక రజస్వలయైనదని యాకాలమున తత్ప్రయుక్తమైన నియమములను పాటింపజేయుదురు. ఇప్పటినుండియును బాలిక పురుషసంబంధవాంఛగల దగును. అట్లే యువకుడును అనగా శుక్రము నిర్గమించుకాల మాసన్నమైనస్థితియం దున్నవాడు స్త్రీసంబంధవాంఛగలవా డగును. విశేష మేమన నీవిషయమున నన్యులసలహా యవసరము లేకపోవుటయే.

మానవులయందు వివాహ మను సంస్థ యుండుటచే స్త్రీపురుషులప్రథమసంబంధము నిర్ణీతశుభసమయములయం దేర్పాటు చేయబడుచున్నది. ఇంతమాత్రమున మిథునకర్మకు సంబంధించిన వాంఛ యన్యులచేత కలిగింపబడుచున్న దనుటకు వీలు లేదు. కాని యితర ప్రాణులయందు స్త్రీపురుషప్రాణు లావాంఛగలిగినపుడు సహజముగనే కలియుచుండుట చూచుచున్నాము. కావున మిథునవాంఛ సహజమని తెలుచున్నది.

ఈచర్చవలన నాహారనిద్రామైథునములు ప్రాణులకు సహజధర్మము లని తెలుచున్నది. ఈధర్మములకు సంబంధించినంతవరకును ప్రాణుల కేచర్చతోడను సంబంధము లేదు. దాని కావశ్యకమగు

ప్రయత్నమున మునిగి తేలుచు తత్ప్రాప్తియందు సంతోషమును, లాభమునందు దుఃఖమును ననుభవించుచు క్రమముగ మరణ మాస మైనపుడు మరణించుచుందురు. ఇయ్యది జీవితపద్ధతి.

## మానవుడు - చర్చారంభము

కాని మానవజీవితమున నొకవిశేష మున్నది. పశుపక్ష్యాద తమ జీవికానిర్వాహణమున నెవ్వరితోను చర్చించుటగాని, సలహా కొనుటగాని చేయుటలేదు. కాని మానవు డట్లు గాదు. మానవ సంఘజీవి. భాష కలవాటుపడినవాడు. కావున సంఘమునందు మెల టలో నితరుల కాటంకము గలుగకుండ జీవించుటలో నన్యుల హాలు గైకొనవచ్చును. కాని కేవలమాహారనిద్రామైథునముల య మేమైనచో నాతని కితరుల సలహాలతో పని యుండదు. కాని మా డంతటితో తృప్తిపడి యూరకుండు స్వభావముగలవాడు కాడు.

ఆహారము దొరుకకున్న, నిద్రించుటకు వలనుపడకున్న, సంబంధమున కవకాశము లేకున్న మానవు డంతటితో నాగడు. కారణ మేమైయుండునని యాలోచింప నారంభించును. ఆలోచి యాప్రతిబంధకములను తొలగించుకొనుటకై యత్నించును. అప్ప సాఫల్యము చేకూరకున్న స్వప్రయత్నవైఫల్యమునకు కారణ మైయుండునని యాలోచింప నారంభించును. ప్రయత్నవైఫల్ హెచ్చినకొలది మానవునియాలోచనయు హెచ్చుచుండును. చివ మానవుడు తనసాఫల్యవైఫల్యములకు తానే కారణము గాదని యించికొని తత్కారణాన్వేషణకై తహతహలాడును. ఇప్పటినుండి నాతనియాలోచనల కంత ముండదు. ఈపరిస్థితి తనకే గాదు, ఇత కును గలుగుచుండుటను గమనించుటచే తత్కారణజిజ్ఞాస యధి మును, నధికతరమును నగుచుండును. ఇదియే యాతని యాస్తిక నకు నాంది.

ఆస్తికుడు = జగచ్ఛాసకమగు నొకతత్త్వ మున్నదను భావము గలవాడైనాడు. ఇంతటితో నాతనియాలోచన యాగినదా? తానెవరు? తనకును, నాతత్త్వమునకునుగల సంబంధ మేమి? తా ననగా నీశరీరమా? తాను శరీరముకన్న భిన్నుడా? అయిన తన కీశరీరముతో నెప్పుడు సంబంధము గలిగినది? ఈశరీరముయొక్క స్వభావ మేమి? తానును నితరులవలె మరణించవలసినదేనా? మరణము తప్పని-చో తరువాత నే మగును? అసలు తన కీజన్మ యెట్లు, ఎందుకు గలిగినది? తన కీజన్మ గలుగుటలో తనతలిదండ్రు లెంతవఱకు బాధ్యులు? వారు కోరినప్పుడు తదనుసారముగా తన కీజన్మ గలిగినదా? లేక వారు ద్వారభూతులేనా? అయిన నీజన్మకు పూర్వరంగ మే మైయుండును? ఎన్ని ప్రశ్నలు? వీనికి సమాధానము చెప్పువా రెవరు? ఇయ్యదియే యాతని గుర్వభిగమనమునకు నాంది.

ఈవిధముగ చర్చ గావించి కావించి సమాధానము లభింపక గుర్వభిగమనము గావించి గురువువలన సర్వసంశయవిచ్ఛేదకమగు నుపదేశము నొంది తదుపదిష్టమార్గమున నీశ్వరు నారాధించుట కారంభించి క్రమముగ నాతనియందపునరావృత్తముగ సాయుజ్యము నందును. ఇదియే జీవేశ్వరజగచ్ఛర్చాప్రయోజనము.

## త్రితత్త్వములు - సత్యత్వవాదము

ఇక విషయవిమర్శ గావింతెము. ఒకసంప్రదాయమువారు జీవేశ్వర జగత్తత్త్వములు సత్యతత్త్వము లనినారు. మఱియొకసంప్రదాయము వారు బ్రహ్మతత్త్వ మొకటియే సత్య మనియు, జగత్తు మిధ్య యనియు, జీవుడు బ్రహ్మాభిన్ను డనియు ప్రతిపాదించుచున్నారు.

విశేష మే మన రెండుసంప్రదాయములవారును మూడు తత్త్వము లంగీకరించినారు. ఒక సంప్రదాయమువారు జగత్తు మిధ్య యనినారు. జీవుడు బ్రహ్మాభిన్ను డనినారు. అయిన నిచట నొక ప్రశ్న

యుపస్థిత మగుచున్నది. ఈప్రశ్న యీరెండుసంప్రదాయముల పౌర్వా పర్యమునకు సంబంధించినది. ఈసంప్రదాయములలో నేసంప్రదాయము మొదటిది? ఏది తరువాతి దని ప్రశ్నార్థము.

ఈరెండుసంప్రదాయములందును బ్రహ్మ యన్నను, నీశ్వరు డన్నను నొకతత్త్వము సత్యతత్త్వముగా నంగీకరింపబడినది. మొదటి సంప్రదాయమున జీవుడు సత్యపదార్థము. మఱియును జీవు లనేకులు. రెండవసంప్రదాయమునందు జీవుడు బ్రహ్మాభిన్నుడు. అనగా నొకదశ యందు బ్రహ్మయే జీవశబ్దవాచ్యు డగుచున్నాడు. ఇక జగద్విషయము గాంతము. జగత్తు సత్యపదార్థ మని యొకరు. మిథ్య యని మఱొకరు. ఇయ్యది రెండుసంప్రదాయములవారి సిద్ధాంతమునకు సంబంధించిన సంగ్రహావివరము. ఇక నొక్కొక్క తత్త్వమునుగూర్చి చర్చింతము.

## జ గ త్తు

ఈమూడుతత్త్వములయందును మొదట జగత్తత్త్వవిషయము గాంతము. జగత్తనగా పంచభూతములని పూర్వగ్రంథమున వివరించి నాము. జగత్తుకే ప్రకృతి యని వ్యవహార మున్నది. ఇక ననుభవములో జగత్తునకుగల స్థాన మేదో గాంతము. ఆకాశాదిపంచభూతసమష్టికే జగత్తని వ్యవహారము. ఇం దాకాశము మిగిలినభూతములయొక్కయు తద్వికారములగు పదార్థజాతముయొక్కయు సమవస్థానమునకును, ప్రాణుల గమనాగమనములకును నవకాశ మిచ్చుచున్నది. వాయువు ప్రాణులయం దుచ్ఛ్వాసనిశ్వాసరూపమున వినియోగించుచున్నది. అగ్ని పదార్థపచనమునకును, భుక్తపదార్థజీర్ణక్రియయందును, కాంతికిని, ఉష్ణమునకును వినియోగపడుచున్నది. జలము పానమునకును తద్ద్వారా రక్తవహనమునకును వినియోగించుచున్నది. పృథివి అస్థిమాంసాదికఠిన భాగరూపమునను, ఆహారపదార్థరూపమునను వినియోగించుచున్నది.

## జీవుడు

ఇప్పటివఱకును ప్రకృతియొక్క వినియోగావస్థను వివరించినాము. ఇక వినియోగించుకొనువానియొక్క స్థితిని గాంతము. వినియోగించుకొనువాడు జీవుడు. జీవు డీపాంచభౌతికమగు శరీరము నధిష్ఠించి దానిని పోషించికొనుచు తద్ద్వారా సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. ఈస్థితియం దాతనికి భోక్త యని వ్యవహారము. భోక్తృత్వదశయందు జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూడు స్థితు లున్నవి. జాగ్రత్ స్థితి యనగా కార్యవ్యాపృతికాలమందు మేలుకొనియున్న స్థితి. జీవికకు గావలసిన యాయాపనులు చేసిచేసి యలసినపుడు శరీరమునకు విశ్రాంతి యవసరము. ఈవిశ్రాంతి కే సుషుప్తి యని వ్యవహారము. ఈస్థితియం దేయింద్రియములును పనిచేయవు. కాని కొన్నిసమయములయందు విశ్రాంతికాలమున భోక్తయగు జీవుడు కొన్నిదృశ్యములను చూచుట సంభవించుచుండును. ఈస్థితికి స్వప్నావస్థ యని పేరు.

ఈమూడుస్థితులును జీవుడు శరీరము నధిష్ఠించియున్నంతవర కే సంభవించుచుండును. ఇవియే గాదు, సర్వమును ననగా సర్వవిధ వ్యాపారములును శరీరము నధిష్ఠించియున్నంతవఱ కే. సాధనము లేనిది సాధ్యనిష్పత్తి లేదు. వృక్షచ్ఛేదనము గావింపవలయునన్న ఛేదన సాధనమైన వస్తువు కావలయును. లేనిచో ఛేదన మసంభవము. అనుభవమునను శరీరియగు జీవుడు సాధనమగు శరీరముద్వారానే సర్వకార్యములు చేయుచుండుట గాంచుచున్నాము. ఇంద్రియదశకమును సాధనములే. గమనసాధనములు పాదములు. పాదములను వినియోగించికొనియే గంత యగుచున్నాడు. జీవునకు సర్వవిధమగు కర్తృత్వము (ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా మంతా బోద్ధా కర్తా) శరీరమూలకమే. సర్వవిధకర్తృత్వములును స్వానుభవముకొఱకే యుద్దేశింపబడినవిగాన జీవునకు వేదాంతములయందు భోక్త యని వ్యవహారము. భోక్త జీవుడు. భోగ్యము జగత్తు. భోగసాధనము శరీరము.

కావున శరీరము లేనిది జీవునకు కర్తృత్వమును, తత్ప్రయుక్తమగు భోక్తృత్వమును లేవు. భోగ్యమగు పదార్థజాతమును, సాధనమగు శరీరమును భూతములకు సంబంధించినవే.

## జగత్తు - వాదవైవిధ్యము

ఇప్పటివఱకును జగద్విషయము వివరించినాము. ఇక జగద్విషయమునగల సంప్రదాయములను గాంతము. జగత్తు సత్యమని యొక సంప్రదాయము. మిథ్య యని మఱియొకసంప్రదాయము. సత్యమనగా త్రికాలాబాధ్యము - మూడుకాలములందుండునది. జీవుడేవిధముగ త్రికాలాబాధ్యుడో యావిధముగ జగత్తును త్రికాలాబాధ్యమే. జీవసత్యత్వవిషయ మనంతరగ్రంథమునందు చర్చింపబడునుగాన నింతట విరమించి ప్రకృత మనుసరింతము.

జగత్సత్యత్వవిషయమున ననుభవ మెట్లున్నదో గాంతము. జగత్తనగా పంచభూతములు. ఇందాకాశము వాయ్వాదులవలె మూర్తభూతము గాదు. మూర్తభూతములు వాయువహ్నిసలిలపృథువులు. సత్యత్వవిషయమున స్పష్టముగా తెలియుట కవకాశముగలదిగావున జలవిషయము గాంతము. జలము ప్రవహణస్వభావముగలది. ఉన్నత ప్రదేశమునుండి పల్లమునకు ప్రవహించును. జలము నొకస్థితివఱకును చల్లబరచిన ఘనీభవించును. మఱల వెచ్చజేసిన నీరుగా మాఱును. ఇంకను నొకస్థితివఱకును వెచ్చజేసిన నావిరి యగును. ఆవిరి చల్లదనముచే మఱల ద్రవపదార్థమగు జలముగా మాఱును. కాని యీమూడు స్థితులయందును మూలవస్తువు నశించుటలేదు. రూపాంతరాపత్తి నందుచున్నది. పృథివీవిషయమును నింతియే. ఘటనిర్మాణము గావింపవలసినవ్యక్తి మట్టిని దెచ్చి చూర్ణీకరించి నీరు కలిపి ముద్దగా జేసి సారెయందుంచి ఘటశరావాదులను తయారుచేయుచున్నాడు. ఇష్టములేనపుడు మఱల ముద్దగా తయారుచేసినాడు. అవసరమైన మఱల నాముద్దను

మూకుడు మొదలగు వస్తువులనుగా తయారుచేయును. వస్త్రావశ్యకత లేనపుడు ముద్ద నావల పారవేయును. ఆముద్ద యెండినపిదప మఱల చూర్ణీకరించిన పొడి యగును. రూపనామములు మాఱుచున్నవిగాని మూలద్రవ్యము నశించి రూపాంతరమును పొందుటలేదు. అగ్నియును నింతియే. జలమునందున్న వైద్యుతాగ్నిని తీగెలలోనికి చేర్చి దీపములు వెలిగించుచున్నాము. జలమునందు చేర్చి స్నానాదుల కుపయోగించు చున్నాము. జలముద్వారా బియ్యమునందు చేర్చి యన్నాదులు వచనముచేసికొనుచున్నాము. అగ్నికి రూపాంతరాపత్తి లేదు. కాని ఆయావస్తువులందు జేరి యాయాపనులు నిర్వర్తించుచున్నది.

భౌతికశరీరములవిషయమును గాంచుడు. భౌతికాణువుల నాహారముగా గొని అంకురములు మహావృక్షము లగుచున్నవి. కాలము తీరినవెనుక నీ రావిరిరూపమును, కట్టె పృథివీరూపము నందుచున్నవి. పశుపక్ష్యాదిశరీరవిషయమును నింతియే.

ఇచట నొకవిశేషమును ప్రధానముగా గమనింపవలయును. మన మేపృథివియందు నివసించుచున్నామో యాపృథివియందే మన తలిదండ్రులు, వారి తలిదండ్రులు నివసించినారు. మనశరీరము లేభూతములతో నిర్మింపబడినవో అస్మత్పూర్వతత్పూర్వులశరీరములును యాభూతములతో నిర్మింపబడినవే. ఈచర్చచే నీభూతము లనాదికాలము నుండియు నీవిధముగనే మూలద్రవ్యము నశించకుండ రూపాంతరాపత్తి నందుచున్నవని యంగీకరింపకతప్పదు. కావుననే సిద్ధాంతకర్త లందఱును భూతములకు నాశము లేదని ప్రతిపాదించినారు. పాశ్చాత్య సిద్ధాంతమునందును Matter is indestructible = పదార్థమునకు నాశము లేదని సిద్ధాంతీకరించినారు. ఈవిషయము గీతలయందును

> నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః
> ఉభయో రపి దృష్టోంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః

అను శ్లోకముచే ప్రతిపాదింపబడినది. కావున భూతము లనగా జగత్తు నాశము లేనిదనియును, నీకారణముచే త్రికాలాబాధ్యము= సత్యత్వ మనియును ననుభవమున తేలుచున్నది.

## మిథ్యావాదము

ఇక జగత్తు మిథ్య యనువారిసంప్రదాయము గాంతము. మిథ్య యనగా త్రికాలబాధ్యము అనగా మూడుకాలములందును లేదని వారి నిర్వచనము. జగత్తు భూతకాలమున లేదు, వర్తమానకాలమున లేదు, కావున భవిష్యత్కాలమున నుండదు. ఇది వారి సిద్ధాంతము.

భూతవర్తమానకాలములవిషయము చర్చించిన భవిష్యత్కాలము గతార్థమే. ప్రత్యక్షముగాన వర్తమానకాలవిషయము గాంతము. వర్తమానకాల మనగా ప్రస్తుతము మనము జీవించుచున్నకాలము. జగత్సత్యత్వవాదుల సిద్ధాంతముప్రకారము భోగసాధనములగు వారి శరీరములును, భోగ్యములగు నాహారాదిపదార్థములును సత్యములే. ఇయ్యవి వారిసిద్ధాంతముప్రకారము అంతకు పూర్వమునుండియును నున్నవే. ఈవిషయము వారితలిదండ్రుల శరీరములను గాంచిననే తెలియును. వారితలిదండ్రుల నడిగిన వారు తమతలిదండ్రుల శరీరవిషయమును, అప్పటియాహారపదార్థములవిషయమును యథాతథముగ చెప్పుదురు. ఈకాలములోమాత్ర ముండి యంతకుపూర్వము లేవనుట దుర్వాద మగును.

మిథ్యాత్వవాదులకు సత్యత్వవాదులవలె భోగసాధనమగు శరీరములు లేవా? భోగ్యపదార్థజాతము ననుభవించిగదా వారు జీవించునది? భోగసాధనమగు శరీరమును, భోగ్యమగు పదార్థజాతమును జగత్తునకు సంబంధించినవియేగదా? ఈజగత్తేనా వారిసిద్ధాంతము ప్రకారము మిథ్య? ఇదియేనా మూడుకాలములందును లేనిది?

వాదమున కంగీకరింతము. జగత్తుయొక్క భాగములగు శరీరమును, తతోప్షణమున కావశ్యకములగు పదార్థజాతమును మూడు కాలములందును లేనివనియే యంగీకరింపవలయును. అధిష్ఠానమగు శరీరము లేదు. జీవునకు కర్తృత్వము లేదు. ఈలేకపోవుట యెంతవఱకు? ఏమియును లేదు—వాక్కు లేదు, అధ్యయనము లేదు, చివరకు జగత్తు మిధ్య యనుట లేదు, సంప్రదాయము లేదు, సిద్ధాంతములేదు. ప్రవక్త లేడు. ఆతనికి నామకరణము లేదు – ఇంతకన్న మూలచ్ఛేదమునకు మార్గాంతర మేమి కావలయును? జననము లేదు, మరణము లేదు, మోక్షము లేదు, శబ్దరాశియగు వేదము లేదు. తత్ప్రతిపాద్యతత్త్వమగు నీశ్వరుడు, కాదు వారిసంప్రదాయమున బ్రహ్మ కాబోలు, ఆ తత్త్వమును లేదు. అయినను, ఒకవేళ నున్నను నాతత్త్వముయొక్క యావశ్యకత యెవరికి? మూలోచ్ఛేదకమగు నీవాదమున కొకయస్తిత్వము నంగీకరించి కాలము వ్యర్థము చేయుటకంటె సత్యపదార్థాన్వేషణము గావింతము.

## జగత్తు - ప్రామాణికవాదము

ప్రామాణికవాదమున జగత్సత్యత్వమునకుగల ప్రతిపత్తి యేమో గాంతము. ఉపనిషత్తులలో మొదటిదగు నీశావాస్యమునందలి ప్రథమ మంత్రమున జగత్ప్రస్తావము గావింపబడినది.

ఈశావాస్య మిదగ్ం సర్వం య త్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః మా గృధః కస్యస్వి ద్ధనమ్

మంత్రార్థము:– ఇదమ్ = ఈపరిదృశ్యమానమగు, సర్వమ్ = సమస్తమును, ఈశావాస్యమ్ = ఈశ్వరున కావాసభూతమైనది. జగత్యామ్=లోకమునందు, యత్ =ఏ, జగత్ =పదార్థజాతము గలదో, తదపి ఈశావాస్య మేవ=అదియును నీశావాస్యమే. తేన=ఆయీశ్వరునిచేత, త్యక్తేన = అనుగ్రహపూర్వకముగ నీయబడినదానిని,

భుంజీథాః = అనుభవింపుము. కస్యస్విత్ = ఎవనియొక్కయు, ధనమ్ = ధనమును, మా గృధః = ఆశింపకుము.

ఈమంత్రమునం దీశశబ్దముచేత నీశ్వరుడును, జగతీజగచ్ఛబ్దముల చేత జగత్తును అను రెండు తత్త్వములు ప్రతిపాదింపబడినవి. భుంజీథాః మా గృధః అను క్రియాపదములచే కర్తయగు ముముక్షువు సూచింపబడినాడు. ఈశావాస్య మీవిధముగ మొదటిమంత్రమునందే త్రితత్త్వ సిద్ధాంతమును ప్రతిపాదించినది ఇంకొక విశేషము. ఈశావాస్యమును ముముక్షువు నుద్దేశించి యాతనియనుభవమును పురస్కరించికొనియే విషయజ్ఞానము నుత్పాదించినది. ఈవిషయము ఇదం సర్వం, యత్కించ జగత్యాం జగత్ అనుపదములచేత సూచింపబడుచున్నది.

ఇదం సర్వమ్ అనుపదముల కీదృశ్యమానమగు సమస్త మని యర్థము. ఇదమ్ అనునది యెదుటనున్న వస్తువును నిర్దేశించి వస్తుజ్ఞానము కలిగించుటలో ప్రయోగింపబడు సర్వనామము. కావున నిట్టి సర్వనామములకు నిర్దేశకసర్వనామములని వ్యవహారము. పరిదృశ్యమాన మనగా చూపుప్రసరించునంతవఱకు నున్న పదార్థజాత మని యర్థము. చూపు ప్రసరించునంతవఱకునున్న పదార్థజాతమే యావజ్జగత్తు కాదను నుద్దేశముతోడనే యత్కించ జగత్యాం జగత్ అనువాక్యము ప్రతిపాదింపబడినది. ఈవాక్యమున కర్థము ఇదం సర్వమ్ అనుపదములచే నిర్దేశింపబడిన చూపుమేఱవఱకున్న పదార్థజాతమే గాక తద్బహిర్భూత మగునదియును నున్నదని. ఈరెండువిధములైన దంతయును నీశావాస్యమని ఫలితార్థము.

## జగదీశ్వరసంబంధము - వైశిష్ట్యవాదము

పిండియందు నీ రున్నట్లు, అయోగోళమునం దగ్ని యున్నట్లు, సాముద్రజలమునందు లవణ మున్నట్లు జగత్తునం దంతటను నీశ్వరుడు వ్యాపించియున్నాడు. జగత్తునం దీశ్వరుడు ప్రతిపరమాణువునందును

సాముద్రజలపరమాణువులందు లవణమువలె వ్యాపించియున్నాడు. ఇయ్యదియే జగదీశ్వరులకుగల సంబంధము. ఈవిషయము బృహదారణ్యకమున నంతర్యామిబ్రాహ్మణమున స్పష్టముగా వివరింపబడినది. ఈవిషయ మమృతశబ్దార్థము - బృహదారణ్యకము అనుశీర్షికయందు విపులీకరింపబడుటచే నిట సంగ్రహింపబడినది. కాని మిథ్యావాదులు ప్రతిపాదించినట్లు పరమేశ్వరుడు రజ్జువునందు సర్పమువలె, మరుమరీచికలయందు జలమువలె వ్యాపించియుండలేదు.

మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్
తస్యావయవభూతై స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్

శ్వేతాశ్వతరము

మాయ యనగా ప్రకృతి. మహేశ్వరుడు మాయి. ఆపరమేశ్వరుని యవయవభూతులైన జీవులచే నీప్రకృతి వ్యాప్తమైయున్నదని మంత్రార్థము. సముద్రమునందు జలజంతువులవలె మాయాశబ్దవాచ్యమగు ప్రకృతియందు జీవులు వ్యాపించియున్నారు. జీవజగత్సంబంధము సముద్రయాదస్సంబంధమువంటిది.

సముద్రము యాదోవిశిష్టమైనట్లు మహేశ్వరుడు మాయావిశిష్టుడు. మాయామహేశ్వరుల సంబంధము సముద్రయాదస్సంబంధమువంటిది. సముద్రము జలజంతువులకన్న భిన్నమైనట్లు మహేశ్వరుడు మాయకన్న భిన్నుడు. మాయామహేశ్వరులసంబంధము స్వస్వామిభావసంబంధము. ఈసంబంధము మాయిశబ్దమందలి మత్వర్థీయ ఇనిప్రత్యయముచే సూచింపబడుచున్నది. ధనముగలవాడు ధని, మాయగలవాడు మాయి. ధనధనుల యస్తిత్వము సమానమైననే యాధనముచే వ్యక్తి ధని యని వ్యవహరింపబడుచున్నాడు. వ్యక్తితో సమానమైన యస్తిత్వములేని, స్వామ్యములేని ధనముచేత వ్యక్తి ధని కాడుగదా? కోశాగారములోనున్న ధనముచే వ్యక్తి ధని కాడుగదా? కారణము ధనమునందు స్వామ్యము లేకపోవుటయే. సమానాస్తిత్వముగలదైనను స్వామ్యము

లేని ధనముచేత వ్యక్తిని ధని యనుటకు వీలు లేనప్పుడు త్రికాలబాధ్యమైన, త్రికాలములందును నస్తిత్వములేని ధనముచేత వ్యక్తి ధని యగుట కేమాత్రమును నవకాశము లేదని వేర చెప్ప బనిలేదు. అటులే మాయయును పరమేశ్వరునితో సమానమైన యస్తిత్వము గలదైననే అట్టిమాయచేత పరమేశ్వరుడు మాయి యగును. కాని త్రికాలబాధ్యమైన, రజ్జువునందు సర్పమువలె మూడుకాలములందును నస్తిత్వములేని మాయచేత పరమేశ్వరుడు మాయి కాడు. ఇనిప్రత్యయము భాష యందు సమానాస్తిత్వముగలిగి స్వస్వామిభావసంబంధమున్న వస్తువుల విషయముననే ప్రయోగింపబడుచున్నది. అన్యదీయవస్తువులచేతను, లేనివస్తువులచేతను, వ్యక్తి గృహిగాని, ధనిగాని యగుట కవకాశము లేదు. కావున మాయయును పరమేశ్వరునితో సమానమైన యస్తిత్వము గలదియు, సత్యమును నగుచున్నదని తేలుచున్నది.

## జగత్తు - పరిమాణస్థితులు

బ్రహ్మై వేద మమృతం పురస్తాత్ బ్రహ్మ పశ్చాత్
బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ
అధ శ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మై వేదం విశ్వ మిదం వరిష్ఠమ్

జగత్తున కన్నిపార్శ్వములందును – తూర్పు, పడమర, దక్షిణము ఉత్తరము, క్రింద, పైన అను నాలుపార్శ్వములందును నీశ్వరుడు వ్యాపించి యున్నాడు. ఈవిశ్వమంతయును బ్రహ్మమే అని యీముండకమంత్రము ప్రతిపాదించుచున్నది. జగత్తు అన్ని వైపులను పరమేశ్వరునిచే నావరింపబడి మాతృగర్భమున శిశువువలె సురక్షితముగా నున్నదని మంత్ర పరమార్థము.

శిశువు లేనిచో మాతను గర్భిణి యనము. శిశుమాతల యస్తిత్వము సమానమైనదని యంగీకరించిననే మాత గర్భిణి యగును. లేనిచో మాతృగర్భిణీశబ్దము లనర్థములే యగును. లేని గర్భము నుద్భావించి

వంధ్యను గర్భిణి యనముగదా? అటులే మిథ్యాజగత్తు నుద్భావించి విశ్వము నావరించి యీశ్వరు డున్నాడని ప్రతిపాదించుట పరిహాసావహము గాక మ తేమగును? కావున ముండకమును విశ్వబ్రహ్మలయస్తిత్వము సమానమని ప్రతిపాదించుచు జగత్సత్యత్వవాదమును సిద్ధాంతీకరించుచున్నదని తేలుచున్నది.

పాదోఽస్య విశ్వా భూతాని త్రిపా ద స్యామృతం దివి

విశ్వమంతయు నొకపాదము, మూడుపాదము లీశ్వరుడు అని యీ మంత్రము ప్రతిపాదించుచున్నది. ముండకశ్రుతిప్రకారము విశ్వము పరమేశ్వరగర్భమున మాతృగర్భమున శిశువువలె నున్నది. మూడుపాదములగు పరమేశ్వరునిగర్భమున నున్న ఏకపాత్తగు విశ్వము మిథ్యావాదుల సిద్ధాంతప్రకారము మిథ్య యనవలయును. వస్తువునందలి నాల్గుపాదములును నన్నివిషయములందును సమానము లనునది లోకానుభవము. రూపాయికి నాలుగుపావులాలైనపుడు వానివిలువ సమానమేగదా?

## శివాద్వైతము

ఇప్పటివఱకును జీవేశ్వరజగత్తులసంబంధము చర్చింపబడినది. ఇక నద్వైతశబ్దార్థవిషయము గాంతము. ఈశబ్దము మాండూక్యోపనిషత్తు నందు

ప్రపంచోపరమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే

అనుమంత్రమున గన్పించుచున్నది. ఇందు ప్రపంచోపరమమ్, శాంతమ్, శివమ్, అద్వైతమ్, చతుర్థమ్ అను నైదు ద్వితీయాంతములును, మన్యంతే యను క్రియయు నున్నవి. మన్యంతే అనుక్రియకు తలంచుచున్నారని యర్థము. కాని మంత్రమునందు కర్తృపదము లేదు. ఉపనిషత్తులు ముముక్షువులకు విషయపరిజ్ఞానమునకై యుద్దేశింపబడినవిగాన ముముక్షువులు కర్త యని యంగీకరింపకతప్పదు. ముముక్షవః మన్యంతే = ముముక్షువులు తలంచుచున్నారు. ఏ మని?

మన అవబోధనే యనుధాతువు సకర్మకముగాన ద్వితీయావిభ క్త్యంతపదము నాకాంక్షించును. మంత్రమునందు ప్రపంచోపరమం శాంతం శివ మద్వైతం చతుర్థమ్ అను నైదు ద్వితీయాంతపదము లున్నవి. ఇం దొకటి విశేష్యమును, మిగిలినవి విశేషణములును కావల యును. పదములయర్థము వివరింపబడినగాని యేది విశేష్యమో, యేవి విశేషణములో తెలియదు.

ప్రపంచోపరమమ్ :— ప్రపంచస్య విశ్వస్య ఉపరమః ఉపరమణం యస్మిన్ తం ప్రపంచోపరమమ్ = విశ్వముయొక్క ఉపరమిం చుటతో కూడికొనిన

శాంతమ్ :— శాంతం విరతవ్యాపారమ్, నిస్తరంగసముద్ర మివ స్థితమ్ ఏవిధమైనవ్యాపారము లేక నిస్తరంగసముద్రమువలె నున్న

శివమ్ :— మంగళస్వరూపుడైన, మంగళకరుడైన, శివుని (ఈపదమునకు మూడు అర్థములున్నవి)

అద్వైతమ్ :— ద్వే జీవజగతీ ఇతే లయంగతే యస్మిన్ సః ద్వీతః స్వార్థవృద్ధ్యా ద్వీత ఏవ ద్వైతః న విద్యతే ద్వైతః యస్మాత్ సః అద్వైతః = జీవజగత్తులను తనలో నిముడ్చుకొని యద్వి తీయతత్త్వమైన

చతుర్థమ్ :— నాల్గవ, మూడుతత్త్వములతరువాతిదైన

ఇప్పటివఱకును పదముల యర్థమును వివరించినాము. ఇక నీమైనింటిలో విశేష్యపద మేదియో గాంతము. ఇందు శివశబ్దముదక్క మిగిలినవానిలో విశేష్యము గాదగిన పదము లేదు. శివపదము విశే ష్యము గావచ్చును, విశేషణము గావచ్చును. విశేష్య మైనపుడు

శంభు రీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః

అను నమరకోశవాక్యమువలన శివశబ్దము శంభుని బోధించును. కావున మిగిలినవిశేషణము లన్నియును శంభుని యాయాలక్షణములను ప్రతిపా దించును. ఇక సమన్వయవిషయము గాంతము.

ముముక్షవః శివం మన్యంతే యని ప్రధానవాక్యము. ముముక్షు వులు శివుని తలంచుచున్నారని వాక్యార్థము. ఏ మని? ప్రపంచోపర మమ్ = విశ్వముయొక్క ఉపరమణమున కధిష్ఠానమైనవా డని, శాంతమ్=సంహారకాలముగాన తదంతమునందు నిస్తరంగసముద్రము వలె నున్నవాడని, అద్వైతమ్ = సంహారముకాలముగాన కూర్మా మంగములనువలె జీవజగత్తులను తనలో లీనముచేసికొనినవా డని, చతుర్థమ్ = నాల్గవవాడని, రుద్రమహేశ్వరసదాశివులకన్న పరుడని శివుని తలంచుచున్నా రని వాక్యముయొక్క వివరణార్థము.

ఈమంత్రమునందు మహాప్రళయకాలస్థితి వర్ణింపబడినది. ఈస్థితి శ్వేతాశ్వతరమునందును వర్ణింపబడినది.

యదా తమ స్తన్న దివా న రాత్రి
ర్న స న్న చాస చ్ఛివ ఏవ కేవలః
త దక్షరం త త్సవితు ర్వరేణియం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ

శ్వేతాశ్వతరమునందు మహాప్రళయకాలమున దివారాత్రివిభాగమును, సదసద్విభాగమును లే దనియును నాకాలమున శివు డొకడుమాత్రమే విరాజిల్లుచున్నా డనియును వర్ణింపబడినది. ఇక నీమాండూక్యమంత్రము నందో ప్రపంచముయొక్క ఉపరమణము జరిగిన దనియును, తత్కర్త యగు శివుడు జీవజగత్తులను తనలో లీనముచేసికొనినా డనియును, ఆతడు రుద్రమహేశ్వరసదాశివులకన్న పరు డనియును వర్ణింపబడినది.

ప్రకృతికి సృష్టిస్థితి యనియును, సంహారస్థితి యనియును రెండు స్థితు లున్నవి. సంహారస్థితి జగచ్ఛబ్దముచేతను, సృష్టిస్థితి ప్రపంచశబ్దము చేతను సూచింపబడుచున్నవి. భూతములకు వినియోగస్థితి సృష్టిస్థితి. తద్భిన్నస్థితి సంహారస్థితి. మృత్తునకు వినియోగస్థితి ఘటాదిరూపమున నేర్పడుచున్నది. మృత్తున కిదియే వినియోగస్థితి. మృత్తున కేవిధమైన వినియోగమును లేనిస్థితి మృత్ స్థితియే. వినియోగస్థితి ప్రపంచశబ్ద

ముచే సూచింపబడుచున్నది. ప్రపంచ మనగా విస్తరించుట యని యర్థము. మృత్తునకు ప్రపంచరూపము ఘటాదికము. మృత్తు ఘటాది రూపనిర్మాణము నందినగాని వినియోగస్థితి నందజాలదు. మృత్తునకు స్వస్థితియే సంహారస్థితి. ప్రపంచోపరమణ మనగా భూతములకు వినియోగస్థితి పోయి స్వస్థితి వచ్చుటద్వారా వినియోగాభావస్థితి యని యర్థము. ప్రపంచోపరమ మనగా భూతముల కాస్థితి కలిగించినవాడని యర్థము.

చతుర్థ మనగా నాల్గవవా డని యర్థము. అయిన మిగిలిన మూవు రెవరు? అను ప్రశ్న యుపస్థిత మగుచున్నది.

## చతుర్థ శబ్దార్థము

తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః
ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః, అగ్నే రాపః అద్భ్యః పృథివీ

పరమేశ్వరునినుండి యాకాశము, ఆకాశమునుండి వాయువును, వాయువునుండి యగ్నియును, అగ్నినుండి జలమును, జలమునుండి పృథివియును జనించినవని మంత్రార్థము. పరమేశ్వరుడు చేతనుడు. భూతములు జడములు. చేతనునుండి జడోత్పత్తి యసంభవముగదా యన్న విచారింతము. ఈమంత్రమునందలి యాకాశాదిశబ్దములు భూతాకాశాది పరములు గావు. ఈవిషయము

సదాశివః శబ్దమూర్తిః స్పర్శమూర్తి స్తథేశ్వరః
రుద్ర స్తేజోమయః సాక్షా ద్రసమూర్తి ర్జనార్దనః
గంధమూర్తి శ్చతుర్వక్త్ర ఇత్యేతాః పంచమూర్తయః

అను శివపురాణవాయవీయసంహితయందలి శ్లోకములచే ప్రతిపాదింపబడినది. ఆకాశ మనగా నాకాశభూతాధిపతియగు సదాశివుడనియును, వాయుశబ్దమునకు తదధిపతి మహేశ్వరు డనియును, అగ్నిశబ్దమునకు తదధిపతి రుద్రు డనియును, అప్ఛబ్దమునకు తదధిపతి నారాయణు డనియును, పృథివీశబ్దమునకు తదధిపతి బ్రహ్మ యనియును

పరము. శివునినుండి సదాశివుడును, సదాశివునినుండి మహేశ్వరుడును, మహేశ్వరునినుండి రుద్రుడును, రుద్రునుండి నారాయణుడును, నారాయణునినుండి బ్రహ్మయును జన్మించినారని మంత్రార్థము. కూటస్థుడు శివుడు. సదాశివమహేశ్వరరుద్రవిష్ణుబ్రహ్మలు వంశక్రమము. కావున చతుర్థ డనగా రుద్రమహేశ్వరసదాశివులకన్న పరు డని యర్థము.

ప్రపంచోపరమమను ముండకమంత్రము మహాప్రళయస్థితిని వర్ణించుచున్నది. కావున సదాశివప్రళయ మైనదని యర్థము. సదాశివాదులును జీవులే. కావుననే శ్వేతాశ్వతరమునందలి సన్నిషేధము సదాశివపరమని యంగీకరింపక తప్పదు. అసన్నిషేధముచే భూతములు వినియోగావస్థయందు లేవని సూచింపబడుచున్నది. ఈవిషయము మాండూక్యమంత్రమునందు స్పష్టముగా ప్రతిపాదింపబడినది.

## అద్వైతశబ్దార్థము

అద్వైతశబ్దార్థవిషయము గాంతము. అద్వైతశబ్దమునకు జీవజగత్తులను తనలో నిముడ్చుకొనిన తత్త్వ మర్థమని వివరించినాము. ప్రపంచోపరమశబ్దము భూతములకు మహాప్రళయకాలమున వినియోగావస్థ లేదని సూచించుననియును వివరించినాము. కాని యాస్థితియందున్న భూతము లెచట నున్నవి? ఈవిషయము నద్వైతశబ్దము వివరించుచున్నది. ద్విశబ్దమునకు రెం డని యర్థము. ఏరెండైనను గావచ్చును. అవి జీవజగత్తులని నిర్ణయించుట యెట్లు?

ఈవిషయమును ప్రపంచోపరమశబ్దము సూచించుచున్నది. ప్రపంచోపరమణ మనగా విస్తరణాభావము. విస్తరణ మనగా భూతములకు వినియోగావస్థ. వినియోగావస్థ వినియోక్త నపేక్షించును. వినియోక్త జీవుడు. జీవుడు వినియోక్త యగుటకు శరీరసంబంధము కావలయును. కావున విస్తరణాభావ మనగా జీవులకు శరీరసంబంధము లేనిస్థితి యని యర్థము. అనగా భూతములు స్వస్థితియందును, జీవులు శరీరరహితస్థితియందును నున్న స్థితియని భావము. కావున ద్వై అనగా జీవుడును, జగ

త్తును నని ప్రాకరణికార్థమని తేలుచున్నది. ద్వే = జీవజగత్తులు, యస్మిన్ =ఏతత్త్వమునందు, ఇతే = లయముపొందినవో ఆతత్త్వము ద్వీతశబ్దముచే ప్రతిపాదింపబడుచున్నది. స్వార్థవృద్ధిచే ద్వీతశబ్దమే ద్వైత మగుచున్నది.

ఇక నద్వైతశబ్దమునందలి నఞ్ ప్రయోజన మేమో గాంతము.

తత్సాదృశ్య మభావ శ్చ తద్భిన్నత్వం తదల్పతా
అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః ష ట్ప్రకీర్తితాః

సాదృశ్యము, అభావము, భిన్నత్వము, అల్పత్వము, అప్రాశస్త్యము, విరోధము అనునాఱర్థములు వ్యాకరణశాస్త్రమునందు ప్రతిపాదింపబడినవి. కానియీయర్థములం దేదియును ప్రకరణోపయోగి గాదు. కాని ధర్మశాస్త్రములందు సర్వోత్తమార్థమునందు నఞ్ ప్రయోగము గాన్పించుచున్నది. భస్మస్నాన మనుత్తమమ్ అనువాక్య మీయర్థమునం దుదాహరణముగా గాన్పించుచున్నది. న విద్యతే ఉత్తమం యస్మాత్ తత్ అనుత్తమమ్ అని యీయర్థమునందు విగ్రహము. న విద్యతే ద్వైతః యస్మాత్ సః అద్వైతః అని అద్వైతశబ్దవిగ్రహము. అనగా జీవజగత్తులను తనలో నిముడ్చుకొనిన తత్త్వ మిది యొకటియే యని పర్యవసించుచున్నది. 'ప్రపంచోపశమః శివోఽద్వైతః' అను మాండూక్యోపనిషత్తునందలి యనంతరవాక్యము అద్వైతశబ్దము పుంలింగ మని ప్రతిపాదించుచున్నది.

ఇప్పటివఱకును నద్వైతశబ్దార్థము వివరించినాము. ఇక శివాద్వైతశబ్దవిషయము గాంతము. అద్వైత శ్చాసౌ శివ శ్చ శివాద్వైతః అని విగ్రహము. ఇయ్యది మయూరవ్యంసకాదులవలె విశేష్యపూర్వపద కర్మధారయసమాసము. శివాద్వైతశబ్దమునకు జీవజగత్తులను తనలో నిముడ్చుకొనిన శివు డని యర్థము. అట్టిశివునకు సంబంధించిన సంప్రదాయము శివాద్వైతసంప్రదాయము. ఇయ్యది శైవసంప్రదాయము. కేనోపనిషత్తు శివాద్వైతసంప్రదాయమునకు సంబంధించినది.

ఓమ్

# కేనోపనిషత్తు

## శాంతిమంత్రము

ఓమ్ సహ నా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై
తేజస్వినా వధీత మస్తు, మా విద్విషావహై
ఓం శాంతిః శాంతిః శాంతిః

అర్థము :- నౌ = మమ్మును, సహ = కూడ, అవతు = రక్షించుగాత ! నౌ = మమ్మును, సహ = కూడ, భునక్తు = పాలించునుగాత ! సహ = కూడ, వీర్యమ్ = విద్యావిషయకోత్సాహమును, కరవావహై = చేయుదుముగాత ! నౌ = మాయొక్క, అధీతమ్ = అధ్యయనము, తేజస్వి = ప్రభావవిశిష్టమైనది, అస్తు = అగుగాత ! మా విద్విషావహై = పరస్పరము ద్వేషింపకుందుముగాత !

తాత్పర్యము :- పరమేశ్వరుడు మమ్మునిద్దరను రక్షించునుగాత! మమ్ము నిద్దరను పాలించునుగాత ! ఇద్దరమును కలిసి విద్యావిషయకోత్సాహమును చేయుదుముగాత ! మేము గావించిన యధ్యయనము ప్రభావవిశిష్ట మగుగాత ! మేము పరస్పరము ద్వేషింపకుందుముగాత !

అంతరింద్రియజయము గలుగుగాత !

## వివరణము

ప్రతిఉపనిషత్తునందును గ్రంథారంభమునకు ముందు శాంతి మంత్రము పఠించుట సంప్రదాయము. శిష్టసంప్రదాయావిచ్ఛేదముకొఱ కీయుపనిషదారంభమునను శాంతిపఠనము గావింపబడుచున్నది. కావ్యా రంభమునందు మంగళాచరణమువలె నుపనిషదారంభమునందు శాంతి మంత్రము ప్రధానస్థాన మాక్రమించుచున్నది.

ఈశాంతిమంత్రమునందు గురుశిష్యు లిద్దరును పరమేశ్వరుని ప్రార్థించుట ప్రతిపాదింపబడినది. తద్ద్వారా పరమేశ్వరానుగ్రహము పొంది వారియధ్యయనము వీర్యవత్తర మగుటయు నాకాంక్షింపబడినది. ఇంతియే గాదు, పరస్పరద్వేషాభావముకూడ ప్రార్థింపబడినది.

సహ నా వవతు — మమ్మునిద్దరను కూడ రక్షించునుగాక మని వాక్యార్థము.

నౌ సహ — మమ్ము నిద్దఱను కూడనని యర్థము. అయిన నీయిద్ద రెవరు ?

ఉపనిషత్తులు ముముక్షువుల నుద్దేశించి పరమేశ్వరునిచే ననుగ్రహింపబడినవిగాన నిం దొకడు ముముక్షువు. ఈశాంతిమంత్రమునం దధ్యయనము ప్రస్తావింపబడినదిగాన ముముక్షువే యధ్యేత. అధ్యయనము రెండువిధములుగా గావింపవచ్చును. స్వయముగా లిఖిత గ్రంథములు చూచి చదువుకొనుట యొకవిధము. గురుముఖతః అధ్యయనము చేయుట రెండవది. శిక్షయందు లిఖితపాఠకుడు పాఠకాధము లలో పరిగణింపబడుటచేతను, ఉదాత్తాదిస్వరములు గురుముఖతః శ్రవణపూర్వకముగా నధ్యయనము గావించిననే యులవడుట కవకాశ ముండుటచేతను, సాంప్రదాయికవిశేషములు గురుద్వారానే తెలిసి కొనవలసిన వగుటచేతను నధ్యయనమున నధ్యాపయితావశ్యకత యున్నది. కావున నిద్దరిలో రెండవవాడు గురువు. కావున నౌ అనగా మమ్మునిద్దర నని అనగా గురుశిష్యుల నిద్దరను నని యర్థము.

సహ అను నవ్యయమునకు కూడ నని యర్థము. నౌ సహ అనగా మమ్ము నిద్దరను కూడనని యర్థము. సహాసంబంధము లేక నౌ మమ్ము నిద్దర ననిన గురుశిష్యులను వ్యస్తముగా రక్షించినను రక్షించుట కవకాశ మున్నది. సహ యనుటచే నావిధముగ వ్యస్తముగ గాక సమష్టిగ నేకప్రయత్నమున నేకకాలమున రక్షించుట సూచింప బడుచున్నది.

అవతు — రక్షించుగాక మని యర్థము. కాని యీవాక్యము నందు కర్తృపదము లేదు. అయిన నవనకర్త యెవరు ?

రక్షణము దేనినుండి? అధ్యాపయితృధ్యేత లేదియే నొకపరము ప్రయోజనము నాకాంక్షించి యధ్యయనము గావించుచు రక్షణము గోరుచున్నారు. ఈమంత్రమునందలి అధీతమ్ అనుపదముచే వారి ప్రయత్న మధ్యయనమని సూచింపబడుచున్నది. అధ్యయనసంపూర్తికి రక్షణ మవసరమే. అధ్యయనము కేవలాధ్యయనమాత్రపర్యవసాయిగా నుద్దేశింపబడలేదు. అధ్యయనప్రయోజనము ముముక్షువునకు విషయ పరిజ్ఞానము గలుగుట. ముముక్షు వనగా మోక్తు మిచ్ఛుః=విడివడుటకు గోరినవాడు. దేనినుండి? మృత్యువునుండి యని

త్రియంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్

త్రియంబకమంత్రము బోధించుచున్నది. మఱియును

ఆ వో రాజాన మధ్వరస్య రుద్రగ్ం
హోతారగ్ం సత్యయజగ్ం రోదస్యోః
అగ్నిం పురా తనయిత్నో రచిత్తా
ద్ధిరణ్యరూప మవసే కృణుధ్వమ్

ఈమంత్రము మృత్యువునుండి రక్షణముకొఱకు రుద్రు నారాధించుడని బోధించుచున్నది. కావున శాంతిమంత్రమునందలి అవతు=రక్షించు గాత మనుపదమునకు మృత్యువునుండి రక్షించుగాత మని యర్థము. మఱియును విషయపరిజ్ఞానము గలిగించునది యధ్యయనముగాన దానికి గలుగబోవు విఘ్నములనుండి రక్షించుగాత మని యర్థము. పైమంత్ర ములయందు రుద్రారాధనము విధింపబడుటచే అవతు అనుక్రియాపద మునకు కర్త రుద్రుడని తేలుచున్నది. ఇంతియే గాదు. ప్రకృతమున నధ్యేత ముముక్షువైనను అధ్యాపయితయగు గురువును ముముక్షు వయియే యధ్యయనము గావించి యధ్యాపయిత యగుటచే నాతనికిని రక్షణ మావశ్యకముగాననే మంత్రమునందలి నౌ సహ అనుపదము

లన్వార్థము లగుచున్నవి. ఉపాసనామార్గమున గురువు కొంతదూర మేగినాడు. శిష్యు డిప్పుడే పదప్రవేశము చేయనున్నాడు. ఇంతియే తేడా. కాని అధ్యయనమున నిర్ధరిసంకల్పములును నేకోద్దేశములే.

నౌ అధీతం తేజస్వి అస్తు — మాయధ్యయనము ప్రభావవిశిష్ట మగుగాత మని వాక్యార్థము.

శిష్యు డధ్యయనము చేయుచున్నాడు, గురువు శిష్యునిచే నధ్యయనము చేయించుచున్నాడు. ఈయధ్యయనము తేజస్వి గావలయునని వారిప్రార్థన. తేజస్వి యనగా ప్రభావవిశిష్టమైనది. అధ్యయనప్రభావమువలన వారి కభిమతార్థసిద్ధి గావలయును. అధ్యయనపరమప్రయోజనము మృత్యుమోక్షము. అధ్యయనము సక్రమముగా నెరవేరుచు తత్పరమప్రయోజనమైన మృత్యుమోక్షమునకు చక్కని యవకాశ మేర్పడవలయును. అప్పటికిగాని వారి కభిమతార్థసిద్ధి గాదు. అభిమతార్థసిద్ధిహేతువగుటయే యధ్యయనముయొక్క ప్రభావవైశిష్ట్యము.

మా విద్విషావహై — పరస్పరము ద్వేషించుకొనకుందుముగాత మని వాక్యార్థము.

ద్వేషము అనగా శత్రుత్వము — పగ. శత్రుత్వమున కనేక కారణము లుండవచ్చును. తనకన్న నధికులగువారివిషయమున శత్రుత్వము వహించి వారి నాస్థితినుండి తొలగించి తా మాస్థానము నాశ్రమించుటకై ప్రయత్నించుట లోకమున ననుభవములో నున్నది. ఒక్కొక్కప్పుడు సములవిషయమునను పగబూనుట కలదు. దీని ఫలితము మనఃశాంతిని గోల్పోవుట. మనఃశాంతిని గోల్పోయిన వ్యక్తి యకార్యములకు పాల్పడును. తత్ఫలిత మధోగతియే.

ద్వేషమునకు మూల మసూయ — పరశ్రేయస్సహనము లేకపోవుట. ఇతరులు తమకన్న నధికస్థితిలో నున్నారని యసూయపడుట

కంటె తా మాస్థితియందు లేకపోవుటకు కారణములు పరికించి యేవైన నభ్యంతరము లున్న వానిని తొలగించికొనుచు నాస్థితికి వచ్చుటకై ప్రయత్నించుట సజ్జనలక్షణము.

ప్రకృతప్రకరణమున గురుశిష్యులలో గురువు విద్యాధికుడు. మఱియును సర్వవికారములను నశింపజేసికొని పరమేశ్వరారాధనము గావించుచు నపునరావృత్తముగ హార్దబ్రహ్మయందు సాయుజ్యము నందగోరుచున్నవాడు. మఱి శిష్యుడో ఆస్థితికి రావలసినవాడు. కాని యిప్పుడిప్పుడే యుపాసనామార్గమున నడుగిడుచున్నవాడు. ఇప్పటివఱకును నైహికజీవనమున, సర్వవికారాస్పదమైన జీవనమున తన్మయుడై కాలక్షేపము చేసినవాడు. మఱియును

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్

కర్మలంపటతను వీడి నిర్విణ్ణుడు, విరాగియైనాడు, కాని పూర్వవాసనా బలమున నెప్పుడైనను నాతడు అసూయాద్వేషాదులకు గురి కావచ్చును. కావుననే మా విద్విషావహై = పరస్పరము ద్వేషించుకొనకుందుము గాత మని ప్రార్థనము గావింపబడినది.

మా విద్విషావహై అను ద్వివచనము గురుశిష్యుల నుద్దేశించి ప్రయోగింపబడినదైనను ప్రధానముగా శిష్యుడే యుద్దేశింపబడినాడు. గురు వుపాసనామార్గమున చాలవఱకు పయనించినవాడుగాన నాతనిని వికారము లేమియును చేయజాలవు. శిష్యునివిషయమున వికారమున కవకాశ మున్నదని యెంచియే యీప్రార్థనము గావింపబడినది.

## శాంతిపాఠద్వితీయమంత్రము

ఓమ్ ఆప్యాయంతు మ మాంగాని వా క్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథో బల మింద్రియాణి చ సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోత్ అనిరాకరణ

మ స్త్వనిరాకరణం మేఽస్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు
ధర్మా స్తే మయి సంతు తే మయి సంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

అర్థము :- మమ = నాయొక్క, అంగాని = కరచరణాద్యవయవములును, వాక్ = వాగింద్రియమును, ప్రాణః = ప్రాణవాయువును, చక్షుః = చక్షురింద్రియమును, శ్రోత్రమ్ = శ్రోత్రేంద్రియమును అను మొదలైన, సర్వాణి = సమస్తములైన ఇంద్రియాణి చ = ఇంద్రియములును, అథో = పిమ్మట, బలమ్ = ఓజస్సును, ఆప్యాయంతు = తృప్తములై స్వకార్యనిర్వహణసమర్థము లగుగాత! సర్వమ్ = సమస్తమును, ఔపనిషదమ్ = ఉపనిషత్ప్రతిపాదితమగు, బ్రహ్మ = పరమేశ్వరుడే. అహమ్ = నేను, బ్రహ్మ = పరమేశ్వరుని, మా నిరాకుర్యామ్ = అనాదరము చేయకుందును గాత! అనిరాకరణమ్ = అనాదరము చేయకుండుట, అస్తు = అగుగాత! మే = నాకు అనగా నావిషయమై, అనిరాకరణమ్ = అనాదరము చేయకుండుట, అస్తు = అగుగాత! తదాత్మని = ఆపరమేశ్వరునియందు, నిరతే = ఆసక్తుడనైన, మయి = నాయందు, ఉపనిషత్సు = ఉపనిషత్తులయందు, యే = ఏ, ధర్మాః = ధర్మములు ప్రతిపాదింపబడినవో, తే = ఆధర్మములు, సంతు = సుస్థితములై యుండుగాత! తే = ఆధర్మములు, మయి = నాయందు, సంతు = సుస్థితములై యుండుగాత!

తాత్పర్యము :- నాకరచరణాద్యవయవములును, వాగాదికర్మేంద్రియములును, చక్షురాదిజ్ఞానేంద్రియములును, ప్రాణవాయువును, ఓజస్సును తృప్తములై స్వకార్యనిర్వహణసమర్థము లగుగాత! ఈపరిదృశ్యమానము సమస్తమును పరమేశ్వరుడే. పరమేశ్వరుని నేను నిరాకరించకుందునుగాత! పరమేశ్వరుడు నన్ను నిరాకరించకుండునుగాత! నావిషయమున నిరాకరణమునకు సంబంధము లేకపోవుగాత! పరమేశ్వరారాధకుడనైన నాయం దుపనిషత్తులయందు ప్రతిపాదింపబడిన ధర్మములు స్థిరముగా నుండునుగాత! స్థిరముగా నుండునుగాత!

అంతరింద్రియజయము గలుగుగాత!

## వివరణము

పూర్వమంత్రమునందు గురుశిష్యులు పరమేశ్వరుని ప్రార్థించుట ప్రతిపాదింపబడినది. ఈమంత్రమునందు కార్యనిర్వాహణసామర్థ్యమును, ధర్మాసక్తియు ప్రతిపాదింపబడుచున్నవి.

ఆప్యాయంతు మ మాంఽగాని . . . ఇంద్రియాణి చ సర్వాణి :— నాశరచరణాద్యవయవములును, వాగాదికర్మేంద్రియములును, చక్షు రాద్యజ్ఞానేంద్రియములును, ప్రాణవాయువును, ఓజస్సును తృప్తములై స్వకార్యనిర్వాహణసమర్థము లగుగాత మని యర్థము.

జన్మకు సార్థక్యము గలిగించు దేవయానమార్గమున పయనించుచున్నాడు గురువు. పయనింపనున్నాడు శిష్యుడు. ఈపయనమునకు కావలసిన పూర్వరంగ మీవాక్యమున వర్ణింపబడినది. లోకమున నేపని నిర్వహింపవలసినను దానికి గావలసిన సామర్థ్య ముండవలయును. శరీరము సమర్థముగా నున్నగాని యేపనియును నెరవేరదు. కావుననే కార్య నిర్వాహణసామర్థ్యము ప్రార్థింపబడుచున్నది.

కార్యనిర్వాహణమునకు కర్మజ్ఞానేంద్రియములు పటిష్ఠములై యుండవలయును. సర్వమునకును — యావత్ శరీరసుస్థికిన్ని — ప్రాణవాయువు మూలాధారము. ప్రాణవాయువు యథావిధిగ స్వకార్య నిర్వాహణము గావించుచున్న జీర్ణాదిక్రియలు సక్రమముగా నిర్వహింపబడుచు శరీరము పటిష్ఠమై యుండును. రసరక్తాదిధాతువులు స్వస్థితిలో నున్న శరీరమున నోజస్సు అనునది యేర్పడును. దీనికే బల మని పేరు. ఓజస్సనగా శుక్రము సమృద్ధిగా నున్నపుడుగలుగు సామర్థ్యము. కావుననే మంత్రమునందు అంగేంద్రియసామర్థ్యమును ప్రార్థించుటతో పాటు ప్రాణౌజఃప్రార్థనమును గావింపబడినది.

సర్వం బ్రహ్మౌపనిషదమ్ :— పరిదృశ్యమానమగు సమస్తమును నుపనిషత్ప్రతిపాదితమగు బ్రహ్మపదార్థమే యని వాక్యార్థము.

ఇప్పటివఱకును శిష్యుని కనుభవములో నున్నది విశ్వమే. సర్వమ్=ఈవిశ్వమంతయును బ్రహ్మమే. అహమ్=నేను అను పదము నకు జీవుడును, శరీరమును నర్థమైనట్లు శివజగత్తులసమిష్టికే బ్రహ్మ మను వ్యవహారము. ఈవిషయము

శక్తిః శివ శ్చ సచ్ఛబ్దప్రకృతిప్రత్యయోదితౌ
తౌ బ్రహ్మ సామరస్యేన సమస్తజగదాత్మకౌ

అను శివపురాణవాయవీయసంహితావచనముచే వివరింపబడినది. కావున నే మంత్రమునందు సర్వమును బ్రహ్మమని నిర్వచింపబడినది.

శక్త్యాది చ పృథివ్యంతం జగ దేత చ్చరాచరమ్
విగ్రహం దేవదేవస్య పరమేశస్య శూలినః

జీవునకు శరీర మధిష్ఠాన మైనట్లు చరాచరాత్మక మైన జగత్తు పరమేశ్వరునిశరీరము. కావున నే పరమేశ్వరు ననుగ్రహింపజేసికొనవలయు నన్న తచ్ఛరీరమగు జగత్తు నారాధింపవలయును. శరీరమునకు గావింపబడిన స్రక్చందనాద్యలంకారములవలన జీవుడు సుఖించునట్లు జగదారాధనమువలన పరమేశ్వరుడు సంతుష్టుడై యనుగ్రహించును. విశ్వారాధన మనగా విశ్వాంతఃపాతిప్రాణ్యారాధనము. ఈవిషయము

వృక్షస్య మూలసేకేన శాఖాః పుష్యంతి వై యథా
భక్తస్య జిహ్వయా తద్వ త్ప్రసీదతి మహేశ్వరః

అను పౌరాణికవచనముచే వివరింపబడినది.

మాఽహం బ్రహ్మ నిరాకుర్యామ్ :— నేను బ్రహ్మ ననాదరింపకుందునుగాత మని యర్థము.

ఐహికజీవనమున జగత్తు ప్రధానస్థాన మాక్రమించుచున్నది. శరీరపోషణమునకు భౌతికపదార్థము లావశ్యకములు. కావున నిప్పటివఱకును తత్సమృద్ధికై వెంపరలాడినాడు. తనపోషణము వచ్చునప్పటికి సర్వమును ననాదరించి పోషణమున కావశ్యకములైన పదార్థముల సంపాదనమునకై యత్నించుట లోకానుభవమున నున్నవిషయమే. కావున స్వపోషణమున జగత్తునం దాదర మత్యుత్కటమని తేలుచున్నది.

ముముక్షు వగుటచే మృత్యుమోక్షమును కోరినవాడుగావునను, కేవలైహికభోగలంపటతవలననే సంసరణబంధమున తగుల్కొనుట

చేతను, నిది యంతయును జగదాదరమువలన సంభవించుచున్నదని తేలుటచేతను నం దాసక్తి తగ్గుచు పరమేశ్వరానుగ్రహము లేనిది మృత్యుమోక్షము సంభవింపదుగాన పరమేశ్వరునియం దాదర మనగా భక్తి హెచ్చుచున్నది. కావున నియ్యది స్థిరముగా నుండవలయునను నుద్దేశముతో మాఽహం బ్రహ్మ నిరాకుర్యామ్ అను నిశ్చయమునకు వచ్చినాడు.

మా మా బ్రహ్మ నిరాకరోత్ :— నన్ను బ్రహ్మ నిరాకరింప కుండునుగాత మని యర్థము.

యదా చర్మవ దాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా శివ మవిజ్ఞాయ దుఃఖ స్యాంతో భవిష్యతి

శివు నారాధింపక దుఃఖాంతము లేదని శ్వేతాశ్వతరము ప్రతిపాదించుచున్నది.

జుష్ట స్తత స్తే నామృతత్వ మేతి

తతః = ఆ కారణమువలన, తేన = పరమేశ్వరునిచేత, జుష్టః = అనుగ్రహింపబడినవాడై, అమృతత్వమ్ = మరణరాహిత్యమును, ఏతి = పొందుచున్నాడను నిశ్చయమునకు వచ్చి

తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే

ఆత్మబుద్ధిప్రకాశకుడగు నాపరమేశ్వరుని శరణుపొందిన నన్ను మా మా బ్రహ్మ నిరాకరోత్ = పరమేశ్వరుడు నిరాకరింపకుండునుగాత మని ప్రార్థించుచున్నాడు.

అనిరాకరణ మ స్త్వనిరాకరణం మేఽస్తు — నేను బ్రహ్మను నిరాకరింపకుందునుగాత! నన్ను బ్రహ్మ నిరాకరింపకుండునుగాత! మని యర్థము.

విషయమునందలి యాదరాతిశయమును సూచించుటకై పూర్వ ప్రతిపాదితార్థము మఱల ననువదింపబడినది. ఇయ్యది యాదరాతిశయ మును సూచించుటయందలి పీప్స.

తదాత్మని నిరతే ... తే మయి సంతు — పరమేశ్వరునియం దాసక్తిగల నాయం దుపనిషత్ప్రతిపాదితములైన ధర్మములు స్థిరత నందుగాత మని యర్థము.

'క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః
స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయంతః'
'ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'
'తస్మిన్ య దంత స్త దుపాసితవ్యమ్'

సంధ్యావందనాదివిహితకర్మలును, రుద్రహోమాదులును, శ్రవణ మనననిదిధ్యాసములును, హార్దబ్రహ్మోపాసనమును మొదలైనవి ఉపని షత్ప్రతిపాదితములైన ధర్మములు. సాయుజ్యము నాకాంక్షించిన నాయం దీధర్మములు సుస్థిరములై యుండునుగాత మని ప్రార్థనము. అనగా ధర్మములను యథావిధిగ ననుష్ఠించుచు జీవితపరమప్రయోజన మగు సాయుజ్యము నందుటకు దగిన మహావకాశము గలుగుగాత మని పరమార్థము.

ఓమ్

# కేనోపనిషత్తు

## ప్రథమఖండము - ప్రథమమంత్రము

కే నేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
కే నేషితాం వాచ మిమాం వదంతి
చక్షుఃశ్రోత్రం క ఉ దేవో యునక్తి

అర్థము :- కేన = ఏదేవునిచేత, ఈరితమ్ = ప్రేరింపబడినదై, మనః = మనస్సు, ప్రేషితమ్ = అభిలషితవిషయమునుగూర్చి, పతతి = ప్రసరించుచున్నదో, కేన = ఏదేవునిచే, యుక్తః = కూడుకొనినదై, ప్రాణః = ప్రాణవాయువు, ప్రథమః = మొదటిదై, ప్రైతి = చలించుచున్నదో, కేన = ఏదేవునిచేత, ఈషితామ్ = ప్రేరింపబడిన, ఇమామ్ = ఈ, వాచమ్ = వాక్కును, వదంతి = పలుకుచున్నారో, క ఉ దేవః = ఏదేవుడు, చక్షుఃశ్రోత్రమ్ = నేత్రశ్రవణేంద్రియములను, యునక్తి = ప్రేరించుచున్నాడో,

## ద్వితీయమంత్రము

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో య
ద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చ్చక్షుష శ్చక్షు. రతిముచ్య ధీరాః
ప్రే త్యాస్మా ల్లోకా దమృతా భవంతి

అర్థము :- యత్ = ఏతత్త్వము, శ్రోత్రస్య = శ్రవణేంద్రియమునకు, శ్రోత్రమ్ = శ్రోత్రేంద్రియమైయున్నదో, మనసః = మనస్సునకు, మనః = మనస్సై యున్నదో, వాచో హ = వాగింద్రియమునకు, వాచమ్ = వాగింద్రియమై యున్నదో, సః ఉ = ఆతత్త్వము (పరమేశ్వరుడు), ప్రాణస్య = ప్రాణవాయువునకు, ప్రాణః = ప్రాణవాయువుగా నున్నది, చక్షుషః నేత్రేంద్రియమునకు, చక్షుః = నేత్రేంద్రియముగా నున్నది. ధీరాః = ధీరులు, అతిముచ్య = మనఆదులను విడిచి, అస్మాత్ = ఈ, లోకాత్ = లోకమునుండి, ప్రేత్య = ప్రకృష్టదశను పొంది, అమృతాః = మరణరహితులు, భవంతి = అగుచున్నారు.

తాత్పర్యము :- ఏదేవునిచే ప్రేరింపబడినదై మన స్సఖిలషితవిషయమునుగూర్చి ప్రసరించుచున్నదో, ఏదేవునితో కూడుకొనినదై ప్రాణవాయువు మొదటిదై చలించుచున్నదో, ఏదేవునిచేత ప్రేరింపబడినవాక్కును పలుకుచున్నాడో, ఏదేవుడు నేత్రశ్రోత్రేంద్రియములను ప్రేరించుచున్నాడో,

ఏదేవుడు శ్రోత్రమునకు శ్రోత్రమును, మనస్సుకు మనస్సును, వాక్కునకు వాక్కునై యున్నాడో ఆదేవుడే ప్రాణవాయువునకు ప్రాణవాయువుగాను, నేత్రమునకు నేత్రముగాను నున్నాడు. ధీరులీలోకమును విడిచి ప్రకృష్టదశను పొంది అమృతు లగుచున్నారు.

## ప్రథమమంత్రవివరణము

కేనోపనిషత్తు శిష్యప్రశ్నతో నారంభింపబడినది. జీవితమున మానవుడు స్వతంత్రుడై కర్మలయందు ప్రవర్తించుచున్నాడా ? లేక కర్మానుష్ఠానమున నన్యప్రేరణావశ్యకత యున్నదా? అయిన నాయన్యు లెవరు? ప్రయత్నవైఫల్యము జీవులకు స్వాతంత్ర్యము లేదని సూచించుచున్నది. ఏవ్యక్తియును ప్రయత్నవైఫల్యము నాకాంక్షింపడుగదా? అవశముగ, తనయిచ్ఛకు వ్యతిరేకముగ గలుగు వైఫల్యమునకు కారకు లెవరు? ఈపరిస్థితి తనకుమాత్రమే గాదు, తనకు పరిచయ మున్నంత వఱకును సర్వత్ర గోచరించుచునేయున్నది. ఈవిశ్వమంతయును నెవని యాజ్ఞకు లోబడి ప్రవర్తించుచున్నది? ఇప్పటివఱకును తనకున్న యనుభవమును పురస్కరించికొని పర్యాలోచించినను నేసమాధానమును గన్పించకపోవుటచే ముముక్షువు గురువును సమీపించి ప్రశ్నించుచున్నాడు :

కే నేషితం పతతి ప్రేషితం మనః — ఏదేవునిచేత ప్రేరింపబడినదై మనస్సు అభిలషితవిషయమునుగూర్చి ప్రసరించుచున్నది ? అని వాక్యార్థము.

'అన్నమయం హి సోమ్య! మనః' అనుశ్రుతివలన మనస్సు భౌమమని తెలుచున్నది. జడములకు కర్తృత్వము లేదనుట సర్వసమ్మత

సిద్ధాంతము. కావున మనస్సు ప్రిసరించుచున్నదనుట అనుభవమునకు విరుద్ధము. మనస్సు ఇతర ప్రేరణ మున్నగాని ప్రసరించుట కవకాశము లేదు. అయిన నాప్రేరకు డెవరు? శరీరాధిష్ఠానమం దుండి సుఖదుఃఖ ముల ననుభవించు జీవుడు తత్ప్రేరకు డగునా? ఇష్ట మున్నను జీవు డేయవయవమును కదలింపజాలనిస్థితి యనుభవమున నున్నది. కావున జీవుడు మనఃప్రేరకు డనుట యసంగతము.

కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః — ఎవనితో కూడుకొని నడై ప్రాణవాయువు చలించుచున్నదని వాక్యార్థము.

ప్రాణ మనగా ప్రాణవాయువు. ప్రాణవాయువు మహావాయువు యొక్క భాగము. వాయువు జడపదార్థము. తత్త్వములలో జీవేశ్వరులుదప్ప మిగిలినవన్నియును జడపదార్థములే. పృథివ్యప్తేజోవాయువులు జడములే. కావున ప్రాణవాయువు చలించుచున్న దనుట యసంగతము. అయిన వాగతిగంధనయోః అను ధాతువువలన నిష్పన్నమైన వాయుశబ్దమునకు వీచుచున్నదని యర్థము. సదా గతి ర్యస్య సదాగతిః = ఎల్లప్పుడును గమనముగలది. ఆశు గచ్ఛతీ త్యాశుగః = శీఘ్రముగా పోవునది. వాయువు జడమన్న వాయుసదాగత్యాశుగాది శబ్దము లనుపపన్నము లగునుగదా యన్న విచారెంతము.

సదాగతి యను శబ్దమున కెల్లప్పుడును గమనము = చలనము గలదియని యర్థము. కాని వాయు వెల్లప్పుడును చలించుచున్నదా? ఒకప్పుడు స్తబ్ధముగా నున్నది. ఒకప్పుడు మందముగా వీచుచున్నది. ఒకప్పుడు తీవ్రముగా, తీవ్రతరముగా, తీవ్రతమముగా వీచుచున్నది. సదాగతిశబ్దమున కీమూడుస్థితులును నర్థ మనుటకు వీలులేదు. వాయువు చలనవిశిష్ట మనుట యనుభవమునకును విరుద్ధమే. వాయువునకు చలనములేనిస్థితియందు, అమితముగ చెమట పోయుచున్నపుడు విసనకఱ్ఱతో గాలిని కదల్చి యాబాధనుండి తప్పుకొనుచున్నాము. కావున

వాయువునకు చలనగుణము సహజము గా దనియును, నారోపిత మని యును తేలుచున్నది.

ఎండకాలమున సూర్యుడు భూమధ్యరేఖకు దగ్గఱగా నున్నపుడు భూమ్యుపరితలము సూర్యకిరణసంపర్కముచే బాగుగా వేడియెక్కి నపుడు తదుపరితలముననున్న వాయువునం దుష్ణ మధిక మగుటచే నది పైకి పోవుటయు, నాస్థానమునకు సాంద్రత యెక్కువగానున్న సముద్ర పవనము వీచుటయు ననుభవమున నున్నవిషయమే. ఈయుదాహర ణమువలనను వాయువునకు చలన మారోపిత మనియే తేలుచున్నది.

ప్రాణులు మేలుకొనియున్నపుడువలెనే నిద్రయందును శ్వాస క్రియ జరుగుచునేయున్నది. ఇయ్యది యప్రయత్నముగనే జరుగు చున్నది శ్వాసక్రియయందు ప్రాణులప్రయత్న మేమియును లేదని శారీరశాస్త్రజ్ఞులును వచించుచున్నారు. కావున వాయువునకు చలన గుణము సహజమని తేలుటలేదా యన్న విచారింతము.

యోగశాస్త్రమున ప్రాణాయామమను నొకప్రక్రియ యున్నది. ఇందు వాయువునకు రేచకపూరకకుంభకములను మూడుస్థితు లున్నవి. ఊపిరితిత్తులలోనికి వాయువును నింపుట పూరకము. నింపబడినవాయు వును కొంతకాలము విడువకుండ నుంచుట కుంభకము. తరువాత వాయువును వెలువరించుట రేచకము. ఈమూడింటియందును జీవుని ప్రయత్నము స్పష్టముగనే గోచరించుచున్నది. కావున వాయువునకు చలనగుణ మారోపిత మనియే తేలుచున్నది.

ఇక శ్వాసక్రియవిషయము గాంతము. కండరములలో నిచ్ఛా కండరము లనియును, ననిచ్ఛాకండరము లనియును రెండురకముల కండరము లున్నవి. శ్వాసక్రియ అనిచ్ఛాకండరములకు సంబంధించినది. అనిచ్ఛాకండరములు ప్రాణులప్రయత్నము లేకయే సంకోచించుచు వ్యాకోచించుచుండును. అందువలన శ్వాసక్రియ యాగకుండ జరుగు

చుండును. ఇందువలనను వాయువుయొక్క చలన మారోపితమనియే తేలుచున్నది.

అయిన వాయువు జడ మనుపక్షమున శ్వాసక్రియ యెట్లు జరగుచున్నది? దీనిని జరపువా రెవరు? అనునది మంత్రమునందలి ప్రశ్న కర్థము.

కే నేషితాం వాచ మిమాం వదంతి — ఎవనిచేత ప్రేరింపబడిన వాక్కును పలుకుచున్నా రని వాక్యార్థము.

నాభియొద్దనున్న వాయువునకు సమానవాయు వని పేరు. ఈవాయువు కదలింపబడినదై హృదయముద్వారా కంఠప్రదేశమును చేరి యటనున్న వాగింద్రియమును కదల్చుటచే నావాగింద్రియము తాల్వాదిస్థానము లయందు చేరి భిన్నభిన్నములైన వర్ణములను కల్పించుచున్నది. అవియే అకారాదివర్ణములు. భిన్నభిన్న వర్ణములు కలియుటచే పదములును, పదములు కలియుటచే వాక్యములును నేర్పడుచున్నవి.

అయిన నెవరిప్రేరణచే నీవాక్యము లుచ్చరింపబడుచున్నవి?

చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి :— నేత్రశ్రోత్రేంద్రియముల నెవరు ప్రేరించుచున్నా రని వాక్యార్థము.

మనకు గన్పడు కన్నుకన్న, చెవికన్న నేత్రశ్రోత్రేంద్రియములు భిన్నము[illegible]గా నున్నవి. నేత్రశ్రోత్రేంద్రియములు దర్శనశ్రవణముల యందు [illegible]గపడుచున్నవి.

ఆ[illegible] [illegible]నసా, మన ఇంద్రియేణ, ఇంద్రియ మర్థే[illegible], తతః ప్రత్యక్షమ్

జీ[illegible] సంకల్పము గలిగి మనస్సును ప్రేరింప మనస్సు ఇంద్రియముల[illegible] [illegible]ప్రేరింప నాయింద్రియములు బహిఃప్రపంచమునకు సంబంధించిన [illegible]షయములను గ్రహించును. ఈవిధముగా జీవునకు బహిఃప్రపంచ[illegible]న[illegible] సంబంధించిన జ్ఞానము కలుగుచున్నది. ప్రతివిషయము

నందును జీవుడు సంకల్పపూర్వకముగ బహిఃప్రపంచమునకు సంబంధించిన జ్ఞానము కలిగించుకొనుచున్నాడు. చక్షుఃశ్రోత్రములవిషయము నను యింతియే.

అయిన చక్షుఃశ్రోత్రము లెవని ప్రేరణచే కార్యోన్ముఖము లగుచున్నవి ?

ఈ యంత్రమునందు మనఃప్రాణవాక్చక్షుఃశ్రోత్రము లెవని ప్రేరణచే స్వకృత్యములు నిర్వహించుచున్న వనునది ప్రధానప్రశ్న. ప్రశ్నార్థ మేమో గాంతము.

## జీవుడు - కర్తృత్వభోక్తృత్వములు

మనఆదులన్నియును శరీరమునకు సంబంధించినవి. శరీరము జీవున కధిష్ఠానము. శరీరము నధిష్ఠించియే జీవుడు తద్ద్వారా సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. సుఖదుఃఖము లనగా నేమి ? తదనుభవము జీవున కెట్లు గలుగుచున్నది ? ఇంతియే గాదు, ఈయనుభవము శరీరమునకు సంబంధించినదా ? లేక జీవునకు సంబంధించినదా ?

ఒకసంప్రదాయమువారు సుఖదుఃఖములు శరీరమునకు గాని యాత్మకు లేవని సిద్ధాంతీకరించుచున్నారు. ఇయ్యది యెంతవఱకు విమర్శనహమో, ప్రామాణికమో గాంతము.

మరణమునకు పూర్వమునను, పరమునను శరీర మున్నది. పూర్వమిష్టవస్తుసంబంధమున సంతోషచిహ్నములును, అనిష్టవస్తుసంబంధమున దుఃఖచిహ్నములును ప్రస్ఫుటముగా గాన్పించుట యనుభవమునను న్నదే. కాని మరణానంతర మావిధముగ గాన్పించుటలేదు. మరణానంతర మేవిధమగు చలనముగాని గాన్పించుటలేదు. కావున కర్తృత్వభోక్తృత్వములు శరీరమునకు సంబంధించినవి గావని తేలుచున్నది.

అయిన కర్తృత్వభోక్తృత్వము లెవరికి సంబంధించినవి? జీవించి యున్నంతవఱకును శరీరము చలనవిశిష్టమును, మరణానంతరము చలన రహితము నగుచున్నది. అయిన జీవించుట యన నేమి ? మరణించుట యన నేమి ? మరణమునకు పూర్వమున్న శరీరము మరణానంతరము నున్నది. కాని మరణమునకుపూర్వము శరీరము నధిష్ఠించియున్న వస్తు వేదో శరీరమును విడిచిపోవుటచేతనే శరీరము చలనరహిత మగు చున్నది. ఆవస్తు వున్నంతవఱకును శరీరము సర్వకార్యములు నిర్వ హించుచున్నది.

పాశ్చాత్యవైజ్ఞానికులు రక్తమునందలి జీవకణములచేతనే మానవుడు జీవింపగలుగుచున్నాడనియును, అవి జీవరహితములైనపుడు మరణించుచున్నాడనియును, మరణ మన నీస్థితియే యనియును ప్రతి పాదించుచున్నారు. కాని కేవలము జీవకణములచేతనే సర్వవిధానుభవ ములును గలుగుటలేదు. నిద్రించుచున్నపుడును, మూర్ఛాదులయందు దును జీవకణములు స్వస్థితియందే యున్నను శబ్దాదులయనుభవము గలుగుటలేదు. కావున ననుభవమునకు వేఱేదైన కారణ ముండ వలయునని తేలుచున్నది. మఱియును కణములు జీవించియుండుటకు గావలసిన పరిస్థితి యేమనునది మఱియొకప్రశ్న యున్నది.

శరీరముయొక్క జీవత్స్థితి కుష్ణము ప్రధానవిషయము. ఉష్ణము సర్వశరీరమునందును వ్యాపించియున్నగాని శరీరము జీవత్స్థితియం దుండదు. అయిన నీయుష్ణమునకు స్థాన మేది ? ఎచటనుండి బయలు దేరి యుష్ణము స్వకృత్యము నిర్వహించుచున్నది? మరణమున నుష్ణము హస్తాగ్రములనుండియును, పాదతలములనుండియును క్రమముగ వెను కకు బోవును. ఎంతవఱకు వెనుకకు బోవునో యంతవఱకును నాభాగము చైతన్యరహిత మగును. ఈ విధముగ నన్ని భాగముల నుండియును నుష్ణము వెనుకకు బోవుచు శ్లేష్మ మాస్థానము నాక్రమించుచుండును. చివరకు కంఠము శ్లేష్మపూరిత మగును. కంఠాధఃప్రదేశమును శ్లేష్మ

పూరిత మగుచు చివరకు హృదయప్రదేశమున నుష్ణ ముండు
ఆస్థానముకూడ నుష్ణరహితమైనపుడు ఆస్థితియే మరణ మని వ్యవహ
పబడుచున్నది. కావున జీవత్ స్థితి కుష్ణము ప్రధానకారణమని తే
చున్నది. అయిన నుష్ణము స్వయముగనే సర్వశరీరమునందు వ్యాపి
చున్నదా? లేక యన్యప్రేరణ మావశ్యకమా?

ఉష్ణము స్వయముగ వ్యాపించుశక్తిగలది కాదు. దాని శ
ప్రేరణ కావలయును. ఉత్పత్తికేంద్రమునం దెప్పటికప్పు డుత్ప
యగుచున్ననే, యావిధముగ నుత్పన్నమైన యుష్ణపువత్తి సెవల
యుష్ణము వ్యాపించుచుండును. కేంద్రమున నుత్పత్తి యాగినపు డ
వ్యాపనమును నాగిపోవును. అయిన శరీరమున నుత్పత్తికేంద్ర మే
ఉష్ణము క్రమముగ కొనలనుండి వెనుకకు బోవుచు హృదయప్ర
మున చేరుటచే నదియే యుత్పత్తికేంద్రము కావలయును కేంద్ర
నందును నుష్ణము స్వయముగ నుత్పన్న మగుటలేదు. చేతను డ
డావశ్యకపరికరములను సమకూర్చికొని యుష్ణము నుత్పత్తిచేయు
న్నాడు. అయిన శరీరమున నుష్ణము నుత్పత్తిచేయువారెవరు ?

భుజించినయాహారమునందు పిండిపదార్థము, క్రొవ్వుపదార్థ
గల పదార్థములవలన నెప్పటికప్పు డుష్ణ ముత్పన్న మగుచుండు
ఆవిధముగ నుత్పన్నమగుచున్నంతకాలము శరీరమునం దుష్ణము స
మముగ నుత్పన్నమై స్వకృత్యనిర్వాహణము గావించుచుండును. వి
దుత్పత్తికేంద్రమున నుత్పత్తిచేయువా డున్నట్లు శరీరమున నుత్ప
చేయువా డొక డుండవలయును. అయిన నాత డెవడు? ఆతనికే జీవు
వ్యవహారము.

కావున జీవు డున్నంతవఱకును శరీరము చైతన్యవంతము
ఆతడు వీడినతరువాత తద్రహితమును నగును. కావున జీవుడే స
దుఃఖభోక్త యని తేలుచున్నది. సుఖదుఃఖభోక్తృత్వములో శరీర

సాధనముమాత్రమే. శరీరమునం దుష్ణ మధికమైనపుడు శీతోపచారము వలనను, శైత్య మధికమైనపు డుష్ణోపచారమువలనను దానికి సమస్థితి కలిగించుచు సుఖించుచున్నాము. కావున జీవుడే సుఖదుఃఖభోక్తయు, కర్తయు నని తేలుచున్నది.

కాని కొన్ని సమయములం దవశుడై తనపని తాను నిర్వహించి కొనజాలకున్నాడు. తనకు తెలియకుండ జన్మించినాడు. పరులమీద నాధారపడి పెరిగినాడు. తనస్థితి తనకు తెలియునప్పటికి వయస్సులో కొంత గడిచిపోయినది. అవశములైన వ్యాధులు. తనదియని చెప్పు కొనదగిన దేమియును లేదు. తాను నివసించుచున్న పృథివి తనది కాదు. తనశరీరపోషణమున కావశ్యకములైన పదార్థములు తనవి కావు. వాయువు తనది కాదు. సర్వము పరులదైనను తనయిష్టము వచ్చిన ట్లుపయోగించికొనజాలకున్నాడు. తనయిచ్ఛకు వ్యతిరేకముగ నెన్నిపనులు జరుగుటలేదు! ఇట్టియవశతలో తాను స్వతంత్రుడ నను కొనుట కవకాశ మేది? ఇదియే కేనోపనిషత్ప్రథమమంత్ర సారాంశము. ఈవిషయమునుగురించియే — ఏదేవునియొక్క ప్రేరణమువలన మనః ప్రాణవాక్చక్షుఃశ్రోత్రములు స్వకృత్యనిర్వహణము గావించుచున్న వనువిషయమునుగురించియే — శిష్యుడు ప్రశ్నించినాడు.

## ద్వితీయమంత్ర వివరణము

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచమ్— ఏది శ్రోత్రమునకు శ్రోత్రమో, మనస్సునకు మనస్సో, వాక్కునకు వాక్కో అని వాక్యార్థము.

శ్రోత్ర మనగా శ్రవణము = వినుటకు సాధనమైన యింద్రియము. వాక్కనగా సంకల్పానుగుణముగ భావమును వ్యక్తీకరించుట కనువగు ధ్వనిరూపములగు వర్ణముల నుచ్చరించు నింద్రియము. మన స్సనగా జీవేంద్రియములకు మధ్యవర్తి యగు నింద్రియము — ఇంద్రియ

ములకు గలిగిన యనుభవమును జీవునకు చేర్చుసాధనము. శ్రోత్ర వాఙ్మనస్సు లన్నియును జడములు. జడములకు కర్తృత్వము లేదు. శ్రోత్రమునకు శ్రవణసామర్థ్యమును, మనస్సునకు ప్రతిఫలనసామర్థ్యమును, వాక్కునకు ధ్వన్యుత్పాదకసామర్థ్యమును గలిగించు తత్త్వమేది గలదో,

స ఉ ప్రాణస్య ప్రాణ శ్చక్షుష చక్షుః — ఆతత్త్వమే ప్రాణ వాయువునకు ప్రాణశక్తి నిచ్చినది. అదియే చక్షురింద్రియమునకు దర్శనసామర్థ్యము నిచ్చినది యని వాక్యార్థము,

శిష్యుః ప్రశ్నయందు మనఃప్రాణవాక్చక్షుఃశ్రోత్రములకు స్వకృత్యనిర్వాహణసామర్థ్యము నిచ్చిన దెవ రనునది ముఖ్యవిషయము. ఇది ప్రథమమంత్రమునందు ప్రతిపాదింపబడినది. రెండవమంత్రమునందు మనఆదుల కాసామర్థ్యము నిచ్చినది ఒకేతత్త్వమని సమాధానింపబడినది. కాని యాతత్త్వమిది యని నామకరణము చేయబడలేదు. ఆతత్త్వ నాము మనంతరగ్రంథమున నిర్ణయింపబడును. కాని యీమంత్రమునం దొకవిశేష మున్నది. ప్రశ్న మనఆదులకు స్వకృత్యనిర్వాహణసామర్థ్య మిచ్చిన దెవరని? సమాధానమునం దాతత్త్వము మనస్సుకు మన స్సనియు, శ్రోత్రాదులకు శ్రోత్రాదు లనియు ప్రతిపాదింపబడినది.

శ్రోత్రమునకు శ్రోత్ర మనగా నేమి? శ్రోత్రము శ్రవణసాధనము. శ్రవణసాధనమునకు శ్రవణసాధన మనగా నర్థ మేమి? చెవిచేత మనము ధ్వనులు వినగలుగుచున్నాము. చెవియందు చాలపలుచనిపొర యొకటి యున్నది. అదియే ధ్వనిగ్రాహకవస్తువు. దానియందు ధ్వనులు ప్రతిధ్వనించుచుండును. ఆప్రతిధ్వని శబ్దవహనాడీద్వారా జీవునకు చేరి శబ్దజ్ఞానము కలుగుచున్నది. ఏకారణముచేతనైన నాపొర చెడిపోవుట తటస్థించెనేని చెవుడు సంభవించును.

గ్రామఫోను చూడనివా రుండరు. అందు ప్లేట్ల నేర్పాటుచేసి పాటలు వినుచున్నాము. ఆప్లేట్లు రబ్బరులో కొన్నిరసాయనికపదార్థ

ములు గలిపి తయారుచేయబడుచున్నవి. గాయకుని పాటయందలి ధ్వనుల ననుసరించి యాప్లేటునందు హెచ్చుపల్లము లేర్పడును. యంత్రముద్వారా ఆప్లేటును తిరుగునట్లు చేసి దానిమీద నొకసూది నుంతురు. ఆసూది ప్లేటునందలి హెచ్చుపల్లములయందు తిరుగుచు నాయాధ్వనులను గలిగించును. ఆయంత్రము నానుకొని శబ్దగ్రాహకభాగము (Sound box) ఉండును. ఆధ్వనులు శబ్దగ్రాహకభాగమునందు ప్రతిధ్వనించి పాటలు వినబడుచుండును.

శ్రవణనిర్మాణము ననుసరించియే యీనిర్మాణము గావింపబడినది. విజ్ఞానశాస్త్రజ్ఞులచే నీయంత్రము నిర్మింపబడుచున్నది. ఈయంత్రమునందన్ని భాగములును జడములే. జడములగు నీభాగములకు పాటలను వినిపించుసామర్థ్యము చేతనులచే కల్పింపబడినది. అయిన శ్రవణనిర్మాణము గావించిన దెవరు? జీవుడందమా, ఆతనికి తెలియకముందే యీశరీర మాతనికొఱకై పరునిచే నిర్మింపబడినది. తలిదండ్రులందమా వారికిని గర్భోత్పత్తివిషయము తెలియదు. కావున నీనిర్మాణము వారిది గాదు. శ్రోత్రమునకు శబ్దగ్రాహకసామర్థ్యము కల్పించినవాడుగాన ఆదేవుడు శ్రోత్రమునకు శ్రోత్రముగా వర్ణింపబడినాడు.

మనసో మనః — మనస్సునకు మనస్సైనవాడని యర్థము.

అన్నమయం హి సోమ్య మనః అనుశ్రుతిచే మనస్సు భౌమము. అట్టిజడమగు మనస్సునకు శబ్దస్పర్శరూపరసగంధములను దహరాంతర్వర్తిజీవునకు చేరవేయుసామర్థ్య మెట్లు గలిగినది? విచిత్రవిశ్వనిర్మాతయగు నాపరమేశ్వరునిశక్తి వర్ణనాతీతము, అనూహ్యము. మనస్సునకట్టిసామర్థ్య మాపరమేశ్వరునిచేత కల్పింపబడినది.

వాచో హ వాచమ్ — వాగింద్రియమునకు వాక్కైనవాడని యర్థము.

ప్రాణస్య ప్రాణః — ప్రాణమునకు ప్రాణమైనవాడని యర్థము.

చక్షుషః చక్షుః — నేత్రేంద్రియమునకు నేత్రమైనవాడని యర్థము.

ఇంద్రియములన్నియును భౌతికములే. ప్రాణవాయువును మహావాయుభాగమే. ఇంద్రియములు జడములు వానికనగా వాగింద్రియమునకు మాటలాడుటకుగాని, ప్రాణవాయువున కుచ్ఛ్వాసనిశ్శ్వాసరూపమున చలించుటకుగాని, నేత్రమునకు చూచుటకుగాని సామర్థ్యము లేదు. అట్టిసామర్థ్య మావిచిత్రవిశ్వనిర్మాత యొసంగినదే. చక్షుర్విషయము కొద్దిగా విపులీకరించి ప్రకృత మనుసరింతము.

దర్పణము చూడనివా రుండరు. సిలికా యను నొకవిధమగు నిసుకయందు రసాయనికపదార్థములు కలిపి కొంతిపరిమాణమువఱకును వేడియందుంచిన నయ్యవి కరిగి ద్రవరూపము నందును. ఆద్రవమును మూసలో పోసి అద్దములు తయారుచేయుచున్నారు. దీనిముందున్న వస్తువుయొక్క ప్రతిబింబము నిది గ్రహించును. ప్రతిబింబమును గ్రహించినంతమాత్రమున దీనికి గ్రహణకర్తృత్వము లేదు. కారణము దర్పణనిర్మాణమునందు వినియుక్తములైన ద్రవ్యము లన్నియును జడము లగుటయే. జడపదార్థములందు కర్తృత్వ మనుపపన్న మనునది సర్వసమ్మతమగు సిద్ధాంతము. ఇక చక్షుర్విషయము గాంతము. చక్షురింద్రియము తేజఃపరమాణువు. స్థూలముగా మనకు గన్పడుచున్న కన్ను పృథివీజలభాగములతో నిర్మింపబడినది. తెల్లగ్రుడ్డుమధ్యభాగమున నల్లగ్రుడ్డును, దానిమధ్యభాగమున నింద్రియపరమాణువును నున్నవి. ఇదియే దర్శనోపయోగియగు నింద్రియము. ఎదుటనున్న వస్తువుయొక్క బింబము దీనియందు ప్రతిబింబించి మనోద్వారా జీవునకు చేరి వస్తుజ్ఞానము కలుగుచున్నది. ప్రతిబింబమును గ్రహించుటలో నద్దము చేతనము గానట్లు నేత్రమును చేతనము గాదు. నిర్మాత సిలిక మొదలైనద్రవ్యములకు దర్పణరూప మిచ్చుటవలనను, బింబము దర్పణపురోభాగమునకు వచ్చుటవలనను ప్రతిబింబమున కవకాశ

మేర్పడుచున్నది. అటులే తైజసపరమాణువున కారూప మిచ్చి కన్ను నం దుంచుటవలనను, వస్తువునెదుటకు కన్ను వచ్చుటయో, లేక కంటి యెదుటకు వస్తువు వచ్చుటయో తటస్థించిననే నేత్రేంద్రియము రూపమును గ్రహించుచున్నది. కావుననే చక్షురింద్రియమునకు దర్శన సామర్థ్యము నిచ్చినవాడుగనుకనే యీదేవుడు చక్షువునకు చక్షువుగా ప్రతిపాదింపబడినాడు.

అతిముచ్య ధీరాః ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి - ధీరులగువారీలోకమును విడిచి ప్రకృష్టదశను పొంది అమృతులు= మరణరహితు లగుచున్నారని వాక్యార్థము.

ధీరాః – ధియం ప్రశస్తాం మోక్షవిషయాం బుద్ధిం రాంతి గృహ్ణంతీతి ధీరాః= మోక్షవిషయకమైన ప్రశస్తబుద్ధి గలవారు ధీరులు.

బ్రహ్మవిద్యయం దధికారులు ముముక్షువులు=మరణమునుండి విడివడవలయునను నిచ్ఛగలవారు. ఈమోక్షేచ్ఛయే ప్రశస్తమైన బుద్ధి యని వ్యవహరింపబడుచున్నది. ఇట్టిముముక్షువులు అస్మా ల్లోకా దతి ముచ్య = ఈలోకమును విడిచి, ప్రేత్య = ప్రకృష్టదశను పొంది, అమృతాః=మరణరహితు లగుచున్నారు.

అస్మాత్ లోకా దతిముచ్య=ఈలోకమును విడిచి యని యర్థము.

ఏలోకమును విడిచి ? మనఃప్రాణవాక్చక్షుశ్శ్రోత్రరూపమైన లోకమును విడిచియని సమాధానము. చక్షుశ్శ్రోత్రములు జ్ఞానేంద్రియములు. వాక్కు కర్మేంద్రియము. మనస్సు అంతరింద్రియము. ప్రాణవాయువు జీవనాధారమైనది. జీవించుచున్నస్థితిలో జీవునకు బహిః ప్రపంచసంబంధము కలిగించుటలో అంతరింద్రియమగు మనస్సును, బహిరింద్రియములగు చక్షురాదులును సాధనములు. జీవికానిర్వాహణా సౌలభ్యమునకై వాక్కు ప్రధానమైనది. ఈమనఆదులసంబంధము వదలినగాని యమృతత్వమున కవకాశము లేదు. హార్దబ్రహ్మయం దపున

రాప్త్రముగ శుద్ధోదకద్వయసంయోగమువలె సాయుజ్యము నందిన గాని యమృతత్వము లభింపదు. కావున నమృతత్వమున కీలోకసంబంధ మనగా మనశ్శప్రాణాదిసంబంధము వదలుట పూర్వాంగమని తేలుచున్నది. లోకాత్ అనునది కర్మార్థమునం దపాదానపంచమి.

## ప్రేత్యపదార్థము

ప్రేత్య = ప్రకృష్టదశను పొందియని ప్రకరణికార్థము. కాని ప్రేత్యపదమునకు కొందరాచార్యులు మరణించియని యర్థమును ప్రతిపాదించినారు. ఈపదమున కీయర్థము లేకపోలేదు. కాని యీయర్థము ప్రకరణవిరుద్ధము. ప్రేత్య అమృతా భవంతి = మరణించి యమృతు లగుదురని యీసంప్రదాయముప్రకార మర్థము ప్రతిపాదింపవలయును. ప్రేత్య అనుపదమునకు మరణించియని యర్థము చెప్పుటకు సరళమైన యర్థమును వీడి అధ్యాహారపదములను చేర్చి మంత్రార్థమును ప్రతిపాదించినారు. దానిని వివరించుచు కాలమును వ్యర్థము చేయక ప్రకృత మనుసరింతము.

ఆసంప్రదాయముప్రకార మమృతీభవనమునకు మరణము పూర్వభావిగా నంగీకరింపబడినది. కాని యియ్యది ఉపనిషత్సంప్రదాయ విరుద్ధము. మరణానంతరమే యమృతీభవనమున కవకాశము గలుగునా? మరణమునకు పూర్వ మీయవకాశము లేదా? మనఆదిసంబంధము వదలుటవలన నమృతత్వము లభించును. అనగా మరణసంబంధము వదలును.

## ప్రాకృతాప్రాకృతమరణములు

మరణ మనగా నేమి? మరణ మనగా ప్రాణత్యాగమని నైఘంటుకార్థము. ప్రాణత్యాగ మనగా ప్రాణవాయుత్యాగము. ప్రాణవాయువు స్థూలశరీరమునకు సంబంధించినది. ఈప్రకరణమున ప్రాణశబ్దముచే స్థూలశరీర ముపలక్షింపబడుచున్నది. కావున ప్రాణ

త్యాగ మనగా స్థూలశరీరత్యాగమని యర్థము. ప్రాణత్యాగ మైన వెంటనే, ప్రాణవాయువు శరీరమునుండి నిష్క్రమించిన వెంటనే శరీరము చైతన్యరహిత మగును. జీవుడు శరీరమునుండి యుత్క్రమించిన వెంటనే ప్రాణవాయుప్రసరణ మాగిపోవును. వీనిపౌర్వాపర్యము నిర్ణయించుట కష్టము. వాస్తవము వచింపవలయునన్న నీరెండును నొకేపర్యాయము సంభవించును. దీనికే ప్రాకృతమరణ మని వ్యవహారము.

ఇక నప్రాకృతమరణవిషయము గాంతము. ఈమరణమునకే ప్రాయణ మని వేదాంతములయందు వ్యవహారము. ప్రాయణ మనగా నేమియో గాంతము. ప్రాకృతమరణమున స్థూలశరీరత్యాగము మరణ మని వ్యవహరింపబడుచున్నది. కాని సూక్ష్మశరీరముమాత్రము జీవుని వెంటనంటియే యుండును. సూక్ష్మశరీర మున్నంతవరకును జన్మ తప్పదు. అది యున్నంతవఱకును నపునర్భవస్థితి ప్రాప్తింపదు. పునర్భవము వెంట మరణము తప్పదు. వేదాంతములపరమప్రయోజనము మరణరాహిత్య పూర్వకమగు నపునర్భవస్థితి. జీవునిపరమాశయమును నిదియే. కావుననే జీవుడు ముముక్షు వని వ్యవహరింపబడుచున్నాడు. మరణమునుండి విడివడుట యనగా స్థూలశరీరసంబంధత్యాగము. అపునర్భవ మనగా పునర్భవాపాదక మైన సూక్ష్మశరీరత్యాగము. స్థూలసూక్ష్మశరీరత్యాగ మైనగాని సంసరణబంధము — మరణజననములు — వదలవు. స్థూల శరీరత్యాగము నియతవిషయము. ప్రారబ్ధభోగాంతమున దానియంతటదనియే వదలిపోవును.

ఇక సూక్ష్మశరీరత్యాగవిషయము గాంతము. సూక్ష్మశరీ మనగా మనస్సు, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు, వాక్పాణిపాదపాయూపస్థలును. వీనిద్వారానే జీవునకు బహిఃప్రపంచసంబంధ మేర్పడుచున్నది. ఈసంబంధమే యాతనివిషయానుభవమున ముఖ్యసాధనము. శబ్దస్పర్శ రూపరసగంధములు విషయములు. ఈవిషయానుభవముకొఱకే

కార్యాకార్యములు గావింపబడుచున్నవి. ఇందు సత్కార్యములకు స్వర్గమును, దుష్కార్యములకు నరకమును ననుభవస్థానములు. అనుభవాంతమున మఱల జన్మ. పునర్జన్మప్రాప్తికి పరంపరలో నాదికారణము సూక్ష్మశరీరము. కావున సూక్ష్మశరీరసంబంధము వదలించికొనిన పునర్జన్మ యుండదు.

అయిన పునర్భవకారణమైన సూక్ష్మశరీరసంబంధము వదలించికొనుట యెట్లు? బహిఃప్రపంచమునకు సన్నిహితములైనవి త్వగాదులు. జీవునకు సన్నిహితమైనది మనస్సు. కావున మనస్సంబంధము వదల్చికొనిన త్వగాదిసంబంధము వదలినట్లే. జీవునకు సంకల్పము గలిగినగాని మనస్సంబంధమును, తద్ద్వారా త్వగాదిసంబంధమును గలుగవు. కావున సంకల్పమునశించిన మనస్సంబంధమువదలును. కావున సంకల్పత్యాగము ప్రధానకర్తవ్యమని తేలుచున్నది.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే

క్రమముగ సంకల్పములన్నియును నశించిన మర్త్యుడు=మరణశీలియగు జీవుడు, అత్ర = ఈజన్మయందే యనగా మరణమునకు పూర్వమే అమృతః = మరణములేనివా డగుచున్నాడు. బ్రహ్మను పొందుచున్నాడు. దీనికే ప్రాయణము = ప్రకృష్టదశాప్రాప్తి యని వేదాంతములందు వ్యవహారము. కావున నీచర్చవలన మరణ మనగా ప్రారబ్ధభోగావసానమున స్థూలశరీరత్యాగ మనియును, ప్రాయణ మనగా మరణమునకుపూర్వమే సూక్ష్మశరీరసంబంధమును వదల్చికొనుట యనియును తేలుచున్నది. కావున మంత్రమునందలి ప్రేత్య అనుపదమునకు ప్రకృష్టదశను పొందియని యర్థమని తేలుచున్నది. మన ఆదిసంబంధత్యాగమే ప్రకృష్టదశాప్రాప్తి.

## తృతీయమంత్రము

న తత్ర చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి నో మనో
న విద్మో న విజానీమో య థైత దనుశిష్యాత్
అన్య దేవ త ద్విదితా దథో అవిదితా దధి
ఇతి శుశ్రుమ పూర్వేషాం యే న స్త ద్వ్యాచచక్షిరే

అర్థము :- తత్ర = ఆబ్రహ్మతత్త్వమునందు, చక్షుః = నేత్రము, న గచ్ఛతి = ప్రసరించదు. వాక్ = వాక్కు, న గచ్ఛతి = ప్రసరించదు. మనః = మనస్సు, న గచ్ఛతి = ప్రసరించదు. తత్ = ఆబ్రహ్మతత్త్వమును, న విద్మః = తెలిసికొనలేము. యథా = ఏప్రకారముగా, ఏతత్ = దీనిని, అనుశిష్యాత్ = గురువు బోధించునో, తథా = ఆప్రకారముగా, నవిజానీమః = విశేషముగా తెలిసికొనలేము. తత్ = అది, విదితాత్ = తెలిసికొనబడినదానికంటె, అన్య దేవ = ఇతరముగానే యున్నది. అథో = పిమ్మట, అవిదితాత్ = తెలియబడనిదానికంటెను, అధి = అధికముగా నున్నది. యే = పూర్వులు, నః = మాకు, తత్ = ఆతత్త్వమునుగూర్చి, వ్యాచచక్షిరే = వివరించి చెప్పిరో, పూర్వేషామ్ = అట్టిపూర్వులయొక్క, ఇతి = ఈవచనమును, శుశ్రుమ = వినుచున్నాము.

తాత్పర్యము :- ఆబ్రహ్మతత్త్వమును నేత్రము చూడలేదు. వాక్కు వర్ణించలేదు. మనస్సు మననము చేయలేదు. ఆతత్త్వము నేవిధముగను తెలిసికొనలేము. గురువు వివరించినను తెలిసికొనుట దుష్కరము. ఈవిషయము పూర్వులవలన తెలియుచున్నది.

## వివరణము

ప్రథమమంత్రమునందు ధీప్రేరకు డెవ రనువిషయమున శిష్య ప్రశ్న ప్రతిపాదింపబడినది. ద్వితీయమంత్రమునందు పరమేశ్వరుడే సర్వేంద్రియప్రేరకు డనియును, ఇంద్రియసంబంధము వదలుకొని ధీరులగు ముముక్షువులు ప్రకృష్టదశను పొంది మరణరహితు లగుచున్నా రనియును ప్రతిపాదింపబడినది. ఈమంత్రమునందు పరమేశ్వరుడు సర్వేంద్రియనిష్పద్యమానజ్ఞానబహిర్భూతు డనువిషయము ప్రతిపాదింపబడుచున్నది.

న తత్రి...నో మనః — చక్షుర్వాఙ్మనస్సులకు బ్రిహ్మవిషయపరిజ్ఞానమున సామర్థ్యము లేదని వాక్యార్థము.

చక్షుస్సు త్వక్ శ్రోత్రిజిహ్వాఘ్రాణములకును, వాక్కు పాణిపాదపాయూపస్థలకును నుపలక్షకము. ఇవియన్నియును బహిఃకరణములు. మనస్సంతఃకరణము. ఇవియన్నియును భౌతికములు, జడములు. వీనికి జ్ఞాతృత్వరూపకర్తృత్వము లేదనునది సర్వసమ్మతమగు సిద్ధాంతము. జడములవిషయమున నారోపితకర్తృత్వమేగాని స్వాభావికకర్తృత్వము లేదు. చేతనప్రేరితములైన కందుకాదులయం దారోపితకర్తృత్వమనుభవసిద్ధము. అయినను బంతి కదలుచున్న దనుచున్నాము. అట్లే అన్యప్రేరితములైన చక్షురాదులయందును దర్శనాదు లుపపన్నములగుచున్నవి. అయినను నయ్యవి తమప్రసరణపరిధియం దున్నవానిని మాత్రిమే తెలిసికొనగలవు. తద్బహిర్భూతములగువానిజ్ఞానము వానికి గలుగదు. ఉదాహరణమునకు చక్షుర్విషయము గాంతము. నేత్రిము తనప్రసరణపరిధిలో (Perview) నున్నదానినిమాత్రిమే చూడగలదు. తద్బహిర్భూతములగువానిని దూరదర్శినిసాయముతో చూడవచ్చును. ఆపరిధియును దూరదర్శినిశక్తి ననుసరించియుండును. అంతకు పైగా నున్నవస్తువులను చూచుట కవకాశము లేనేలేదు. అట్లే సూక్ష్మవస్తువులవిషయమున సూక్ష్మదర్శినియావశ్యకత యున్నది.

ఇక వాగ్విషయము గాంతము. కలిగినయనుభవములను వివరించుటలోనే వాక్కుయొక్క ప్రియోజనము. భావప్రికటనమునందే గాక యధ్యయనమునందును వాక్కుయొక్క సాయ మవసరము. బాల్యమున తలిదండ్రులనుండి తొక్కుపలుకులు నేర్చుకొనుటనుండి గురుకులమున సాంగవేదాధ్యయనమువఱకును దీనిసాయ మవసరము. ఇంకొకవిశేషము. వాక్కనగా వర్ణధ్వనిరూపమైనదని యీప్రికరణమున నర్థము. కాని కేవలధ్వని యర్థము కాదు. కారణము మూగవారధ్యయనము గావింపలేకపోవుటయే. మూగవారిలో కొందఱు

వ్రాయుట చేతనైనవా రున్నారు. వారు తమ భావములను వ్రాత మూలమున ప్రకటించుచున్నారు. కాని యుదాత్తాదిస్వరోచ్చారణ వాగింద్రియ మున్నంతమాత్రమున సాధ్యపడదు. వాక్కునకును అన నుభూతవిషయములను, అజ్ఞాతవిషయములను వర్ణించుసామర్థ్యము లేదు.

ఇంతియే గాదు. ఈవర్ణనమును వాస్తవమును వచింపవలయు నన్న వాగింద్రియమునకు సంబంధించినది గాదు. వాగింద్రియము గ్రామోఫోనువంటిది. గ్రామోఫోను మనముపెట్టిన రికార్డులలోని పాటనుమాత్రము వినిపించగలదు. అట్లే వాక్కును సంకల్పానుగుణ ముగ ప్రేరింపబడి తదనుకూలములైన ధ్వనులనుమాత్రమే వివరించును. కావున బ్రహ్మాత్మత్వవర్ణనమున వాగింద్రియమునకు సామర్థ్యము లేద నుట యుపపన్నమే యగుచున్నది. కారణ మాత్మత్వ మనుభూతమును, జ్ఞాతమును గాకపోవుటయే.

ఇకమనోవిషయము గాంతము. మనస్సు భౌమ మనియును, నంత రింద్రియ మనియును వివరించినాము. భౌమముగాన జడమని యంగీక రింపకతప్పదు. అయిన మనఅవబోధనే యను ధాతువునుండి సిద్ధమైన మనశ్శబ్దమునకు వైయర్థ్య మాపాదింపబడా యన్న గాంతము. మన్యతే అనే నేతి మనః అని మనశ్శబ్దవ్యుత్పత్తి. అనేన అనుసది కరణతృతీయ, మనఇంద్రియము మననములో సాధనముమాత్రమే. కర్త చేతనుడును, కరణము జడమును ననువిషయ మనుభవసిద్ధము. అటుల గాక, మనస్సు జడము గాక చేతనమేయై స్వాభావికకర్తృత్వవిశిష్టమేయైన మంతృశబ్ద వ్యవహారమును నుండవలయును. భాషయందంతటికరణమునకు మంతృ శబ్దవ్యవహారము లేదు. కావున మనశ్చేతశ్చిత్తాదిశబ్దములు లాక్షణికము లని చెప్పకతప్పదు.

ఈవిమర్శచే చక్షుర్వాఙ్మనస్సులకు బ్రహ్మాత్మత్వాదర్శనవర్ణన

మననములయందు సామర్థ్యము లేదని తెలుచున్నది. ఈవిషయ మీ క్రింది మంత్రముచే ప్రతిపాదింపబడినది.

యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చ నేతి

న విద్మః — ఆతత్త్వమును తెలిసికొనలేమని వాక్యార్థము.

జ్ఞానసాధనములు జ్ఞానేంద్రియములు. ఇవియన్నియును జడములు. ఇయ్యవి యన్యప్రేరణమువలననే స్వకృత్యనిర్వహణసమర్థము లగుచున్నవని వివరించినాము. ఐనను నియ్యవి భౌతికములగు శబ్దస్పర్శరూపరసగంధాదిజ్ఞానములందుమాత్రమే యుపయోగపడుచున్నవి. మనస్సును త్వగాదులను స్పర్శాదిజ్ఞానవిషయమున నున్ముఖములనుగా జేయుటలోమాత్రమే వినియోగించుచున్నది. అంతకన్న దానివలన వేరుప్రయోజనము లేదు. కావున నిప్పటివఱకును భౌతికానుభవసాధనములగు జ్ఞానేంద్రియములద్వారా అప్రత్యక్షమగు వస్తుజ్ఞానము కలుగుట కవకాశము లేదని తెలియుచున్నది.

న విజానీమో య థైత దనుశిష్యాత్ — గురువు బోధించినను నధికముగా తెలిసికొనుటకు వీలు లేదని వాక్యార్థము.

తెలియనివిషయముల నాచార్యులయొద్దనుండి తెలిసికొనుచున్నాము. వారైనను తమ కనుభూతములును, జ్ఞాతములునగు విషయములనుమాత్రమే బోధించగలుగుచున్నారు. కాని యనుభవము నతిక్రమించినవిషయములను వారును బోధింపలేరు. కారణము వారి వాక్కును నాతత్త్వవర్ణనవిషయమున నిరుపయోగ మగుటయే. అయిన నధ్యయనశ్రవణములవలన ప్రయోజన మేమన్న విచారింతము.

## అధ్యయన శ్రవణ ప్రయోజనము

రస మనగా రుచి యని యర్థము. ఇయ్యది పృథివీభూతమునకు సంబంధించినది. కాని యిది జలమునకు సంబంధించినదని శాస్త్రము

ప్రతిపాదించుచున్నది. దీని కొక కారణ మున్నది. చవిటిపఱ్ఱులయందు ప్రవహించిన జల ముప్పగా నుండును. రేగడి నేలయందు ప్రవహించిన జలము తియ్యగా నుండును. కారణము చవిటిపఱ్ఱులయందు లవణాణువు లున్నవిగాన నాజల ముప్పగా నుండును. అట్లే నేలవేమునకు సంబంధించిన యణువులు చేరిన జలము చేదుగా నుండును. కావున రసము పృథివీభూతమునకు సంబంధించిన దని తేలుచున్నది.

అయిన శాస్త్రీయప్రతిపాదనవిషయ మేమి? అన్న విచారింతము. రుచిని గ్రహించునది రసన = నాలుక. జిహ్వేంద్రియాణువు నాలుకయం దున్నది. తడిగానున్నంతవరకే నాలుక రుచిని గ్రహించగలుగు చున్నది. తడి యారినచో నాలుకకు రుచిని గ్రహించుశక్తి తొలగి పోవును. శక్తిమాత్రము తొలగునుగాని యింద్రియముమాత్ర మట్లే యుండును. మఱల నాలుకయందు తడి చేరిన రసగ్రహణశక్తి గలుగును. కావుననే రుచిగ్రహణమున ఆర్ద్రత — జలావశ్యకత యుండుట చేతనే యౌపచారికముగా రసము జలమునకు సంబంధించినదని ప్రతిపాదింపబడినది.

ఒక్క రసవిషయమే గాదు. శబ్దవిషయమును నింతియే. శబ్ద మాకాశమునకు సంబంధించినదని శాస్త్రసంప్రదాయము. కాని శబ్దము రెండువిధములుగా నుత్పన్న మగుచున్నది. దూరస్థవస్తువులయొక్క సంయోగమువలనను, ఒకవస్తువు రెండుగా చీలుటవలనను శబ్ద మేర్పడుచున్నది. తెండు రాళ్లు తగులుకొనుటవలన ధ్వని కలుగుచున్నది. వెదురు చీల్చుటవలన ధ్వని కలుగుచున్నది. మొదటిది సంయోగజ మనియును, రెండవది విపాటనజ మనియును వ్యవహారము. కాని సంయోగవియోగముల కాకాశ మవసరము. ఆకాశము లేనిచో సంయోగవియోగములు సంభవింపవు. కావుననే శబ్ద మాకాశగుణమని యౌపచారికముగా వ్యవహరింపబడుచున్నది.

రసవిషయము బోధింపవలయు నన్న కేవలము వాక్కుతో బోధింపలేము. అయ్యది యనుభవపూర్వకముగా బోధింపవలసినదే. బెల్లము తియ్యగా నుండునని చెప్పినంతమాత్రమునను, బెల్లము చూపించినంతమాత్రమునను తీపి యన నేమో తెలియదు. బెల్లము నాలుక యం దుంచి రసానుభవము గలిగినంతనే యారుచికి తీపి యని పేరని చెప్పిన తెలియును.

భౌతికములగు వస్తువులవిషయము నీవిధముగ బోధించవచ్చును. కాని యభౌతికమగు బ్రహ్మతత్త్వవిషయము బోధించుట యెట్లు? ఇంద్రియములు భౌతికపదార్థములవిషయముననే సమర్థములుగాని బ్రహ్మతత్త్వవిషయమున ససమర్థము లనుట నిర్వివాదము. ఈవిషయము ఛాందోగ్యమున చక్కగా ప్రతిపాదింపబడినది శ్వేతకేతువు తండ్రియగు నుద్దాలకుని బ్రహ్మతత్త్వవిషయమును బోధింపుమని యడిగినపుడయ్యది సర్వేంద్రియాతీతమని ప్రతిపాదించుసందర్భమున సోదాహరణముగా ప్రతిపాదించినాడు.

> లవణ మేత దుదకేఽవధా యాథ మా ప్రాత రుపసీదథా ఇతి స హ తథా చకార తగ్ం హోవాచ య ద్దోషా లవణ ముదకేఽవాధా అంగ తదాహరేతి త ద్ధావమృశ్య న వివేద యథా విలీన మేవాం గాస్యాంతా దాచామేతి కథ మితి లవణ మితి మధ్యా దాచా మేతి కథ మితి లవణ మి త్యంతా దాచా మేతి కథ మితి లవణ మి త్యభిప్రాస్యైత దథ మోపసీదథా ఇతి తద్ధ తథా చకార త చ్ఛశ్వ త్సంవర్తతే తగ్ం హోవా చాత్ర వావ కిల స త్సోమ్య న నిభాలయ సేఽత్రైవ కిలేతి స య ఏషోఽణి మైతదాత్మ్య మిదగ్ంసర్వం త త్సత్యం స ఆత్మా త త్త్వ మసి శ్వేతకేతో!

ఉద్దాలకుడు పుత్రుడగు శ్వేతకేతునకు బ్రహ్మతత్త్వవిషయము రుజువుచేయగోరి యప్పటివఱకు కోడుకున్న యనుభవమును పురస్కరించికొని లవణము నుదకమునం దుంచి యుదయమున రమ్మనెను.

మరునాడు వచ్చిన కొడుకును గాంచి నీవు నిన్న రాత్రి యుదకమున నుంచిన యుప్పుగల్లును వెలుపలికి తీయు మనెను. కొడుకు నీటియందు వెదకెను. కాని యుప్పుగల్లు చేతికి తగులలేదు. అంత తండ్రి యానీటి నీచివర, మధ్య, ఆచివర నాచమించు మనెను. ఆచమించిన పిమ్మట నీ రెట్లున్నదని యడిగెను. ఉప్పగా నున్నదని సమాధానమిచ్చెను. కంటికి కనపడని, చేతికి తగులని యుప్పు నీటియందే యున్నది. అట్లే జగత్తు నందు సర్వత్ర సర్వదా అంతర్యామిగానున్న బ్రహ్మతత్త్వమును గాంచుటలో నీయైదింద్రియములును సమర్థములు గావు. అయ్యది యతి సూక్ష్మముగా జగత్తునందును, నీయందును నంతర్యామిగా నున్నదని చెప్పెను. కావున నీయుదాహరణముచే బ్రహ్మతత్త్వము సర్వజగదంతర్యామి యనియును, దాని నీభౌతికేంద్రియములతో సాక్షాత్కరింప జేసికొనుటకు వీలు లేదనియును తెలుచున్నది. ఇదియే యధ్యయన శ్రవణ ప్రయోజనము.

అన్య దేవ తద్విదితాత్ — ఆబ్రహ్మతత్త్వము తెలిసికొనబడినదానికంటె నన్య మని యర్థము.

విదితాత్ = తెలియబడినదని యర్థము. విదిత మనగా పంచేంద్రియములద్వారా ననుభూతమని యర్థము. శబ్దస్పర్శరూపరసగంధములు విషయములు. ఇంద్రియములద్వారా వీనియనుభవము గలుగుచున్నది, ఈయనుభవమును చాలపరిమితము. అందును కలిగినయావదనుభవము స్మృతిపథమున నుండదు. బ్రహ్మతత్త్వము యావదనుభవదృష్ట్యాగూడ తద్బహిర్భూతమే. ప్రతివస్తువునందును నిగూఢముగా నున్న యగ్నిని ప్రయత్నపూర్వకముగ వెలువరించవచ్చును. కాని జగత్తునందు నిగూఢముగా ప్రత్యణువునందును నంతర్యామిగానున్న యీశ్వరతత్త్వము నేయుపాయముననను కనుగొనుటకు వీలు లేదు. ఉదకమునందున్న లవణమును, దారువులందున్న యగ్నిని ఉపాయాంతరములచే కనుగొనుటకు వీ లున్నట్లు అంతర్యామిని జగత్తునుండి భిన్నముగా తెలిసికొనుటకు వీలు లేదు.

భూతములు పరస్పరభిన్నములు, అసంకీర్ణములు. కావున విడదీయుట కవకాశ మున్నది. అటులే కలుపుటకును నవకాశ మున్నది. లవణము నుదకమున గలుపవచ్చును. మఱల నాయుదకమును కాచి యుప్పును విడదీయవచ్చును. అయఃపిండమునం దగ్నిని ప్రవేశపెట్టవచ్చును. మఱల నాపిండమును చల్లబర్చి యగ్నిని తొలగింపవచ్చును. కాని జగత్తునుండి పరమేశ్వరునిగాని, పరమేశ్వరునినుండి జగత్తును గాని విడదీయుట కవకాశము లేదు. కారణము పరమేశ్వరతత్త్వము భౌతికము గాకపోవుటయే. ఈచర్చవలన పరమేశ్వరతత్త్వమును తెలిసికొనుట కీయెదింద్రియములును నిరుపయోగము లేయని తెలియుచున్నది. కావున పరమేశ్వరతత్త్వము విదితముకంటె = జ్ఞాతముకంటె, అనుభూతముకంటె అన్యత్ = ఇతరముగా నున్నదని తేలుచున్నది.

అవిదితా దధి – తెలియబడనిదానికంటె నధికముగా నున్నదని యర్థము.

జగత్తునందు మన కనుభవములో నున్నది చాలస్వల్పము. ఏవ్యక్తికిని యావజ్జగదనుభవము లేదు. అనుభూతమగు నీస్వల్పజగద్భాగము నాధారముగా చేసికొని మిగిలినజగద్భావన చేయగలిగినాడు. కాని తదనుభవము లేదు. భావించినదాని పరిమాణము నిదమిత్థ మనుటకు శక్తి చాలదు. ఇట్టియీజగత్తేకపాదము = పరమేశ్వరునిలో నొకవంతు. ఈయేకపాదమును త్రిపాత్తగు పరమేశ్వరునియందు మాతృగర్భమున శిశువువలె నిమిడియున్నది. శిశువునకు గర్భపరిమాణముగాని, గర్భవతిపరిమాణముగాని తెలియనట్లు విశ్వాంతఃపాతియగు జీవునకు విశ్వాతీతునివిషయము తెలియదు. అనుభూతమగు స్వల్పజగద్భాగముకంటెను నధికముగా నున్న జగద్భాగముయొక్క జ్ఞానము లేని జీవునకు దానినిగూడ తనకుక్షియం దిముడ్చుకొనిన యామనంతునికి సంబంధించిన జ్ఞాన ముండకపోవుటలో నాశ్చర్య మేమియును లేదు. అవిదితాత్ అనగా ననుభూతజగద్భాగముకన్న నధికముగానున్న

జగత్తు అవిదితము. దానికన్నను పరమేశ్వరు డధికముగా నున్నాడని సారాంశము.

ఇతి శుశ్రుమ పూర్వేషాం యే న స్త ద్వ్యాచచక్షిరే — ఇయ్యది పూర్వాచార్యులయొద్ది కేగి శ్రవణము గావించుటవలన తేలిన సారాంశమని యర్థము.

అనగా గురుపరంపరలో గావించిన శ్రవణమువలన తేలిన సారాంశమని తాత్పర్యము. అయిన నాదిగురు వెవరు ? పరమేశ్వరుడే యాదిగురు వనువిషయము

యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై
తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే

అను శ్వేతాశ్వరమంత్రముచే ప్రతిపాదింపబడినది. మఱియును నీవిషయము పాతంజలసూత్రములలో

క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః
తస్య వాచకః ప్రణవః, తజ్జప స్తదర్థానుసంధానమ్
స పూర్వేషా మపి గురుః కాలే నానవచ్ఛేదాత్

అనుసూత్రములచే ప్రతిపాదింపబడినది.

## చతుర్థమంత్రము

య ద్వాచాఽనభ్యుదితం యేన వా గభ్యుద్యతే
త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే

అర్థము :— యత్ = ఏయీశ్వరతత్త్వము, వాచా = వాక్కుచేత, అనభ్యుదితమ్ = వర్ణింపనటువ వీలుపడదో, యేన = ఏపరమేశ్వరునిచే ప్రేరింపబడిన, వాక్ = వాక్కు, అభ్యుద్యతే = ఉచ్చరింపబడుచున్నదో, త్వమ్ = నీవు, త దేవ = ఆతత్త్వ

మునే, బ్రహ్మ = బ్రహ్మనుగా, విద్ధి = తెలిసికొనుము. యదిదమ్ = ఏయీప్రతీకమును, ఉపాసతే = ఉపాసించుచున్నారో, ఇదమ్ = ఈప్రతీకము, న = బ్రహ్మ తత్త్వము కాదు.

తాత్పర్యము:— ఏతత్త్వము వాక్కుచేత వర్ణించుటకు వీలుపడదో, ఏపరమేశ్వరుని ప్రేరణచే వాక్కు ఉచ్చారణసామర్థ్యముగల దగుచున్నదో అతత్త్వమునే బ్రహ్మతత్త్వమునుగా తెలిసికొనుము. భక్తు లుపాసించు ప్రతీకము పరమేశ్వర తత్త్వము గాదు.

## పంచమమంత్రము

య న్మనసా న మనుతే యే నాహు ర్మనో మతమ్
త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే

అర్థము:— యత్ = దేనిని (ఏతత్త్వమును), మనసా = మనస్సుచేత, న మనుతే = మననముచేయలేడో, యేన = దేనిచేత, మనః = మనస్సును, మతమ్ = మననసామర్థ్యముగలదానినిగా, ఆహుః = చెప్పుచున్నారో, త్వమ్ = నీవు, తదేవ = అతత్త్వమునే, బ్రహ్మ = బ్రహ్మనుగా, విద్ధి = తెలిసికొనుము. యదిదమ్ = ఏయీప్రతీకమును, ఉపాసతే = ఉపాసించుచున్నారో, ఇదమ్ = ఈప్రతీకము, న = బ్రహ్మతత్త్వము గాదు.

తాత్పర్యము :— ఏతత్త్వమును మననముచేయుటకు వీలులేదో, ఏతత్త్వము మనస్సునకు మననసామర్థ్యము గలిగించుచున్నదో, అతత్త్వమునే బ్రహ్మతత్త్వమునుగా తెలిసికొనుము. భక్తు లుపాసించు ప్రతీకము బ్రహ్మతత్త్వము గాదు.

## షష్ఠమంత్రము

య చ్చక్షుషా న పశ్యతి యేన చక్షూగ్ంషి పశ్యతి
త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే

అర్థము :— యత్ = దేనిని, ఏతత్త్వమును, చక్షుషా = కంటిచేత, న పశ్యతి = చూడలేడో, యేన = ఏతత్త్వముచేత ప్రేరింపబడి, చక్షూంషి = నేత్రములను, పశ్యతి = చూచుచున్నాడో, త్వమ్ = నీవు, తదేవ = అతత్త్వమునే, బ్రహ్మ = బ్రహ్మతత్త్వమునుగా, విద్ధి = తెలిసికొనుము. యదిదమ్ = ఏయీప్రతీకమును, ఉపాసతే = ఉపాసించుచున్నారో, ఇదమ్ = ఈప్రతీకము, న = బ్రహ్మతత్త్వము కాదు.

తాత్పర్యము:- ఏతత్త్వమును కంటితో చూచుటకు వీలు లేదో, ఏతత్త్వముచే ప్రేరింపబడి కన్నులను చూడగలుగుచున్నాడో ఆతత్త్వమును బ్రహ్మతత్త్వమును గా తెలిసికొనుము. భక్తు లుపాసించు ప్రతీకము బ్రహ్మతత్త్వము కాదు.

## సప్తమమంత్రము

యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్ర మిదం శ్రుతమ్
త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే

అర్థము :- యత్ = ఏతత్త్వమును, శ్రోత్రేణ = చెవిచేత, న శృణోతి = వినలేడో, యేన = దేని ప్రేరణచేత, ఇదం శ్రోత్రమ్ = ఈ చెవి, శ్రుతమ్ = వినుటకు సామర్థ్యముగల దగుచున్నదో, తదేవ = ఆతత్త్వమునే, త్వమ్ = నీవు, బ్రహ్మ = బ్రహ్మతత్త్వమునుగా, విద్ధి = తెలిసికొనుము. య దిదమ్ = ఏయీ ప్రతీకమును, ఉపాసతే = భక్తు లుపాసించుచున్నారో, ఇదమ్ = ఈప్రతీకము, న = బ్రహ్మతత్త్వము కాదు.

తాత్పర్యము:- ఏతత్త్వము చెవిచేత వినుటకు వీలు లేదో, ఏతత్త్వప్రేరణ చేత చెవి వినగలుగుచున్నదో ఆతత్త్వమును బ్రహ్మతత్త్వమునుగా తెలిసి కొనుము. భక్తు లుపాసించు ప్రతీకము బ్రహ్మతత్త్వము గాదు.

## అష్టమమంత్రము

య త్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే
త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే

అర్థము:- యత్ = ఏతత్త్వము, ప్రాణేన = ప్రాణవాయువుచేత, న ప్రాణితి = జీవించుటలేదో, యేన = ఏతత్త్వముచేత, ప్రాణః = ప్రాణవాయువు, ప్రణీయతే = నడుపబడుచున్నదో, త్వమ్ = నీవు, తదేవ = ఆతత్త్వమునే, బ్రహ్మ = బ్రహ్మతత్త్వమునుగా, విద్ధి = తెలిసికొనుము. య దిదమ్ = ఏయీప్రతీకమును, ఉపాసతే = భక్తు లుపాసించుచున్నారో, ఇదమ్ = ఈప్రతీకము, న = బ్రహ్మతత్త్వము కాదు.

తాత్పరము:- ఏతత్త్వము ప్రాణవాయువుచేత జీవించుటలేదో, ఏతత్త్వము చేత ప్రాణవాయువు నడుపబడుచున్నదో, దానిని బ్రహ్మతత్త్వమునుగా తెలిసి కొనుము. భక్తు లుపాసించు ప్రతీకము బ్రహ్మతత్త్వము గాదు.

## వివరణము

ప్రథమమంత్రమునం దేదేవుని ప్రేరణచే మనఃప్రాణవాక్చక్షుః శ్రోత్రములు స్వకృత్యనిర్వాహణసమర్థము లగుచున్న వను శిష్యప్రశ్న

ప్రతిపాదింపబడినది. రెండవమంత్రమునందు సర్వేంద్రియప్రేరకుడు పరమేశ్వరుడే యనియును, నీయింద్రియసంబంధమును వదలి యుపాసకులు ప్రకృష్టదశను పొంది మరణరహితు లగుచున్నారనియును ప్రతిపాదింపబడినది. మూడవమంత్రమునం దీశ్వరతత్త్వజ్ఞానమున మనఆదులకు సామర్థ్యము లేదనియును, ఆయీశ్వరతత్త్వ మనుభూతజగత్తుకంటెను, అననుభూతజగత్తుకంటెను భిన్నముగా నున్నదనియును ప్రతిపాదింపబడినది. ఈవిషయమే నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది మంత్రములందు వివరింపబడుచున్నది.

నాలుగునుండి యెనిమిదివఱకును నైదుమంత్రములందును వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్రములకు పరమేశ్వరతత్త్వజ్ఞానమున సామర్థ్యము లేదనియును, వాగాదులు పరమేశ్వరప్రేరణచేతనే స్వకృత్యనిర్వహణ సమర్థము లగుచున్నవనియును ప్రతిపాదింపబడినది.

ఈయైదుమంత్రములందును 'త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం య దిద ముపాసతే' అనునది మకుటవాక్యముగా నున్నది. ఈ వాక్యమునందలి త దేవ బ్రహ్మ త్వం విద్ధి = నీ వాతత్త్వమునే బ్రహ్మతత్త్వమునుగా తెలిసికొనుము అనునది రెండవమంత్రమునందలి 'స ఉ' అను దానిచే ప్రతిపాదింపబడినవిషయమున కనువాదము.

## ప్రతీకము

ఈమకుటవాక్యమునం దొకక్రొత్తవిషయము ప్రతిపాదింపబడుచున్నది. నేదం య దిద ముపాసతే = భక్తు లుపాసించునది బ్రహ్మతత్త్వము కాదని యీవాక్యమున కర్థము. ఈఘట్టమున భక్తు లుపాసించున దేది? అది బ్రహ్మతత్త్వము కాకపోవుటలో హేతు వేమి? అయిన వా రుపాసించవలసినది దేనిని? అను ప్రశ్న లుపస్థితము లగుచున్నవి.

1. ముముక్షు వుపాసించున దేది?

ప్రథమమున ముముక్షువు లనగా నెవరో, వారు దేని నుపా సించుచున్నారో, ఉపాసనాప్రయోజన మేమో వివరించినగాని యీ ప్రశ్నకు సమాధానము చక్కగా నవగతము కాదు.

మోక్తు మిచ్ఛవః ముముక్షవః = విడివడుటకు గోరినవారు ముముక్షువులు. దేనినుండి విడివడుటకు ? 'మృత్యోర్ముక్షీయ' అను త్రియంబకమంత్రభాగము ముముక్షువు లనగా మృత్యువునుండి విడివడ గోరినవా రని ప్రతిపాదించుచున్నది.

స విశ్వకృ ద్విశ్వవి దాత్మయోని
ర్జః కాలకారో గుణీ సర్వవిద్యః
ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః
సంసారబంధస్థితిమోక్ష హేతుః

అను శ్వేతాశ్వతరమంత్రము సంసరణబంధమునుండి విడిపించు వాడు పరమేశ్వరుడని ప్రతిపాదించుచున్నది. సంసరణ మనగా జనన మరణములు. జనన మనగా జీవునకు శరీరసంబంధము. మరణ మనగా ప్రాణత్యాగము. శరీరసంబంధ మనగా స్థూలసూక్ష్మరూపశరీరద్వయ సంబంధము. మరణ మనగా స్థూలశరీరత్యాగము.

ఈ రెండును - స్థూలసూక్ష్మములు - ప్రథమమున నొకేపర్యాయము ప్రాప్తించుచున్నవి. కాని జన్మాంతమున నీ రెండును నొకే పర్యాయము విడుటలేదు. ప్రతిజన్మాంతమునందును స్థూలశరీరము మాత్రము విడివడుచున్నది. కాని సూక్ష్మము జీవుని వెంటనంటియే యుండును. ఈ విషయము 'ప్రాణ ముత్క్రామంతం సర్వే ప్రాణా హ్యనూత్క్రామంతి' అను వాక్యముచే తెలియుచున్నది. కారణము జన్మద్వయమధ్యమున నుత్తరలోకములందు కర్మానుభవమునకై భూత సూక్ష్మపరిష్వంగ మావశ్యక మగుటయే. ఇయ్యది యుపాసనాప్రీతుడైన పరమేశ్వరునియనుగ్రహమువలనగాని వదలదు. కావున ముముక్షు వనగా సూక్ష్మశరీరమునుండి విడివడగోరినవా డని తేలుచున్నది.

స్థూలశరీరముమాత్రము ప్రతిజన్మయందును ప్రారబ్ధభోగావసానమున నవశముగ దానియంతట నదియే విడిపోవుచున్నది. సూక్ష్మశరీరముమాత్ర ముత్తరలోకకర్మానుభవమునకై వెంటనంటియే యుండును. దీనిని వదలుటకై

ఈశం తం జ్ఞాత్వా అమృతా స్తే భవంతి

ఈశ్వరోపాసనము గావింపవలయును. అయిన నీయుపాసన మేవిధముగ గావింపవలయును ?

క్షరం ప్రధాన మమృతాక్షరగ్ం హరః
క్షరాత్మానా వీశతే దేవ ఏకః
త స్యాభిధ్యానా ద్యోజనా త్తత్త్వభావా
ద్భూయ శ్చాంతే విశ్వమాయానివృత్తిః

జీవజగత్తులను శాసించువా డీశ్వరు డనియును, ఆయీశ్వరుని ధ్యానించుటవలనను, శరీరమున ధరించుటవలనను, యీశ్వరుడగుటవలనను విశ్వమాయానివృత్తి యగునని శ్వేతాశ్వతరము ప్రతిపాదించుచున్నది. విశ్వమాయానివృత్తి యనగా కృత్స్నజగత్సంబంధనివృత్తి. అనగా సర్వప్రపంచసంబంధము తొలగిపోవుట యని యర్థము. అధిష్ఠానమగు శరీరసంబంధమును, అనుభవసాధనమగు శరీరభిన్నజగత్తుయొక్కసంబంధము నను విషయము విశ్వశబ్దముచే సూచింపబడుచున్నది. 'మాయాం తు ప్రకృతిం వింద్యాత్' అను శ్వేతాశ్వతరవాక్యమువలన మాయాశబ్దమునకు ప్రకృతి=జగత్తని యర్థము.

## యోజనశబ్దార్థము

ఈరెండువిధములైన జగత్సంబంధములు వదలవలయునన్న నీశ్వరుని యోజనధ్యానతత్త్వభావము లావశ్యకములు. ఇక యోజనధ్యానతత్త్వభావము లనగా నేమియో గాంతము. యోజన మనగా పరమే

శ్వరసంబంధము కలిగించుకొనుట. ఇయ్యది రెండురకములు – స్థూల శరీరముతో, సూక్ష్మశరీరముతో. సూక్ష్మశరీర మనగా త్వగాదిపంచ జ్ఞానేంద్రియ, వాగాదిపంచకర్మేంద్రియ, మనస్సులు. ఇందు మనస్సు ప్రధానమైనదిగాన సూక్ష్మశరీరముతో సంబంధ మనగా మనస్సుతో సంబంధ మని యర్థము. అనగా మననముచేయుట. ఈ మననము చేయుట యీమంత్రమునందు ధ్యానశబ్దముచేత ప్రతిపాదింపబడినది. ఇక స్థూలశరీరసంబంధవిషయము గాంతము. స్థూలశరీరము భౌతికము. చేతనుడగు పరమేశ్వరునకు భౌతికమగు స్థూలశరీరముతో సంబంధము కలిగించుట యెట్లు? ఇయ్యది మహాజటిలమగు సమస్య.

ముముక్షుతకు పూర్వము ముముక్షువునకు జగత్సంబంధమేగాని యన్యము లేదు. పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ =లోకములు కర్మవ్యాప్తములని నిర్ణయించికొని యనగా జననమరణాపాదకములని యెంచి నిర్విణ్ణుడైనాడు. తద్విజ్ఞానార్థం స గురు మే వాభిగచ్ఛేత్ =కర్తవ్యవిషయపరిజ్ఞానమునకై గురువు నభిగమించినాడు. ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ = గురువు బ్రహ్మోపాసనావిషయము నుపదేశించినాడు.

దహ్రం విపాపం పరవేశ్మభూతం
హృత్పుండరీకం విరజం విశుద్ధమ్
తత్రాపి దహ్రం గగనం విశోక
స్తస్మి న్య దంత స్త దుపాసితవ్యమ్

దహరపుండరీకాంతర్వర్తియగు పరమేశ్వరు నుపాసింపు మని నాడు. దహర మన నేమియో తెలియదు. దానిలో నే మున్నదియో, దాని నుపాసించుట యెట్లో తెలియదు. ఇదియే ప్రస్తుతసమస్య. 'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తం చ' =పరమేశ్వరునకు మూర్తమనియును, నమూర్త మనియును రెండురూపము లున్నవి. పరమేశ్వరుని మూర్తరూపము జగత్తు. ఈవిషయము

శక్త్యాది చ పృథివ్యంతం జగ దేత చ్చరాచరమ్
విగ్రహం దేవదేవస్య పరమేశస్య శూలినః

అను శివపురాణవాక్యముచే ప్రతిపాదింపబడినది. ఇచట తనకొలబద్ధ నుపయోగించినాడు. వ్యక్తియొక్క యనుగ్రహమును గోరి యాతని యనుగ్రహమును పొందుట లోకపరిపాటి. జీవుడు, శరీర మనుసమష్టికే వ్యక్తి యని వ్యవహారము. అనుగ్రహింపవలసినది జీవుడు. కాని సేవించునది యాతనిశరీరమును. అట్లే పరమేశ్వరుని శరీరమగు జగత్తు నారాధించిన పరమేశ్వరానుగ్రహము గలుగునను నిర్ణయమునకు వచ్చినాడు. అయిన జగదారాధన గావించుట యెట్లు? వ్యక్తి నారాధించుటలో యావద్వ్యక్తి నారాధించుటలేదు. పాదపూజమాత్రము గావించుట గమనించినాడు. అట్లే జగద్భాగమగు నొకవిగ్రహము నారాధించుట కారంభించినాడు. ఈవిగ్రహమునకే ప్రతీక మని వేదాంతవ్యవహారము. ఈవిమర్శవలన భక్తు లుపాసించునది ప్రతీక మనగా జగత్తని తేలుచున్నది. అనగా జగద్భాగమగు విగ్రహము.

2. అది బ్రహ్మాత్త్వము కాకపోవుటలో హేతు వేమి?

అనుగ్రహము జీవునికి సంబంధించినది. అనుగ్రహింపవలసిన జీవుడు శరీరము కా దనుట యనుభవసిద్ధమగువిషయము. జీవయుక్త మగు శరీరమును పూజింతుముగాని జీవాపేతమగు శరీరమును పూజింపముగదా? జీవుడు శరీరము కానట్లు విగ్రహము అనగా జగత్తు పరమేశ్వరుడు గాడు. తా నపునరావృత్తముగ సాయుజ్యము నందవలసినది పరమేశ్వరునియందు. మఱియు నాపరమేశ్వరుడు తనయందలి యనుగ్రహముచే

అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః

తన కధిష్ఠానమైన యీశరీరమునందే, తానున్న హృదయమునందే

అంగుష్ఠమాత్రుడై యున్నాడు. కావున త దుపాసితవ్యమ్ = దాని నుపాసించుట కారంభించినాడు. ఈవిమర్శచే ప్రతీకము పరమేశ్వరుడు కా దనియును, తదారాధనము హార్దబ్రహ్మోపాసనమునకు సోపానము మాత్రమే యనియును, కర్తవ్యము హార్దబ్రహ్మోపాసన మనియును తెలుచున్నది.

ఓమ్

# కేనోపనిషత్తు

## ద్వితీయఖండము - ప్రథమమంత్రము

యది మన్యసే సువే దేతి దభ్ర మే వాపి
నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్
య దస్య త్వం య దస్యచ దేవే ష్వథ ను
మీమాంస్య మేవ తే మన్యే విదితమ్

అర్థము :- అహమ్ = నేను, సువేద = బ్రహ్మయొక్క రూపమును చక్కగా తెలిసికొనుచున్నాను, ఇతి = అని, త్వమ్ = నీవు, మన్యసే యది = తలంచితివేని, అస్య = ఈబ్రహ్మయొక్క, యత్ = ఏరూపము, త్వమ్ = నీవు, అసి = అగుచున్నావో అస్య = ఈబ్రహ్మయొక్క, యత్ = ఏరూపము, దేవేషు = దేవతలయందు, అస్తి = ఉన్నదో, తత్ = ఆ, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, రూపమ్ = రూపమును, త్వమ్ = నీవు, నూనమ్ = నిశ్చయముగా, దభ్ర మేవాపి = అల్పముగానే, వేత్థ = తెలిసికొను చున్నావు. అథ ను = పిమ్మట, తే = నీయొక్క, విదితమ్ = తెలిసికొననదానిని, మీమాంస్య మేవ = విచారింపదగినదానినిగానే, మన్యే = తలంచుచున్నాను.

తాత్పర్యము :- పరమేశ్వరతత్త్వమును చక్కగా నేను తెలిసికొను చున్నా నని తలంచుచుంటివేని నీవు తెలిసికొనినది చాల స్వల్పము. నీరూప మును, దేవతలరూపమును చూచి నీవు తెలిసికొనినది యావద్బ్రహ్మరూపము గాదు. కావున యావద్బ్రహ్మరూపమును చక్కగా విచారించి తెలిసికొనవలెను.

## వివరణము

పూర్వఖండమునందు జీవునకు జీవనహేతువులై బహిఃప్రపంచ సంబంధమున సాధనములైన ప్రాణవాఙ్మనశ్చక్షుఃశ్రోత్రములు సర్వ జగచ్ఛాసకుడగు పరమేశ్వర ప్రేరణచేతనే స్వకృత్యనిర్వహణసమర్థము లగుచున్న వనియును, ముముక్షువు లుపాసించు ప్రతీకము బ్రహ్మ తత్త్వము గా దనియును నిరూపింపబడినది. ఈయధ్యాయమున బ్రహ్మ స్వరూపవిషయము వివరింపబడుచున్నది.

సువేద :- బాగుగా తెలిసికొనుచున్నా నని యర్థము.

సు అనునుపసర్గకు సుష్ఠు = బాగుగా, సమగ్రముగా నని యర్థము. సువేద=బ్రహ్మయొక్క రూపమును సమగ్రముగా తెలిసి కొనుచున్నా నని యర్థము. ఇక తెలిసికొనుటలో సామగ్ర్య మేమో విచారింతము. విదధాతువు సకర్మకము. తెలిసికొనుట దేనిని? సాధ నము లేవి? సాధనములు త్వగాదిపంచజ్ఞానేంద్రియములు. ఈసాధన ములతో శబ్దస్పర్శరూపరసగంధము లను విషయములను తెలిసికొను చున్నాడు. తనకును, తనయింద్రియములకును నధిష్ఠానము శరీరము. పరిశోధించి శరీరవిషయము సమగ్రముగా తెలిసికొనినాడు. శరీరము తనది. తత్పోషణమునకు కావలసిన పరికరములు తా ననుభవించు చున్నవి తన వనుకొనినాడు. విచారింపగా తనవి కానివి, తనయను భవమునకు రానివి యనంతముగ నున్న వనియును, నయ్యవియును వీనివంటివే యనియును తెలిసికొనినాడు. కాని తనయిచ్ఛకు వ్యతిరేక ముగ తనవిషయములో జరుగుచున్నపరిస్థితిని గాంచినాడు. తనవారు మరణించుటచే తానును నవశముగ మరణింపక తప్పదను నిశ్చయము నకు వచ్చినాడు. శరీరముండియు, పరికరము లుండియు ననుభవించుట కవకాశము లేనిపరిస్థితిని గమనించినాడు. ఉన్నంతవరకు నేదియోవిధ ముగ ననుభవించి మరణింత మనుకొనినాడు. ఇయ్యదియే యీతడు సమగ్రముగా తెలిసికొనిన విషయము.

ఇక నాతనిసమగ్రపరిజ్ఞాన మసమగ్రమని మంత్రమునందు ప్రతి పాదింపబడుచున్నది. తా నెవరు? తా ననగా నేమి? తన కీపప్రంచముతో సంబంధ మెట్లు గలిగినది? తానై కలిగించికొనినాడా? తనకన్న భిన్నముగానున్న యీసర్వాంగసుందరమగు శరీరము నెవరు నిర్మించినారు? తనకు తెలియకపూర్వమే తన కధిష్ఠానమగు నీశరీరమును నిర్మించిన దెవరు? తలిదండ్రులందమన్న వారును తనవంటివారేగదా? ఇట్టివిచిత్ర నిర్మాణము అల్పులును, నల్పజ్ఞులునగువారివలన నగునా? అయిన నానిర్మాత యెవరు? ఆత డెట్టివాడు? ఆతనినివాస మెచట? ఆతనికిని, తనకునుగల సంబంధ మేమి? ఏయుద్దేశముతో తన కీశరీర మిచ్చినాడు? ఆతనియుద్దేశము నెరవేరుట యెట్లు? తదుద్దేశపూర్తి తనవలన నగునా? ఈపనిలో నాతడు సాయపడునా? ఆతనిసాయము నపేక్షించిన తా నేమి గావింపవలెను?

ఎంతగంభీరమగు, జటిలమగు సమస్య! ఈసమస్యను విడదీయుటలో నాజ్ఞాన మెంత? నాసామర్థ్య మెంత? ఇదియంతయును పరికించిన నొకమహాశక్తిమంతుని శాసనమునకు లోబడి యీసమస్తమును జరుగుచున్నదని తేలుచున్నది. ఒక్కపర్యాయ మాతనిదర్శన మైన బాగుండును? నాయల్పజ్ఞతను వివరించి యాసర్వజ్ఞునివలన నేనును సర్వజ్ఞుడ నగుట కవకాశ ముండునుగదా?

ఇందేవిషయమునకును నెంతగ నాలోచించియు పరిష్కారమార్గము గనుగొనలేని నేను ఎంతగ విజ్ఞుపిగితిని! ఈవిషయమున నాజ్ఞానము దభ్రమే వాపి=చాల కొద్ది దనుటలో సందేహము లేదు.

## ద్వితీయ మంత్రము

నాఽహం మన్యే సువే దేతి నో న వే దేతి వేద చ
యో న స్త ద్వేద త ద్వేద నో న వే దేతి వేద చ

అర్థము :- అహమ్ = నేను, సువేదేతి = బాగుగా తెలిసికొనుచున్నాను అని, న మన్యే = తలంచను. న వేదేతి = ఎఱుంగ ననియును, నో వేద చ = ఎఱుంగను. నః = మాలో, యః = ఎవడు, తత్ = ఆబ్రహ్మతత్త్వమును, వేద = తెలిసికొనుచున్నాడో, సః = అతడు, తత్ = ఆతత్త్వమును, వేద = తెలిసికొనుచున్నాడు. న వేదేతి = ఎఱుంగ నని, నో వేద = ఎఱుంగను.

తాత్పర్యము :- నాకు బాగుగా తెలియునని తలంచను, నాకు తెలియదనువిషయముగూడ తెలియదు. మాలో తెలిసినవానికిమాత్రమే తెలియును. ఇప్పటికిని నా కేమియును తెలియ దను విషయముగూడ తెలియదు.

## వివరణము

పూర్వమంత్రమునందు ముముక్షువునకు తెలిసినది చాల స్వల్పమని ప్రతిపాదింపబడినది. ఈమంత్రమునందు ముముక్షువునకు తెలిసినది చాల స్వల్పమనియును, తెలియదను విషయముగూడ నాతనికి తెలియ దనియును, తెలిసినవారు చాల నరుదుగా నుందు రనియును ప్రతిపాదింపబడుచున్నది.

## తృతీయమంత్రము

యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్

అర్థము :- అవిజ్ఞాతమ్ = తెలిసికొనబడనిదానిని బ్రహ్మతత్త్వమును, విజానతామ్ = తెలిసికొనుచున్నట్టియు, విజ్ఞాతమ్ = తెలిసికొనబడిన జగత్తును, అవిజానతామ్ = తెలిసికొననట్టివారిలో, యస్య = ఎవనికి, అమతమ్ = తెలియనిది కలదను భావము కలదో, తస్య = అతనికి, మతమ్ = తెలియును. యస్య = ఎవనికి, మతమ్ = తెలియునో, సః = అతడు, న వేద = ఎఱుంగడు.

తాత్పర్యము :- తెలియబడని బ్రహ్మతత్త్వమును తెలిసికొనగోరుచు, తెలిసిన జగత్తును మరచుచున్నవారిలో నెవనికి తెలియబడని తత్త్వము కల దను భావము కలదో అతనికి కొంతవరకు తెలియును. ఎవనికి తెలియునను గర్వము గలదో వాని కేమాత్రమును తెలియదు.

## వివరణము

పూర్వమంత్రమునందు ముముక్షువునకు తెలిసినది చాల స్వల్ప మనియును, తెలిసినవారు చాల నరుదుగ నుందు రనియును, ఇప్పటికిని తనకు తెలియ దనువిషయముగూడ తెలియ దనియును ప్రతిపాదింప బడినది. ఈమంత్రమునందు తెలియబడని బ్రహ్మతత్త్వమును తెలిసి కొనగోరుచు, తెలిసిన జగత్తును విడువగోరుచున్నవారిలో నెవనికి తెలి యబడని తత్త్వము కలదనుభావము కలదో ఆతనికి కొంతవరకు తెలియు ననియును, నెవనికి తెలిసినదే సమస్తము ననుభావము కలదో వాని కేమియును తెలియ దనియును నిరూపింపబడినది.

అవిజ్ఞాతం విజానతామ్ - తెలియబడని బ్రహ్మతత్త్వమును తెలిసికొనగోరువా రని యర్థము.

ముముక్షువు సాయుజ్యము నందవలసినది హార్దబ్రహ్మయందు. ఈవిషయము సమగ్రముగా తెలిసినగాని - హార్దబ్రహ్మయన నేమో, తా నెచట నున్నాడో, ఎటుల సాయుజ్యము నందవలయునో, సాయు జ్యము నందుట కేమి గావింపవలయునో - తనయాశయము నెర వేరదు. ఇయ్యది నెరవేరవలయునన్న విజ్ఞాత మవిజానతామ్ = బాగుగా తెలియబడిన, నిత్యానుభవములోనున్న, వ్యామోహాకమైన జగత్సంబం ధము విడువవలయును. లేనిచో నీజగత్సంబంధమున మున్గితేలుచున్నచో తనయుద్దేశమున కడుగడుగునకు నాటంకములు గలుగుచునేయుండును. కావున క్రమక్రమముగ విజ్ఞాతజగత్సంబంధమును తగ్గించికొనుచు, నవిజ్ఞాతబ్రహ్మసంబంధమును వృద్ధిచేసికొనుచు చివరకు జగత్సంబంధ మును పూర్తిగా వదలించికొని హార్దబ్రహ్మయం దపునరావృత్తముగ లీనమగుటకై యత్నింపవలయును. ఇదియే యుపనిషదధ్యయనమునకు పరమప్రయోజనము.

## చతుర్థమంత్రము

ప్రతిబోధవిదితం మత మమృతత్వం హి విందతే
ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్

అర్థము :— ముముక్షుః = ముముక్షువు, ప్రతిబోధవిదితమ్ = ఉపదేశముచేత తెలిసికొనబడినదియును, మతమ్ = మననము చేయబడిన, అమృతత్వమ్ = మరణరాహిత్యమును, విందతే హి = పొందుచున్నాడు. ఆత్మనా = శరీరముచేత, వీర్యమ్ = తేజస్సును, విందతే = పొందుచున్నాడు. విద్యయా = ఉపాసనచేత, అమృతమ్ = శివుని, విందతే = పొందుచున్నాడు.

తాత్పర్యము :— ముముక్షువు గురూపదేశముచే విషయపరిజ్ఞానము కలిగి, కలిగిన జ్ఞానమును మననము చేయుచు మరణరహితస్థితిని పొందుచున్నాడు. శరీరముచే ననగా శారీరకకర్మలచే వీర్యమును అనగా కర్మాచరణపాటవమును, ఉపాసనచే శివుని పొందుచున్నాడు.

## వివరణము

పూర్వమంత్రమునందు తెలియనివిషయమును తెలిసికొనుచు, తెలిసినదానివిలువను నిర్ణయించికొనుచు బ్రహ్మాతత్త్వము కల దను భావము నేమరక తెలిసిన జగత్తును సాధనముగా వినియోగించుకొనుచు సాయుజ్యమునకై యత్నింపవలయునని నిరూపింపబడినది. ఈమంత్రమునం దాప్రయత్నమున గురూపదేశమననము లావశ్యకము లనియును, శారీరకకర్మల నాచరించుచు పాటవమును గాపాడుకొనుచు శివు నుపాసింపవలయునని ప్రతిపాదింపబడుచున్నది.

## గురూపదేశావశ్యకత

ప్రతిబోధవిదితమ్ — గురూపదేశముచే తెలిసికొనబడిన యః యర్థము.

ప్రతిబోధ మనగా నుపదేశము. మానవజీవితమున నామరణ ముపదేశావశ్యకత యున్నది. శైశవమున తలిదండ్రులనుండి అమ్మ

అక్క అను తొక్కు పలుకులు నేర్చుకొనుట, బాల్యమున నక్షరాభ్యాసము, తదుపరి గురుకులవాసము-సంహితాధ్యయనము, పిమ్మట నమృతత్వమునకై ఉపనిషదధ్యయనము ఈప్రకరణమున ప్రతిబోధ మనగా గురుముఖతః ఉపనిషత్ప్రతిపాదితార్థోపదేశము. వివక్షింపబడినది. అయ్యది లేక సరియైన జ్ఞానము కలుగుట యసంభవము. ఈవిషయము ముండకమున 'తద్విజ్ఞానార్థం స గురు మే వాభిగచ్ఛేత్' అనుమంత్రముచే ప్రతిపాదింపబడినది.

గురూపదేశము లేనిది యెన్నిజన్మలకైనను అమృతత్వప్రాప్తి విషయకపరిజ్ఞానము కలుగుట యసంభవము. కారణము ఏజన్మయందైనను ముముక్షుతాపర్యంత మావశ్యకమైన జ్ఞానము కలుగుట కవకాశ మున్నది. కాని ముముక్షుప్రాప్యవస్తుసంబంధిజ్ఞానముగాని, తత్ప్రాప్తిమార్గమునకు సంబంధించిన జ్ఞానముగాని కలుగుట కవకాశము లేదు.

మతమ్ — మననము చేయబడిన యని యర్థము.

మననము చేయుట యనగా జ్ఞాతవిషయమును మరువకుండుటకై యావృత్తి చేయుట. శ్రవణమనననిదిధ్యాసనములలో మననము రెండవది. ఇంటికి పునాది, గోడలు, కప్పువంటివి సాయుజ్యమునకు శ్రవణమనననిదిధ్యాసములు. పూర్ణాదిశబ్దభవము పునాది యనుశబ్దము. పూర్ణాది యనగా సమగ్రము, సమర్థము నగు నాది యని యర్థము. పునాది గట్టిగ నున్నగాని దానిమీద నిర్మించిన యిల్లు చాలకాలము వరకు నిలువదు. తరువాతివి గోడలు. పునాది గట్టిగ నుండి గోడలు గట్టిగ లేకున్నను యిల్లు కూలిపోవును. కప్పును నంతియే. ఈమూడును దృఢముగ నున్నంతవకే యిల్లు నివాసయోగ్యముగ నుండును.

శ్రవణము సక్రమముగ గావించిననే, సరియైన గురువునొద్ద గావించిననే చక్కని విషయపరిజ్ఞానము గలుగును. తాపీమేస్త్రీ సమ

ర్ఢమైననే పునాదినిర్మాణము సరియైనస్థితిలో నుండును. తరువా గావింపవలసినది మననము. ఇది యింటికి గోడలవంటిది. గోడలు కప్పు కాధారమైనట్లు నిదిధ్యాసనమున కిది యాధారమగుచున్నది. శ్రవణమువల తెలిసినవిషయము మననమువలన స్థిరత నందినగాని నిదిధ్యాసనము కవకాశ ముండదు. గట్టిపునాదిమీద గోడలును గట్టిగ నున్నగాని కప్పు నిలువదు. కావుననే ప్రతిబోధవిదితమైన విషయము అనగా గురూపదేశమువలన తెలిసికొనిన విషయము మననము = ఆవృత్తి చేయబడిన గాని, అభ్యసింపబడినగాని నిదిధ్యాసనమున కాధారమై సాయుజ్యమున కుపయోగింపదు.

అమృతత్వమ్ — అమృతత్వ మనగా మరణరాహిత్య మని యర్థము.

ఈ విషయము పీఠికయందు వివరింపబడినదిగాన ప్రకృత మను సరింతము.

ఆత్మనా విందతే వీర్యమ్ — శరీరముచేత వీర్యమును పొందు చున్నా డని యర్థము.

ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని

అను నమరకోశవాక్యమువలన ఆత్మ యనగా శరీరమని యర్థము. జీవుడు శరీరవిశిష్టుడయియే కర్తృత్వవిశిష్టు డగుచున్నాడు. వీర్య మనగా శక్తి. ఇయ్యది శరీరమును పోషించుకొనుటవలన నుత్పద్యమానమై పోషణ జరుగుచున్నంతవరకును స్థిరత్వము నందుచు స్వకృత్యనిర్వాహణ సమర్థమునుగా జేయుచుండును. ఈశక్తికే ఓజ స్సని ఆయుర్వేదవ్యవహారము. ఇయ్యది శరీరపోషణమునకును, విహితకర్మాచరణమునకును, జీవితపరమప్రయోజనమగు సాయుజ్యప్రాప్తియందును నత్యంతప్రధానమైనది. కావుననే 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' అనినారు శిష్టులు. మరియును నుపనిషత్తులలో విద్య యనగా నుపాసనతోపాటు శరీరమునకు ప్రధానస్థాన మిచ్చుట కిదియే కారణము.

ఇంకొకవిశేషము — జీవునకు శరీరసంబంధము కలిగించుటలో పరమేశ్వరునియుద్దేశము జీవుడు సాయుజ్యము నందుటయే. ఇందు కయియే సర్వాంగసుందరమగు మానవజన్మ మిచ్చినాడు. అందును వివేకయుతమగు జన్మ మిచ్చినాడు. వివేకయుతమగు నీజన్మమును సాధనముగా గొని తరింపక శరీరమును దుర్వినియోగము గావించి సంసార సముద్రమున మున్గితేలుచు దుఃఖముల ననుభవించుచో నయ్యది జీవాపచారముమాత్రమే యగును. వివేకము నుపయోగించికొని భోగలంపటుడు గాక మితభోగియై జన్మసార్థక్యము నందుటకై యత్నించుట వివేకముయొక్క పరమప్రయోజనము. కావున మానవుడు ధర్మసాధనమైన శరీరమును జాగ్రత్తగ పోషించికొనుచు వీర్యయుతమునుగా జేసికొని శరీరప్రాప్తిపరమప్రయోజనమగు సాయుజ్యము నందుట ప్రధానధర్మము.

విద్యయా విందతేఽమృతమ్ — ఉపాసనచేత నమృతు ననగా శివుని పొందుచున్నాడని వాక్యార్థము.

విద్య యనగా నుపాసన. విద జ్ఞానే యనుధాతువునుండి నిష్పన్నమైన విద్యాశబ్దమునకు జ్ఞాన మని సామాన్యార్థము. కాని వేదాంతములయం దుపాసన మని యర్థము. ఛాగపశున్యాయము ననుసరించి సామాన్యవాచియగు జ్ఞానశబ్దమును విశేషవాచియగు నుపాసనయందన్వయించుట శిష్టసంప్రదాయము. ఉపాసన మనగా శివ సమీపమున నుండుట యని యర్థము. బాహ్య మనియును, నాంతర మనియును నుపాసనము రెండు విధములు. బాహ్యోపాసన మనగా నీశ్వరుని మూర్తిరూపమగు లింగము నారాధించుట. ఆంతరోపాసన మనగా హార్దబ్రహ్మరూపముననున్న యీశ్వరుని ధ్యానించుట. బాహ్యోపాసన మాంతరోపాసనమునకు సోపానమువంటిది. ముముక్షువునకు ప్రథమమున నాంతరోపాసమున సామర్థ్యముండుట యసంభవమని యెంచియే మొదట బాహ్యోపాసనము విధింపబడినది. ఈవిధముగ స్వార్థరహి

తుడై బాహ్యోపాసన గావించుచు క్రమముగ నాంతరోపాసనమున లబ్ధప్రవేశుడై ముముక్షువు అమృతుడు=మరణరహితు డగుచున్నాడు. ఈవిషయము

'త్రియంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్'
'దహ్రం విపాపం పరవేశ్మభూతం
హృత్పుండరీకం విరజం విశుద్ధమ్
తత్రాఽపి దహ్రం గగనం విశోక
స్తస్మి న్యదంత స్తదుపాసితవ్యమ్'

ఇత్యాద్యనంతశ్రుతులచే ప్రతిపాదింపబడుచున్నది.

## అకర్తృత్వవాదనిరాసము

కాని యొకసంప్రదాయమువారు అకర్త్రాత్మప్రతిపత్తిరూపజ్ఞానముచేతనే కైవల్యము సిద్ధించునని ప్రతిపాదించుచున్నారు. ఇయ్యది యుపనిషత్సంప్రదాయవిరుద్ధము. కేవలజ్ఞానముచేతనే 'నాహం కర్తా'=నేను కర్తను గా ననుజ్ఞానముచేతనే కైవల్యము సిద్ధించుచో నుపాసనావిధాయకశ్రుతు లన్నియును వ్యర్థము కావలసివచ్చును. అయ్యది యిష్టాపత్తియే యన్న విచారింతము.

నాఽహం కర్తా=నేను కర్తను గాను అనుట యెందుకు? ఈవాక్యమునకు ప్రసక్తి యేమి? కర్తయైనవాడు కర్తను గా ననుకొనుట విరుద్ధము. కర్త గానివాడు కర్తను గా ననుకొనుట వ్యర్థము. రాజు గానివాడు రాజు గా ననుకొనుటలో నుద్దేశ మేమి? ఆత డేవిధముగను రాజు గాడు. కావున నియ్యది వ్యర్థప్రలాప మగును. రాజు గావలెనను సంకల్ప ముండి నేను రాజు గా ననుటలో కొంత యర్థ ముండవచ్చును. ఈసంకల్పము గలిగినప్పటినుండియు నాత డందుకై ప్రయ

త్నించిన రాజు గావచ్చును. కాకపోవచ్చును. కాని యత్నించుటలో దోష మేమియును లేదు.

నాఽహం కర్తా అను వాక్యమునందలి అహంశబ్దమున కర్థ మేమి? అహమ్ అనునది తన నుద్దేశించి చెప్పునప్పు డుపయోగింపబడు సర్వనామము. వేదాంతములయందు జీవ, ఈశ్వర, జగత్తులను మూడే తత్త్వములు ప్రతిపాదింపబడినవి. అనుభవమునందును నీమూడేతత్త్వ ములు ప్రధానముగా గన్పడుచున్నవి. ఇందు జగత్తు జడముగాన తద్వి షయము విచారింప నక్కర లేదు. ఇక జీవేశ్వరులవిషయము గాంతము.

ప్రథమమున జీవవిషయము గాంతము. జీవునకు కేవలస్థితిలో ననగా శరీరసంబంధము కలుగుటకుపూర్వము కర్తృత్వము లేదు. కావున జ్ఞాతృత్వమును లేదు. జ్ఞాతృత్వరూపకర్తృత్వము లేదుగాన నాస్థితిలో నాఽహం కర్తా యనుటయే సంభవింపదు. ఇక నీశ్వరవిష యము గాంతము. 'తత్సృష్ట్వా త దే వానుప్రావిశత్' ఇత్యాదిశ్రు తులు పరమేశ్వరునకు స్రష్టృత్వరూపకర్తృత్వమును ప్రతిపాదించు చున్నవి.

ఇచట నింకొకవిషయము ప్రధానముగా గమనింపవలయును. జీవుడు భౌతికశరీరవిశిష్టుడైనట్లు పరమేశ్వరుడును జగచ్ఛరీరవిశిష్టుడే. ఈవిషయము

> శక్త్యాది చ పృథివ్యంతం జగ దేత చ్చరాచరమ్
> విగ్రహం దేవదేవస్య పరమేశస్య శూలినః

అను శివపురాణవాక్యముచే ప్రతిపాదింపబడుచున్నది. మరియును శరీర స్థానీయమైన జగత్తునకు సృష్టిస్థితిసంహారములు గావించుచు కర్తృత్వ విశిష్టు డగుచున్నాడు. కాని యింతియే విశేషము. జీవుడు కర్తృత్వో పాదకశరీరవిశిష్టుడై పుణ్యాపాపరూపకర్మల నాచరించి తత్ఫలము ననుభ వించుచున్నాడు. కాని పరమేశ్వరుడు సృష్ట్యాదికర్మల గావించుచును ఫలభాక్కు గాడు. ఈవిషయము

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రేకః పిప్పలగ్ం స్వా ద్వ
త్త్యనశ్న న్నన్యోఽభిచాకశీతి

అను ముండకమంత్రముచే ప్రతిపాదింపబడుచున్నది. కావున జీవేశ్వరులకు కర్తృత్వరూపధర్మము సమానమైనను ఫలాదనమున తేడా యున్నదని తెలుచున్నది. ఈవిమర్శచే నీశ్వరునివిషయమున నాఽహం కర్తా యనువాక్యమునకు ప్రసక్తియే లేదని తెలుచున్నది.

జీవుడు శరీరవిశిష్టుడై కర్త యగుచున్నాడు. శరీరసాహిత్యమున్నంతవరకును కర్తృత్వమును, తత్ప్రయుక్తమైన కర్మఫలాదనమును తప్పవు. కర్తృత్వాపాదనమున శరీరము సాధన మగుచున్నది. కాని యొకవిశేష మున్నది. శరీరరూపాధిష్ఠానమున నున్నను కర్మకరణసాధనమగు శరీరమును వినియోగించికొని కర్మల నాచరింపకున్న కర్తృత్వమును, తత్ప్రయుక్తమైన ఫలాదనమును నుంకవు

శరీరరూపాధిష్ఠానమున నుండియును కర్మల నాచరింపకుండ నుండుటకు వీ లున్నదా? ఇన్యదియే ముముక్షువుయొక్క పరమాశయము. శరీర ముండగనే కర్తృత్వబాధమునుండి విడివడుస్థితికి – నాఽహం కర్తా – యనుస్థితికి రావలయునని యాతని సంకల్పము. ఇక నీస్థితికి వచ్చుటకు వీ లున్నదేమో గాంతము. యావచ్ఛరీరములో జీవునకు కర్తృత్వమును గలిగించుటలో నత్యంతసన్నిహితమైనది మనస్సు. మనోద్వారా చక్షురాదీంద్రియములద్వారా బహిఃప్రపంచసంబంధము గలుగుచున్నది. అంతటితో కర్తృత్వ మేర్పడుచున్నది. కావున కర్తృత్వాపాదనమున మూలకందమైన మనస్సుతో సంబంధమును గలిగించుకొనుటనుండి విరమించికొనిన జీవుడకర్త యగుటలో సందియము లేదు.

కాని యిది యెంత తేలికగ సాధ్యపడునా? ఫలాపేక్ష యున్నంత వఱకును కర్తృత్వము తప్పదు. ఫలాపేక్షను వీడిన కర్మాచరణముతో సంబంధము వదలును. స్వర్గాదులయందు భోగాపేక్ష లేదుగాన జ్యోతిష్టోమాదులు గావింపకపోవచ్చును. కాని శరీరపోషణము తప్పనిసరి యగుటచే తత్ప్రియుక్తమైన కర్మలైనను చేయక తప్పదుగదా? దాని వలన పుణ్యాపాపసంబంధమును, తద్ద్వారా తదనుభవమును తప్పవుగదా యన్న విచారింతము.

శరీరమునం దాస్థయున్న తత్పోషణమునకై కర్మాచరణమును, తద్ద్వారా పుణ్యాపాపసంబంధమును, తత్ఫలానుభవమును తప్పవు. వాస్తవమే. కాని తదాస్థ లేనిచో నవియేవియును బంధింపవు. కాని జీవునకు శరీరమునం దాస్థ తొలగిపోవుటచే తత్ప్రియుక్తమైన బంధము తొలగవచ్చును. కాని శరీర మున్నదిగదా? జీవున కాస్థ లేకపోవుటచే పోషణవిషయము నాతడు చూడడు. శరీరము జడముగాన పోషణకర్తృత్వము దానియం దనుపపన్న మన్న విచారింతము. వాస్తవమే. ప్రారబ్ధభోగావసానమునగాని జీవునకు స్థూలశరీరసంబంధము వదలదు. అంతవఱకును శరీరపోషణము జరుగుచునే యుండవలయును. ఒకసారి త్రిప్పబడిన కులాలచక్రము కులాలుడు త్రిప్పుట నాపినంతనే యాగక భ్రమణమున నుపయోగింపబడిన శక్తి ననుసరించి తిరుగుచు చివర కాగిపోవును. అట్లే యభ్యాసాతిశయమువలన శరీరమును పోషింపబడుచుండును. చివరకు ప్రారబ్ధభోగావసానమున పండిన యాకు రాలిపోవునట్లు రాలిపోవును. గృహాగమనోన్ముఖుడైన వ్యక్తి గృహాగమనమును సంకల్పించి పాదక్షేపము నారంభించి ప్రయాణమై దారిలో కార్యాంతరాసక్తుడైనను పాదము లాతని నింటికి గొనిపోవుట యనుభవమున నున్న విషయమే.

ఈవిమర్శచే కర్తృత్వవిశిష్టుడగు ముముక్షువు సర్వవిధకర్తృత్వాపగమమునగాని సాయుజ్యార్హత లభింపదని యెంచి యకర్తృత్వసాధనకై ఇంద్రియద్వారా బహిఃప్రపంచసంబంధమును వదలించుకొను

టకై యత్నించును. పరమేశ్వరానుగ్రహము లేనిదే యీసంకల్పము నెరవేరదని యెంచియే ఉపాసన నారంభించి సర్వమును నీశ్వరార్పణ బుద్ధితో నాచరించుట కారంభించినాడు. ఈశ్వరానుగ్రహమునకై యత్నించుచున్నాడుగాన నాతడేయకార్యమును జేయడు. చేసినకర్మల కైనను ఫలము శివానుగ్రహముమాత్రమే యగుటచే నయ్యది బంధకము కాదు. కర్మలు ఫలానుభవాపాదకములైననే కర్తృత్వాపాదకములగును. కావున నీస్థితియందు ముముక్షువు నాఽహం కర్తా యనుట కర్హుడగును. కాని అకర్తాత్మప్రతిపత్తి = నేను కర్తను గాను అను జ్ఞానమాత్రముచే నాతని కొరగున దేమియును లేదు. కావున పరమేశ్వరు నుపాసించుచు తదనుగ్రహమున తరించుటకై యత్నించుట ముముక్షువుల ప్రధానకర్తవ్యము.

## పంచమమంత్రము

ఇహ చే దవేదీ దథ సత్య మస్తి
న చే ది హావేదీ న్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి

అర్థము:- ఇహ = ఈలోకమునందు, ఈజన్మయందు, అవేదీత్ చేత్ = తెలిసికొనినయెడల, అథ = పిమ్మట, ఆవిధముగా తెలిసికొనినతరువాత, సత్యమ్ = పరమేశ్వరుడు, అస్తి = ఉన్నాడు. ఇహ = ఈలోకమునందు, ఈజన్మమునందు, నావేదీచ్చేత్ = తెలిసికొనియెడల, మహతీ = గొప్పదియగు, వినష్టిః = వినాశము, సంభవతి = సంభవించును. ధీరాః = ముముక్షువులు, భూతేషు = పృథివ్యాదిభూతములయందును, భూతేషు = ప్రాణులయందును, విచిత్య = తెలిసికొని, అస్మాత్ = ఈ, లోకాత్ = లోకమును విడిచి, ప్రేత్య = ప్రకృష్టదశను పొంది, అమృతాః = మరణరహితులు, భవంతి = అగుచున్నారు.

తాత్పర్యము:- ఈజన్మ యుండగనే చక్కగా వివేచించి చూచినచో పరమేశ్వరాస్తిత్వము గోచరించును. ఆవిధముగ గమనింపకున్న నాశము తప్పదు.

కావున ముముక్షువులగువారు భూతములవిషయమును, ప్రాణులవిషయమును చక్కగా వివేచించి తెలిసికొని యీలోకసంబధమును వీడి ప్రకృష్టదశను పొంది అమృతులు = మరణరహితు లగుచున్నారు.

## వివరణము

ఇహ చే దవేదీత్ — ఈలోకమునం, దీజన్మయందు తెలిసికొనిన యెడల నని యర్థము.

ఇహ అనునది ఇందు ననునర్థముగల యవ్యయము. ఇందు ననగా నీలోకమునందు, ఈజన్మయందు నని యర్థము. ఈలోకమునం దనగా భూలోకమునం దనియును, ఈజన్మయం దనగా మానవజన్మయం దనియును నర్థము. ఉపనిషత్తులు మానవుల నుద్దేశించి ప్రవర్తింప జేయబడినవిగావునను, మానవేతరజన్మలయం దుపనిషదధ్యయన మనుపపన్నముగావునను నీలోకమునం దీజన్మయం దనున దన్వర్థమే యగుచున్నది.

సత్య మస్తి — పరమేశ్వరు డున్నా డని యర్థము.

'ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్' అను శ్రుతివలన సత్యశబ్దము పరమేశ్వరవాచకము. అస్తీతి సత్ స దేవ సత్యమ్ అని సత్యశబ్దవ్యుత్పత్తి. సత్య మనగా మూడుకాలములందును నుండునది యని యర్థము.

యదా తమ స్త న్న దివా న రాత్రి
ర్న స న్న చాస చ్ఛివ ఏవ కేవలః
త దక్షరం త త్సవితు ర్వరేణియం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ

అను శ్వేతాశ్వతరశ్రుతివలన శివు డొకరుడే మహాప్రళయకాలమునందు విరాజిల్లుచున్నాడని తెలియుచున్నది.

స విశ్వకృ ద్విశ్వవి దాత్మయోని
ర్జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్యః

అను శ్వేతాశ్వతరశ్రుతి సృష్టికర్త శివుడని ప్రతిపాదించు చున్నది. సృష్టిప్రళయములకు మధ్య స్థితి. కావున పరమేశ్వరుడు భూతభవిష్యద్వర్తమానకాలములం దుండువాడని తేలుటచే సత్యశబ్ద మాతనియం దన్వర్థమే యగుచున్నది.మఱియును'బ్రహ్మావిష్ణురుద్రేంద్రా స్తే సంప్రసూయంతే సర్వాణి చేంద్రియాణి సహభూతైః' అను శ్రుతి బ్రహ్మావిష్ణ్వాదిదేవతలు సృష్ట్యంతర్భూతులని. ప్రతిపాదించుచున్నది. కావున సత్యశబ్దము శివైకాంతికమని తేలుచున్నది. మఱియును జగత్తు కాలత్రయవర్తమానమైనను పరిణామ్యముగావునను స్థూలసూక్ష్మస్థితు లను పొందుటచేతను నేకరూపతయావర్తమానుడగు పరమేశ్వరుని యందే సత్యశబ్దము సార్థక్యము నందుచున్నది.

అవేదీత్ చేత్ — తెలిసికొనినయెడల, ఏ మని? తనయల్పత్వ మును, అశక్తత్వమును, పారతంత్ర్యమును, కించిద్జ్ఞత్వమును తెలిసి కొనినయెడల మహత్తును, సర్వశక్తిమత్తును, సర్వతంత్రస్వతంత్రమును, సర్వజ్ఞమునగు నొకతత్త్వ మున్నదని తెలియును.

న చే ది హావేదీ న్మహతీ వినష్టిః — పరమేశ్వరు డున్నాడని తెలిసికొననియెడల నాశము తప్పదని యర్థము.

సర్వజ్ఞత్వాదిగుణయుక్తుడగు పరమేశ్వరునియస్తిత్వమును గమ నించి యాతడే తన కీశరీరమును, తత్పోషణమునకు కావలసిన పదార్థ జాతము ననుగ్రహించినా డనియును, తేన త్యక్తేన భుంజీథాః మా గృధః కస్యస్విద్ధనమ్ = తనయర్హత ననుసరించి యనుగ్రహింపబడిన దానితో తృప్తి నంది పరధనముల కాశింపక 'కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః' యావజ్జీవము విహితకర్మల నాచరించుచున్న

'న కర్మ లిప్యతే నరే' కర్మలు బంధకములుకావని తెలిసికొనిన మహాభ్యుదయమును, కానిచో మహానాశమును తప్పవు.

భూతేషు భూతేషు విచిత్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి - పంచభూతములయొక్కయు, ప్రాణులయొక్కయు ధర్మములను గమనించి యీలోకసంబంధమును వదలి ప్రకృష్టదశను పొంది ధీరు లమృతు లగుదురని యర్థము.

ఈవాక్యము ప్రథమఖండము - ద్వితీయమంత్రవ్యాఖ్యానమున వివరింపబడుటచే ప్రకృత మనుసరింతము.

ఓమ్

# కేనోపనిషత్తు

## తృతీయఖండము - ప్రథమమంత్రము

ఓమ్ బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే, తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయంత, త ఐక్షంతాస్మాక మే వాయం విజయోఽస్మాక మే వాయం మహి మేతి.

అర్థము:- బ్రహ్మహ = పూర్వగ్రంథమునందు సర్వజగత్ప్రేరకుడుగా, శాసకుడుగా ప్రతిపాదింపబడిన పరమేశ్వరుడు, దేవేభ్యః = దేవతలకొఱకు, విజిగ్యే = రాక్షసులను జయించెను. తస్య = ఆ, బ్రహ్మణః = పరమేశ్వరునియొక్క, విజయే = విజయమునందు, దేవాః = ఇంద్రాదిదేవతలు, అమహీయంత = మహిమాన్వితులైరి. తే = ఆదేవతలు, అయమ్ = ఈ, విజయః = విజయము, అస్మాక మేవ = మాకు సంబంధించినదే, అయమ్ = ఈ, మహిమా = గొప్పదనము, అస్మాక మేవ = మాకు సంబంధించినదే, ఇతి = అని, ఐక్షంత = తలంచిరి.

తాత్పర్యము:- సర్వజగచ్ఛాసకుడగు పరమేశ్వరునను గ్రహమువలన దేవాసురయుద్ధమునందు దేవతలు జయించిరి. కాని సర్వానుగ్రాహకుడగు పరమేశ్వరుని మరచి యీవిజయము తమసామర్థ్యమువలననే, తమమహిమవలననే సంభవించిన దని విఱ్ఱవీగిరి.

## వివరణము

ప్రథమఖండమునందు సర్వజగత్ప్రేరకుడును, తద్ద్వారా సర్వ జగచ్ఛాసకుడును పరమేశ్వరు డనియును, ఇంద్రియసంబంధమును వదలించికొని ధీరులు మరణరహితులు=అమృతు లగుదు రనియును, పరమేశ్వరతత్త్వము సర్వేంద్రియాతీత మనియును ప్రతిపాదింపబడినది. ద్వితీయఖండమున గురూపదేశముద్వారా విషయపరిజ్ఞానము నంది మననము చేయుచు, శరీరమును భోగసాధనముగా గాక ఉపాసనాసాధనముగా వినియోగించికొనుచు సంసరణబంధమునుండి విడివడవచ్చు ననియును, ధీరు లీజన్మయందే పరమేశ్వరోపాసకులై యమృతు లగుచున్నా రనియును ప్రతిపాదింపబడినది. మూడవఖండమునందు సర్వ జగచ్ఛాసకుడగు పరమేశ్వరుని యనుగ్రహమువలననే సర్వకార్యములు నెరవేరుచున్న వనువిషయము సోదాహరణముగా నిరూపింపబడుచున్నది.

ఒకప్పుడు దేవాసురయుద్ధమందు పరమేశ్వరానుగ్రహమువలన దేవతలు జయించిరి. కాని యావిషయము మఱచి యీజయము తమ సామర్థ్యమువలననే, తమమహిమవలననే సంభవించినదని విఱ్ఱవీగి వారు విజయోత్సవము చేసికొనుచుండిరి.

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే — పరమేశ్వరుడు దేవతలకొఱకు జయించె నని యర్థము.

యుద్ధము జరుగుచున్నది దేవాసురులకు. ఈ యుద్ధమున జయించినది పరమేశ్వరుడు. పరమేశ్వరోపాసన గావించి తదనుగ్రహము పొందుటవలన దేవతలు రాక్షసులను జయించగలిగి రని తాత్పర్యము. శివానుగ్రహము లేని దేకార్యమును నెరవేర దని ఫలితార్థము. ఈ విషయము జుష్ట స్తత స్తే నాఽమృతత్వ మేతి’ అను శ్రుతిచే ప్రతిపాదింపబడుచున్నది. ఆముష్మికమున నమృతత్వమునకువలెనే ఐహిక

మున సర్వాభ్యుదయములకును పరమేశ్వరానుగ్రహమే కారణ మనుట సర్వశాస్త్రసమ్మతమగు సిద్ధాంతము.

ఈసందర్భమున నొకవ్యాఖ్యాత పూర్వగ్రంథమున నుత్తమాధికారులకు నిర్గుణబ్రహ్మోపాసనము ప్రతిపాదింపబడిన దనియును, నితమందాధికారులకు సగుణబ్రహ్మోపాసనము ప్రతిపాదింపబడు చున్న దనియును వ్యాఖ్యానించినాడు. ఇయ్యది యెంతవఱకు విమర్శసహమో గాంతము.

## నిర్గుణ సగుణ శబ్దార్థము

ప్రథమమున నుపాసనము నిర్గుణబ్రహ్మోపాసన మనియును, సగుణబ్రహ్మోపాసన మనియును రెండువిధము లనువిషయమును గాంతము. ఈరెండు సమాసములందును నిర్గుణసగుణశబ్దములు బ్రహ్మశబ్దమునకు విశేషణములు. ఈవిశేషణములు బ్రహ్మతత్త్వమునకు నిర్గుణసగుణస్థితులు రెండు కలవని ప్రతిపాదించుచున్నవి. ఈస్థితు లుత్తమమందాధికారులకొఱ కేర్పడినవా? లేక బ్రహ్మతత్త్వమున కీరెండు స్థితులు వాస్తవముగ నున్నవా? బ్రహ్మశబ్దమున కర్థ మేమి?

బృహ బృహి వృద్ధౌ అను ధాతువునుండి బృహతి, బృంహయతి యను వ్యుత్పత్తిచే నిష్పన్నమైన బ్రహ్మశబ్దమునకు విస్తరించునది, విస్తరింపజేయునది యని యర్థము. తాను విస్తరించునది, జగత్తును విస్తరింపజేయునది యని వివరణము.

జగత్తు పరిణామ్యముగాన దానిని విస్తరింపజేయుటలో ననుపపత్తి లేకపోవచ్చును. కాని తాను విస్తరించుటలో వికారప్రసక్తి లేదా యన్న విచారింతము. బ్రహ్మతత్త్వస్వరూపనిర్వచనము గావించిన గాని యీవిషయము చక్కగా నవగతము గాదు. బ్రహ్మతత్త్వమున రెండుభాగము లున్నవి చేతనభాగము, జడభాగము నని. ఈచేతన జడభాగద్వయసమష్టికే బ్రహ్మశబ్దవ్యవహారము.

బ్రహ్మై వేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చా
ద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ
అధ శ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మై వేదం విశ్వ మిదం వరిష్ఠమ్

అనుముండకమంత్రము విశ్వము నన్నివైపులను నావరించి బ్రహ్మ తత్త్వము వ్యాపించియున్నదని ప్రతిపాదించుచున్నది. శిశువు గర్భముచే నావరింపబడినటుల విశ్వము బ్రహ్మచే నావరింపబడియున్నది. అంతియే గాదు.

ఈశావాస్య మిదగ్ం సర్వం య త్కించ జగత్యాం జగత్

అనునీశావాస్యమంత్రము జగత్తు ఈశావాస్య మనగా జగత్తునం దీశ్వరుడు ప్రత్యణువునందును నంతర్యామిగా నున్నాడని ప్రతిపాదించుచున్నది.

స విశ్వకృత్ విశ్వవి దాత్మయోని
ర్జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్యః
ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః
సంసారమోక్షస్థితిబంధహేతుః

అను శ్వేతాశ్వతరమంత్రము ఆబ్రహ్మతత్త్వము విశ్వకర్త్తనియును, సర్వజ్ఞ మనియును, గుణి యనియును, జీవజగత్పతి యనియును, బంధమోక్షకారణ మనియును ప్రతిపాదించుచున్నది. విశ్వకర్త్రాదులన్నియును గుణములే. బ్రహ్మతత్త్వ మేతద్విశిష్టమే యని మంత్రోపనిషత్తు ప్రతిపాదించుచున్నది.

యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి య
త్ప్రయం త్యభిసంవిశంతి త ద్విజిజ్ఞాసస్వ త ద్బ్రహ్మేతి

అనుశ్రుతి యేతత్త్వమునుండి యీభూతములు జన్మించుచున్నవో, యేతత్త్వము నాశ్రయించి జీవించుచున్నవో, అంతకాల

మున నేతత్త్వమునందు లయము నందుచున్నవో యాతత్త్వము నుపాసింపు మనియును, నయ్యదియే బ్రహ్మతత్త్వ మనియును ప్రతిపాదించుచున్నది. 'ఏష సర్వభూతాంతరాత్మా' అను ముండక మంత్రము పరమేశ్వరుడు (బ్రహ్మతత్త్వము) విశ్వము నన్నివైపుల నావరించియుండుటయేగాక విశ్వమున కంతర్యామిగా నున్నాడని ప్రతిపాదించుచున్నది.

సూర్యో యథా సర్వలోకస్య చక్షుః
న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః

అనుకఠమంత్రము బ్రహ్మతత్త్వము సర్వభూతాంతరాత్మగా నుండియును సర్వలోకచక్షువగు సూర్యుడు చాక్షుషదోషముల కతీతుడుగా నున్నట్లు లోకదుఃఖమున కతీతముగా నున్నదని ప్రతిపాదించుచున్నది.

ఈ విమర్శచే బ్రహ్మతత్త్వము విశ్వము నన్నివైపుల నావరించియున్న దనియును, ఇంతేగాక విశ్వమునం దంతరాత్మగా నున్నదనియును, విశ్వమునకు సృష్టిస్థితిసంహారములు చేయుచున్నదనియును, నీవిధముగ విశ్వముతో నింత ఘనిష్ఠసంబంధ మున్నను తద్గతదోషముల కంటకుండ నున్నదనియును తెలియుచున్నది.

ఇప్పటివరకును బ్రహ్మజగత్తులసంబంధ ముపనిషత్సిద్ధాంతానుసారము సమ[illegible]ముగా నిర్వచింపబడినది. ఇక బ్రహ్మతత్త్వముయొక్క సగుణనిర్గుణ[illegible] విషయము గాంతము. సగుణ మనగా గుణములతో కూడుకొన్న [illegible]యును, నిర్గుణ మనగా గుణరహిత మనియును వారి నిర్వచనము. కా[illegible] యిచట నొకవిషయమును ప్రధానముగా గమనించవలయును. [illegible]ర్గతాః గుణాః యస్మాత్తత్ నిర్గుణమ్ అని నిర్గుణశబ్దమునకు విగ్రహము. ఏతత్త్వమునుండి గుణములు పోయినవో

యాత్త్వము నిర్గుణ మని యర్థము. కాని వారి సిద్ధాంతము ప్రకారము నిర్గుణ మనుటకంటె అగుణ మనుట యనుకూలముగా నుండును. అగుణ మనగా గుణములు సార్వకాలికముగా లేని దని యర్థము. నిర్గుణశబ్దమునకు పూర్వము గుణము లుండి తరువాత పోయిన వని యర్థము. కావున నాసంప్రదాయమున నిర్గుణశబ్దము సమన్వయింపదని తేలుచున్నది.

నిర్ అను నుపసర్గకు అభావార్థమునందును సమాస మున్నది. మక్షికాణా మభావః నిర్మక్షికమ్ అని విగ్రహము. మక్షికముల యొక్క యభావము లేకపోవుట యని యర్థము. అటులే గుణానా మభావః నిర్గుణమ్ అని సమాసము చెప్పవచ్చును. కాని యీ యర్థమున నిర్గుణశబ్దము బ్రహ్మశబ్దమునకు విశేషణము కాజాలదు.

ఉపనిషత్సంప్రదాయమునందు గుణశబ్దమునకు ధర్మము లని యర్థము. సృష్టికర్తృత్వాదులు బ్రహ్మధర్మములు. సృష్టికాలమున స్రష్టృత్వమును స్థితికాలమున పోషకత్వమును లయకాలమున సంహర్తృత్వమును బ్రహ్మధర్మములు. ఇయ్యవి యాయాకాలములందుమాత్రమే యుండు ధర్మములు. అన్నికాలములందును నుండునది జగద్వైశిష్ట్యము. బ్రహ్మతత్త్వము సృష్టికాలమునందును, స్థితికాలమునందును, లయకాలమునందును జగద్విశిష్టమే. సృష్టికాలమున నామరూపవిభాగార్హస్థిత్యున్ముఖజగద్విశిష్టము. స్థితికాలమునందు విభక్త నామరూపజగద్విశిష్టము. లయకాలమునందు నామరూపవిభాగానర్హజగద్విశిష్టము. లయ మనగా నామరూపవిభాగానర్హస్థితిమాత్రమే కాని నాశము గాదు. కారణము స్వరూపనాశము పదార్థధర్మము గాకపోవుటయే. ఈవిషయము గీతలయందు

నాऽసతో విద్యతే భావో నాऽభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోऽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

అను శ్లోకముచే ప్రతిపాదింపబడినది. కావున బ్రహ్మాత్మత్త్వము సర్వ కాలములందును జగద్విశిష్టమనియే తేలుచున్నది. మఱియును వికార ప్రసక్తి పరిణామ్యమగు జగద్విషయముననేగాని పరిణామయితయగు నీశ్వరునివిషయమున లేదనియును తేలుచున్నది.

త ఐక్షంత తాస్మాక మే వాయం విజయోఽస్మాక మే వాయం మహిమేతి— ఈవిజయము మాదే, ఈమహిమ మాదే యని దేవ తలు తలంచి రని యర్థము.

శివానుగ్రహమువలననే తా మీయుద్ధమున జయింపగలిగితి మనువిషయమును మరచి దేవతలు విఱ్ఱవీగి విజయోత్సవమును చేసి కొనుచుండిరి. గర్వ మధఃపతనమునకు హేతువు. కావున పరమేశ్వ రుడు వారు నిమిత్తమాత్రులను విషయము వారికి తెలుపదలచి యక్షరూపమున వారిసమీపమునకు వచ్చె ననువిషయ మనంతర మంత్రమునందు ప్రస్తావింపబడుచున్నది.

## ద్వితీయమంత్రము

త ద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ
త న్న వ్యజానంత కి మిదం యక్ష మితి

అర్థము :- ఏషామ్ = దేవతలయొక్క, తత్ = గర్వవిషయమును, విజజ్ఞౌ = పరమేశ్వరుడు తెలిసికొనెను. తేభ్యః = ఆదేవతలకొఱకు, ప్రాదుర్బభూవ = సాక్షా త్కరించెను. ఇదమ్ = ఈవచ్చిన, యక్షమ్ = యక్షరూపమున నున్నది, కిమ్ = ఎవరో, ఇతి = అని, న వ్యజానంత = (దేవతలు) తెలిసికొనలేకపోయిరి.

తాత్పర్యము :- సర్వాంతర్యామియును, సర్వజ్ఞుడునునగు పరమేశ్వరుడు వారి గర్వమును గమనించి యక్షరూపమున వారియెదుట సాక్షాత్కరించెను. కాని గర్వోన్మత్తులైన దేవత లావచ్చిన దెవరో తెలిసికొనలేకపోయిరి.

## తృతీయమంత్రము

**తేఽగ్ని మబ్రువన్ జాతవేద! ఏత ద్విజానీహి**
**కి మేత ద్యక్ష మితి,**

తే = దేవతలు, జాతవేద! = ఓయగ్ని!, ఏతత్ = ఈ, యక్షమ్ = యక్షుడు, కి మితి = ఎవరైనదియును, ఏతత్ = ఈవిషయమును, విజానీహీతి = తెలిసికొనుమని, అగ్నిమ్ = అగ్నినిగూర్చి, అబ్రువన్ = పలికిరి.

తాత్పర్యము;- అంత దేవత లగ్నిని గాంచి యోయీ! ఈయక్షునివిష యము కనుగొనిర మ్మని పలికిరి.

## చతుర్థమంత్రము

**త థేతి త దభ్యద్రవ _త్త మభ్యవద త్కోఽసీతి**
**అగ్ని ర్వా అహ మస్మీ త్యబ్రవీ జ్జాతవేదా వా అహ మస్మీతి**

అర్థము:- అగ్నిః = అగ్ని, త థేతి = అటులేయని (పలికి). తత్ = ఆయక్షుని గూర్చి, అభ్యద్రవత్ = పరువిడెను. యక్షమ్ = యక్షుడు, తమ్ = అగ్నినిగూర్చి, కోఽసీతి = ఎవడవని, అభ్యవదత్ = పలికెను. (అగ్నిః = అగ్ని), అహమ్ = నేను, అగ్ని ర్వా = అగ్నిని, సర్వవ్యాపకుడను, అస్మీతి = అగుచున్నాననియు, అహమ్ = నేను జాతవేదాః వా = వేదముల పుట్టుకస్థానమును, అస్మీతి = అగుచున్నా ననియు, అబ్రవీత్ = పలికెను.

తాత్పర్యము:- అగ్నియును నటులే యని పలికి యాయక్షునియొద్ద కేగెను. యక్షుడు అగ్నిని నీ వెవరవని యడిగెను. అగ్ని నేను సర్వవ్యాపకుడను, వేదో త్పత్తిస్థానము నని పలికెను.

## పంచమమంత్రము

**తస్మిం _స్త్వయి కిం వీర్య మి త్యపీదగ్ం**
**సర్వం దహేయం య దిదం పృథివ్యా మితి**

అర్థము:- తస్మిన్ = అట్టిప్రసిద్ధుడవైన, త్వయి = నీయందు, కిమ్ = ఏమి, వీర్యమ్ = సామర్థ్యము, అ_స్తీతి = ఉన్నదని, అవదత్ = పలికెను. సః = అగ్ని,

పృథివ్యామ్ = భూలోకమునందు, య దిదమ్ = ఏయీపదార్థజాతము, అస్తి = ఉన్నదో, ఇదమ్ = ఈ, సర్వ మపి = సమస్తమును, దహేయమ్ = దహించగలను, ఇతి = అని, అవదత్ = పలికెను.

తాత్పర్యము:- యక్షు డట్టినీసామర్థ్య మేమని యడిగెను, అగ్ని ప్రపంచమునందలి సర్వమును దహించగల నని పలికెను.

## షష్ఠమంత్రము

తస్మై తృణం నిదధా వేత ద్దహేతి త
దుపప్రేయాయ సర్వజవేన త న్న శశాక
దగ్ధుం స తత ఏవ నివవృతే నైత
దశకం విజ్ఞాతుం య దేత ద్యక్ష మితి

అర్థము:- యక్షమ్ = యక్షుడు, ఏతత్ = దీనిని, దహేతి = దహింపుమని, తస్మై = ఆతనికొఱకు, తృణమ్ = గడ్డిపరకను, నిదధౌ = ఉంచెను. అగ్నిః = అగ్ని, తత్ = ఆగడ్డిపరకనుగూర్చి, సర్వజవేన = తన సర్వవేగముతో, ఉపప్రేయాయ = సమీపించెను, తత్ = దానిని, దగ్ధుమ్ = దహించుటకు, న శశాక = సమర్థుడు కాక పోయెను. సః = అగ్ని, తత ఏవ = అచటనుండి, నివవృతే = మరలిచనెను. ఏతద్యక్షమ్ = ఈయక్షుడు, య దితి = ఎవరనువిషయము, విజ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, నాశకమ్ = సమర్థుడను కానైతిని, ఇతి = అని, అవదత్ = పలికెను.

తాత్పర్యము:- యక్షుడు దీనిని దహింపుమని యగ్నిముం దొకగడ్డిపరక నుంచెను. అగ్నియును దానిని దహించుటకు తనసర్వశక్తిని వినియోగించెను. కాని దహింపజాలకపోయెను. అంత నగ్ని మరలిపోయి యాత డెవరో తెలిసికొనజాలకపోతినని వచించెను.

## సప్తమమంత్రము

అథ వాయు మబ్రువన్ వాయ వేత
ద్విజానీహి కి మేత ద్యక్ష మితి

అర్థము:- అథ = పిమ్మట, వాయుమ్ = వాయువునుగూర్చి, వాయో! = ఓ వాయుదేవా! ఏతత్ = ఈ, యక్షమ్ = యక్షుడు, కిమితి = ఎవరైనదియును,

ఏతత్ = ఈవిషయమును, విజానీహి = తెలిసికొనుము, ఇతి = అని, అబ్రువన్ = పలికిరి.

తాత్పర్యము:- పిమ్మట దేవతలు వాయువును గాంచి యోయీ! ఈయక్షుని విషయము కనుగొని రమ్మని పలికిరి.

## అష్టమమంత్రము

**తథేతి త దభ్యద్రవ త్త మభ్యవద త్కో౽సీతి వాయు ర్వా అహ మస్మీ త్యబ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి.**

అర్థము:— వాయుః = వాయువు, తథేతి = అటులేయని, తత్ = ఆ యక్షునిగూర్చి, అభ్యద్రవత్ = పరువిడెను, యక్షమ్ = యక్షుడు, కో౽సీతి = ఎవడవని, తమ్ = వాయువునుగూర్చి, అభ్యవదత్ = పలికెను, అహమ్ = నేను, వాయుః వా = విసిరెడివాడను, అస్మి = అగుచున్నాను, అహమ్ = నేను, మాతరిశ్వా వా = ఆకాశమునందు వృద్ధినొందువాడను, అస్మి = అగుచున్నాను, ఇతి = అని, వాయుః = వాయువు, అబ్రవీత్ = పలికెను,

తాత్పర్యము :— వాయు వటులే యని యక్షునియొద్దకు పరువిడెను. యక్షుడు వాయువును నీ వెవరవని యడిగెను. నేను వాయువ ననియును, మాతరిశ్వుడ ననియును సమాధాన మిచ్చెను.

## నవమమంత్రము

**తస్మిం స్త్వయి కిం వీర్య మి త్యపీదగ్ం సర్వ మాదదీయం య దిదం పృథివ్యామితి.**

అర్థము :— తస్మిన్ = అట్టి, త్వయి = నీయందు, కిమ్ = ఏమి, వీర్యమ్ = సామర్థ్యము, అస్తి = కలదు, ఇతి = అని యక్షు డడిగెను. పృథివ్యామ్ = భూమియందు, య దిదమ్ = ఏయీపదార్థజాతము, అస్తి = కలదో, ఇదమ్ = ఈ, సర్వమపి = సమస్తమును, ఆదదీయమ్ = గ్రహింపగలను, ఇతి = అని వాయు వనెను.

తాత్పర్యము;— అట్టినీసామర్థ్య మేమని యక్షు డడుగ భూమియందలి సమస్తపదార్థములను గ్రహించగలనని వాయువు సమాధాన మిచ్చెను.

## దశమమంత్రము

తస్మై తృణం నిదధా వేత దాదత్స్వేతి
త దుపప్రేయాయ సర్వజవేన త న్న శశా
కాదాతుం స తత ఏవ నివవృతే నైత
దశకం విజ్ఞాతుం య దేత ద్యక్ష మితి

అర్థము:- యక్షమ్ = యక్షుడు, ఏతత్ = దీనిని, ఆదత్స్వ = గ్రహింపుము, ఇతి = అని, తస్మై = వాయువుకొఱకు, తృణమ్ = గడ్డిపరకను, నిదధా = ఉంచెను. సః = ఆవాయువు, సర్వజవేన = తనసర్వవేగముతో, తత్ = ఆగడ్డిపరకను, ఉపప్రే యాయ = సమీపించెను. తత్ = ఆగడ్డిపరకను, ఆదాతుమ్ = గ్రహించుటకు, న శశాక = సమర్థుడు కాకపోయెను. తత ఏవ = అచటనుండి, నివవృతే = మరలి చనెను. ఏతత్ = ఈ, యక్షమ్ = యక్షుడు, య దితి = ఎవరైనదియు, విజ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, నాశకమ్ = సమర్థుడను కాకపోతిని, ఇ త్యవదత్ = అని పలికెను.

తాత్పర్యము:- యక్షుడు దీనిని గ్రహింపుమని వాయువుముం దొకతృణము నుంచెను. వాయువు దానిని గ్రహించుటకు తనశక్తిని వినియోగించియు గ్రహిం పలేకపోయెను. అంత నాతడు మరలిచని యాత డెవరో తెలిసికొనజాలకపోతి నని వచించెను.

## ఏకాదశమంత్రము

అ థేంద్ర మబ్రువన్ మఘవ న్నేత ద్విజానీహి కి మేత ద్యక్ష మితి
త థేతి త దభ్యద్రవ త్తస్మా త్తిరోదధే.

అర్థము :- అథ = పిమ్మట, దేవాః = దేవతలు, ఇంద్రమ్ = ఇంద్రునిగూర్చి, మఘవన్ = ఓయింద్రుడా !, ఏతద్యక్షమ్ = ఈయక్షుడు, కిమితి = ఎవరైనదియు, ఏతత్ = ఈవిషయమును, విజానీహి = తెలిసికొనుము, ఇతి = అని, అబ్రువన్ = పలికిరి, తథేతి = అటులేయని, ఇంద్రః = ఇంద్రుడు, తత్ = ఆయక్షునిగూర్చి, అభ్యద్రవత్ = పరువిడెను. తత్ = ఆయక్షుడు, తస్మాత్ = ఆయింద్రునినుండి, తిరోదధే = అంతర్ధాన మొందెను.

తాత్పర్యము :— పిమ్మట దేవత లింద్రుని గాంచి యోయింద్రా ! యక్షు డెవరో కనుగొమ్మని పలికిరి. ఇంద్రు డాయక్షుని సమీపింప నాత డంతర్ధాన మొందెను.

## ద్వాదశమంత్రము

స తస్మి న్నే వాకాశే స్త్రియ మాజగామ బహుశోభమానా ముమాం హైమవతీం తాగ్ంం హెూవాచ కి మేత ద్యక్షమితి.

అర్థము :— సః = ఆయింద్రుడు, తస్మిన్ = ఆ, ఆకాశే ఏవ = ఆకాశమునందే, బహుశోభమానామ్ = మిక్కిలి ప్రకాశించుచున్నదియును, స్త్రియమ్ = స్త్రీయగు, హైమవతీమ్ = హిమవంతుని కుమార్తెయగు, ఉమామ్ = బ్రహ్మవిద్యారూపిణియగు పార్వతినిగూర్చి, ఆజగామ = వచ్చెను. ఏత ద్యక్షమ్ = ఈయక్షుడు, కిమితి = ఎవరని, తామ్ = ఆ పార్వతినిగూర్చి, ఉవాచ = పలికెను.

తాత్పర్యము:— అంత నాయింద్రు డాకాశమున బ్రహ్మవిద్యారూపిణియగు పార్వతిని గాంచి యాయక్షు డెవరని యడిగెను.

ఓమ్

# కేనోపనిషత్తు

## చతుర్థఖండము - ప్రథమమంత్రము

సా బ్రహ్మేతి హెూవాచ బ్రహ్మణో వా ఏతద్విజయే మహీయధ్వ మితి తతో హైవ విదాంచకార బ్రహ్మేతి

అర్థము:- సా = ఆమె, బ్రహ్మేతి = బ్రహ్మ యనియును, బ్రహ్మణో వా = బ్రహ్మయొక్క, ఏతద్విజయే = ఈ విజయమునందు, మహీయధ్వ మితి = మహిమాన్వితు లైతిరనియును, ఉవాచ = చెప్పెను. ఇంద్రః = ఇంద్రుడు, తతో హ వా = ఆ పార్వతీదేవి వాక్యమువలన, బ్రహ్మేతి = బ్రహ్మయని, విదాంచకార = తెలిసికొనెను.

తాత్పర్యము:- పార్వతి యింద్రునితో నీ యక్షుడు పరమేశ్వరు డనియును, పరమేశ్వరుడే యీ విజయమునకు కారణ మనియును వచించెను. అంత నింద్రుడును నాయక్షరూపమున వచ్చినది పరమేశ్వరు డని తెలిసికొనెను.

## ద్వితీయమంత్రము

**తస్మా ద్వా ఏతే దేవా అతితరా మి వాన్యా న్దేవాన్ యదగ్ని ర్వాయు రింద్ర స్తే హ్యేన న్నేదిష్ఠం పస్పర్శు స్తే హ్యేన త్ప్రథమా విదాం చకార బ్రహ్మేతి**

**అర్థము :-** యత్ = ఏ కారణమువలన, అగ్నిః = అగ్నియును, వాయుః = వాయువును, ఇంద్రః = ఇంద్రుడును, తేహి = ఆముగ్గురు, ఏనత్ = ఈయక్షుని, నేదిష్ఠమ్ = సమీపస్థునిగా = పస్పర్శుః = స్పృశించిరి. తేహి = ఆముగ్గురును, ఏనత్ = ఈయక్షుని, ప్రథమాః = మొదటివారుగా, బ్రహ్మేతి = బ్రహ్మయని, విదాంచకార = తెలిసికొనిరో, తస్మా ద్వా = ఆ కారణమువలన, ఏతే = ఈ, దేవాః = అగ్ని వాయ్వింద్రులు, అన్యాన్ = ఇతరులగు, దేవాన్ = దేవతలను, అతితరా మిః = అతిక్రమించిన వారివలె నున్నారు.

తాత్పర్యము :- అగ్నివాయ్వింద్రులు మూవురును యక్షరూపమున నావిర్భవించిన పరమేశ్వరునివిషయము తెలిసికొనుటకై యాతని సమీపించు టచే నితరదేవతలకన్న నధికు లైరి.

## తృతీయమంత్రము

**తస్మా ద్వా ఇంద్రోతితరా మి వాన్యాన్ దేవాన్ స హ్యేన న్నేదిష్ఠం పస్పర్శ స హ్యేన త్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి**

**అర్థము -** స హి = ఆయింద్రుడు, ఏనత్ = ఈయక్షుని, నేదిష్ఠమ్ = సమీపస్థునిగా, పస్పర్శ = స్పృశించెను. స హి = ఆతడు, ఏనత్ = ఈయక్షుని, ప్రథమః మొదటివాడై బ్రహ్మేతి = బ్రహ్మయని, విదాంచకార = తెలిసికొనెను. తస్మాత్ ఆ కారణమువలన, ఇంద్రః = ఇంద్రుడు, అన్యాన్ = ఇతరులగు, దేవాన్ = దేవత లను, అతితరా మివ = అతిక్రమించినవానివలె నున్నాడు.

తాత్పర్యము :- అగ్నివాయ్వింద్రులు మూవురిలో నింద్రుడగ్నివాయు వులకన్న నధికముగా పరమేశ్వరవిషయము తెలిసికొనుటచే వారికన్న నధికు డాయెను.

## వివరణము

ఆఖ్యాయికయందు దేవరాక్షసయుద్ధమున దేవతలు విజృంభి శివానుగ్రహమువలన తా మీయుద్ధమున జయింపగలిగితిమను విషయమును మరచి విజయోత్సవమును గావించుకొనుచుండ గర్వము పతనహేతు వగుట పరమేశ్వరుడు దేవతలకు విషయపరిజ్ఞానము గలిగింపగోరి వారున్న ప్రదేశమునకు సమీపమున యక్షరూపమున సాక్షాత్కరించెను. ఆవచ్చిన దెవరో కనుగొనగోరి దేవత లగ్ని నాతని యొద్దకు బంపిరి. అగ్ని సమీపించినంత యక్షుడు నీ వెవరు? నీసామర్థ్య మేమని ప్రశ్నించెను. నే నీసర్వమును దహింపగలనని యగ్ని సమాధాన మిచ్చెను. అంత నాయక్షు డగ్నిముం దొకతృణము నుంచి దీనిని దహింపు మనెను. తనసామర్థ్యము నంతయు వినియోగించియు దానిని దహింపజాలక మరలి పోయి జరిగినవిషయమును జెప్పి తా నాయక్షు డెవరో తెలిసికొనజాలకపోతినని వచించెను. అంత దేవతలు వాయువును పంపిరి. వాయువును నాతృణమును కదలింపజాలక తిరిగి వచ్చి తనకును నావిషయము తెలియదని చెప్పెను. తరువాత దేవత లింద్రుని బంపిరి. కాని యక్షు డంతర్ధాన మొందెను. ఇంద్రుడు చేయునది లేక దెసలు పరికించుచుండ నాకాశమున హైమవతి ప్రత్యక్ష మయ్యెను.

ఇంద్రు డామెను యక్షవిషయమున ప్రశ్నింప నామె పరమేశ్వరుడే యక్షరూపమున సాక్షాత్కరించినా డనియును, నాతనియనుగ్రహమువలననే వారికి జయము లభించిన దనియును వచించి యంతర్ధాన మొందెను.

ఇయ్యది యాఖ్యాయికయొక్క సారాంశము. ఇక విషయవిమర్శ గావింతము. ఈయాఖ్యాయికయందు దేవతలకు గర్వభంగమై మఱల వారికి విషయపరిజ్ఞానము గలుగుట ప్రధానవిషయము. మఱియును నీ విషయము నాఖ్యాయికారూపమున వివరించుచు తద్ద్వారా పరమేశ్వ

రుని సర్వజగత్ప్రేరకత్వమును సిద్ధాంతీకరించుట కేనోపనిషత్తుయొక్క పరమాశయము.

ఉపనిషదారంభమునందు కే నేషితం పతతి ప్రేషితం మనః అను ప్రథమఖండప్రథమమంత్రముచే శిష్యప్రశ్నద్వారా సర్వేంద్రియప్రేరకత్వవిషయము ప్రస్తావింపబడి శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనః అను గురువుయొక్క సమాధానముద్వారా సిద్ధాంతీకరింపబడినది ఈవిషయమే తృతీయఖండమున నాఖ్యాయికారూపమున ప్రపంచింపబడినది.

విజయోత్సవసమయమున యక్షు డావిర్భవించినంతనే దేవతలు తాము గావించుకొనుచున్న విజయోత్సవవిషయమునుగూడ మఱచి యక్షవిషయము కనుగొనుట కుద్యుక్తులైరి. కారణము యక్షరూపమున పరమేశ్వరదర్శన మగుటయే.

మొదట యక్షవిషయము తెలిసికొనుట కగ్నిని బంపిరి. అగ్ని యక్షునిచేత పరీక్షింపబడి వీతగర్వుడై మరలివచ్చినతరువాత వాయువును పంపుటయు, నాతడును నటులే వీతగర్వుడై మరలివచ్చుటయు జరిగినంతనే యింద్రుని బంపిరి. కాని యింద్రు డాప్రదేశమున కేగునప్పటికి యక్షు డంతర్ధాన మందెను. హైమవతి సాక్షాత్కరించి యక్షరూపమున వచ్చినది పరమేశ్వరు డని వచించెను.

అగ్నివాయ్వింద్రులు పరమేశ్వరునిసన్నిధి కేగుటచేతను, అగ్నివాయువులు యక్షునిచే పరీక్షింపబడి వీతగర్వు లగుటచేతను, యక్షు డంతర్ధానమొందినప్పటికిని హైమవతిని దర్శించి యామెవలన యక్షరూపమున వచ్చినది పరమేశ్వరు డని తెలిసికొనుటచేతను దేవతలందరిలో నగ్నివాయ్వింద్రులును, నీముువ్వురిలో నింద్రుడును నధికులుగా పరిగణింపబడిరి.

## చతుర్థమంత్రము

**త స్యైష ఆదేశో య దేత ద్విద్యుతో వ్యద్యుత దా3 ఇతీ న్న్యమీ మిష దా3 ఇ త్యధిదైవతమ్**

అర్థము:- య దేతత్ = ఏయీబ్రహ్మతత్త్వము, విద్యుతః ఆ = మెఱుపులవలె వ్యద్యుతత్ = ప్రకాశించెను ఇతి = అని, ఇత్ = మఱియును, న్యమీమిషత్ ఆ = కను మొఱగినదివలె నున్నది. ఇతి = అని. అధిదైవతమ్ = దేవతావిషయమై, ఏషః = ఇది, తస్య = ఆపరమేశ్వరునకు సంబంధించిన, ఆదేశః = ఉపదేశము.

తాత్పర్యము:- బ్రహ్మతత్త్వము మెఱుపులవలె ప్రకాశమానమైనదనియును మెఱువువలె నంతలోనే నదృశ్య మగునదనియును ఇది దేవతావిషయకమైన యుపదేశము.

## పంచమమంత్రము

**అథా ధ్యాత్మం య దేత ద్గచ్ఛ తీవ చ మనోనేన చైత దుపస్మర త్యభీక్ష్ణం సంకల్పః**

అర్థము :- అథ = పిమ్మట, అధ్యాత్మమ్ = ఆత్మవిషయకమైన యుపదేశము. మనః = మనస్సు, య దేతత్ = ఏయీబ్రహ్మతత్త్వమును, గచ్ఛతి ఇవ చ = పొందు చున్నదివలె నున్నదో, సంకల్పః = జీవుడు, అనేన = ఈమనస్సుచేత, ఏతత్ = ఈ బ్రహ్మతత్త్వమును, అభీక్ష్ణమ్ = ఎల్లప్పుడును, ఉపస్మరతి = దాదాపు స్మరించుచు న్నాడు.

తాత్పర్యము ;- ఇక నధ్యాత్మోపదేశము గావింపబడుచున్నది. ఈబ్రహ్మ తత్త్వమును మనస్సు పొందుచున్నదివలె నున్నది. మనస్సుచేత బ్రహ్మతత్త్వ మును స్మరింపవలెనని జీవుని సంకల్పము.

## వివరణము

గ్రంథారంభమున ప్రథమఖండప్రథమమంత్రమున నుపక్రమింప బడిన పరమేశ్వరునియొక్క సర్వజగత్ప్రేరకత్వరూప బ్రహ్మలింగము తృతీయఖండమున నాఖ్యాయికారూపమున సోదాహరణముగా ప్రపం

చింపబడినది. ఇక చతుర్థఖండమున ద్వితీయమంత్రమున నగ్నివాయ్వింద్రులు యక్షునివిషయము కనుగొనుట కాతనిసన్నిధి కేగుటచే దేవతామండలిలో శ్రేష్ఠులని ప్రతిపాదింపబడినది. తృతీయమంత్రమున నింద్రు డేగునప్పటికి యక్షు డంతర్ధానమందుటయు, నింద్రుడు నిర్విణ్ణుడై పరితపించుచుండ పార్వతీదేవి ప్రత్యక్షమై యక్షరూపమున వచ్చినది పరమేశ్వరుడని చెప్పుటచే నింద్రుడు సర్వశ్రేష్ఠుడైనవిషయము ప్రతిపాదింపబడినది. ఇక చతుర్థమంత్రమునం దధిదైవతవిషయమును, పంచమమంత్రమునం దధ్యాత్మవిషయమును ప్రతిపాదింపబడుచున్నది.

అధిదైవతమ్ — దైవతే అధిదైవతమ్ అని అధిదైవతశబ్దవిగ్రహము. అధిదైవత మనగా దేవతావిషయకమైన యని యర్థము.

అధిదైవతం ఏవ తస్య ఆదేశః — ఇది ఆపరమేశ్వరునికి సంబంధించిన దేవతావిషయకమైన యుపదేశము అని వాక్యార్థము.

'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చ అమూర్తం చ' పరమేశ్వరునకు మూర్తమనియును, అమూర్తమనియును రెండు రూపము లున్నవని యీమంత్రము ప్రతిపాదించుచున్నది. పరమేశ్వరునిమూర్తరూపము జగత్తు. జీవునకు శరీర మధిష్ఠానమైనట్లు జగత్తు పరమేశ్వరుని కధిష్ఠానము. కాని యొకవిశేషము. జీవుడు శతధాకల్పితవాలాగ్రశతభాగతుల్యుడై శరీరైకదేశమగు హృదయైకదేశమున నున్నాడు. పరమేశ్వరుడు జగత్తునందలి ప్రత్యణువునందును నంతర్యామిగా నుండుటయే గాక జగత్తున కన్నిపార్శ్వములందును శిశువును గర్భ మావరించియున్న ట్లావరించియున్నాడు. ఈవిషయము

వాయు ర్యథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బభూవ
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః

అను కఠమంత్రముచే సోదాహరణముగా ప్రతిపాదింపబడినది. ఇంకొక విషయము. జీవశరీరసమష్టికి పురుషశబ్దవ్యవహారమైనట్లు మూర్తామూర్త రూపద్వయసమష్టికే బ్రహ్మశబ్దవ్యవహారము. ఈవిషయము

శక్త్యాది చ పృథివ్యంతం జగ దేత చ్చరాచరమ్
విగ్రహం దేవదేవస్య పరమేశస్య శూలినః

అను శివపురాణవాయుసంహితావచనముచే ప్రతిపాదింపబడినది.

ముముక్షువు ప్రథమావస్థయందు సాయుజ్యాధిష్ఠానమగు హార్ద బ్రహ్మవిషయపరిజ్ఞానము లేకపోవుటచే పరమేశ్వరునిమూర్త రూపమగు జగత్తు నారాధించుట కారంభించి సమగ్రజగదారాధన మసంభవమని యెంచి పరమేశ్వరుని మూర్త రూపమగు లింగము నారాధించుచున్నాడు. లింగము జగద్భాగమగు పార్థివాంశము. దీనిని భౌతికములగు భస్మగంధాక్షతాదులచే నారాధించుచున్నాడు. ఇయ్యది పరమేశ్వర మూర్త రూపారాధన. ఇక నమూర్త రూపారాధనవిషయము గాంతము.

పరమేశ్వరుని యమూర్త రూపము సర్వేంద్రియాతీతము. ఈ విషయ మీయుపనిషత్తునందే

న తత్ర చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి
నో మనో న విద్మో న విజానీమః

అను ప్రథమఖండ తృతీయమంత్రముచే ప్రతిపాదింపబడినది. ఈవిషయము నాలుగు ఐదు ఆరు ఏడు ఎనిమిది మంత్రములచే వివరింపబడినది. అయిన సర్వేంద్రియాతీతమును, మఱియును నేవిధముగను తెలిసికొనుటకు వీలులేని పరమేశ్వరుని యమూర్త రూపము నుపాసించు టెట్లు? స బాహ్యాభ్యంతరో హ్యజః—పరమేశ్వరుడు విశ్వమునకు బాహ్యాభ్యంతరములయం దున్నను తత్పరిజ్ఞానము ముముక్షువునకు శక్తికి మించిన విషయము. కావుననే ముముక్షువులయందలి యనుగ్రహముచే పరమేశ్వరుడు జీవాధిష్ఠానమైన శరీరమునందు హృదయమున నంగుష్ఠమాత్ర

పరిమాణరూపమున నున్నాడు. ఐనను ముముక్షు వీదహారాంతర్వర్తి నారాధించి యందు సాయుజ్యము నందుట దుష్కరము. కావుననే గురువు ప్రథమమున మూర్త్యారాధనము నుపదేశించినాడు. ఈమూర్త్యారాధనము గావించుచుండ నాతనికి తాను గావించుచున్నది మూర్త్యారాధనముగాని యమూర్త్యారాధనము గాదని తెలిసినది. అంత గురువును సమీపించి యాతనివలన

సత్య మేవ జయతే నానృతం
సత్యేన పంథా వితతో దేవయానః
యే నాక్రమంతి ఋషయో హ్యాప్తకామా
యత్ర త త్సత్యస్య పరమం నిధానమ్

హార్దబ్రహ్మవిషయము తెలిసికొని దేవయానమున పయనించి

యథోదకే శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృ గేవ భవతి
ఏవం మునే ర్విజానత ఆత్మా భవతి గౌతమ!

శుద్ధోదకమున శుద్ధోదకము గలిసినట్లు హార్దబ్రహ్మయం దపునరావృత్తముగ సాయుజ్యము నందును.

ఇక విషయవిమర్శ గావింతము. దేవతల విజయోత్సవసమయమున వారిసమీపమునకు వచ్చిన యక్షుడు పరమేశ్వరుని మూర్తరూపము. ఈయక్షుడే దేవతలు పంపిన యగ్నివాయువులను తృణపరీక్ష గావించి వారిగర్వమును తొలగించినవాడు. పరమేశ్వరుడు సనకాదులకు దక్షిణామూర్తిరూపమున తత్త్వోపదేశము గావించిన విషయము

చిత్రం వటతరో ర్మూలే వృద్ధాః శిష్యా గురు ర్యువా
గురో స్తు మౌనం వ్యాఖ్యానం శిష్యా స్తు చ్ఛిన్నసంశయాః

అను శ్లోకముచే ప్రతిపాదింపబడినది.

యక్షుడు దేవతలకు గర్వభంగము గావించి వెంటనే అదృశ్యుడైనాడు. మెఱుపు మెఱసి క్షణికమగు ప్రకాశము కల్పించి తద్ద్వారా

పదార్థజ్ఞానము గలిగించి వెంటనే యదృశ్య మైనట్లు యక్షుడును దేవతలయందలి యనుగ్రహముచే దర్శన మిచ్చి జ్ఞానావబోధక మైన గర్వమును తొలగించి వెంటనే మెఱుపువలె యంతర్ధాన మొందినాడు. ఈ విషయము మంత్రమునందలి విద్యుతో వ్యద్యుత దా ఇతీ న్యమీమిష దా అనువాక్యముచే ప్రతిపాదింపబడినది.

యక్షరూపమున గర్వభంగము గావించిన సర్వజగత్ప్రేరకుడు, సర్వజగచ్ఛాసకుడు పరమేశ్వరు డనువిషయము నుపదేశించుటచే నిది యధిదైవతోపదేశ మని వవ్యహరింపబడుచున్నది. అటులనే పారమేశ్వరమూర్తరూపారాధనమును క్రమముగ దహరోపాసనమునకు మార్గదర్శి యగుటచే నియ్యదియును నధిదైవతోపదేశమే యగుచున్నది.

చతుర్థమంత్రమునం దధిదైవతోపదేశవిషయము వివరింపబడినది. ఈమంత్రమునం దధ్యాత్మోపదేశవిషయము వివరింపబడుచున్నది.

అధ్యాత్మమ్ :- ఆత్మని అధి అధ్యాత్మమ్ = ఆత్మయం దని యర్థము.

అతతి సర్వం సాతత్యేన గచ్ఛ తీ త్యాత్మా=సర్వమును, ఎల్లప్పుడును పొందునది యని యాత్మశబ్దార్థము. ఈప్రకరణమున నాత్మ యనగా పరమేశ్వరు డని యర్థము. కావున నధ్యాత్మోపదేశ మనగా. పరమేశ్వరవిషయమైన యుపదేశమని యర్థము.

ఏత తద్గచ్ఛ తీవ చ మనః :- మనస్సు దీనిని పొందుచున్నదివలె నున్న దని యర్థము.

ఈవాక్యమునందు ఇవ యనునవ్యయ మొకప్రత్యేకార్థమునందు ప్రయోగింపబడినది. గచ్ఛతి యనగా పొందుచున్న దని యర్థము. గచ్ఛతీవ పొందుచున్నదివలె నున్నది యనగా పొందుటలే దని యర్థము. కారణము మనస్సు చక్షురాదిద్వారా బహిఃప్రపంచసంబంధము కలి

గించుకొనుటలో సాధన మగుటయును, పరమేశ్వరతత్త్వము మనస్సున కందని దగుటయునే పరమేశ్వరతత్త్వము మనస్సున కందని దనువిషయము 'న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః' అను ప్రథమ ఖండతృతీయమంత్రముచే ప్రతిపాదింపబడినది. మనస్సు బహిఃప్రపంచ సాధన మనువిషయము 'మన సైవైతాన్ కామాన్ పశ్యన్ రమతే' అనుమంత్రముచే ప్రతిపాదింపబడినది.

అనేన చైత దుపస్మరత్యభీక్ష్ణం సంకల్పః – జీవు డీమనస్సుచేతనే యీబ్రహ్మతత్త్వమును చాదావు స్మరించుచున్నా డని యర్థము.

సంకల్పః :– సమ్యక్ కల్పత ఇతి సంకల్పః= బాగుగాసంకల్పించువా డని యర్థము.

ఈప్రకరణమున సంకల్పశబ్దమునకు జీవు డని యర్థము. జీవుడు శరీరమున నున్నంతవరకు శరీరపోషణాదికృత్యములకై సంకల్పించుచు, సంకల్పితకార్యసిద్ధికై మనోద్వారా చక్షురాదులను ప్రేరించి తద్ద్వారా బహిఃప్రపంచసంబంధము కలిగించుకొనుచున్నాడు. మనస్సును, చక్షురాదులును బహిఃప్రపంచసంబంధమునమాత్రమే యుపయోగించుచున్నవి. ఇంతకన్న వానికి వేరు ప్రయోజన మేమియును లేదు. ఈ విమర్శచే మనస్సు బ్రహ్మజ్ఞానమున ననుపయుక్త మని తేలుచున్నది. కాని జీవుడు మనోద్వారా బ్రహ్మతత్త్వమును తెలిసికొనుటకు ప్రయత్నించుచున్నాడు. అనుపయోగియగు మనస్సు బ్రహ్మతత్త్వ పరిజ్ఞానమున సాధన మగుట యెట్లు ? అనునది ప్రస్తుతప్రశ్న.

మనస్సు బ్రహ్మతత్త్వపరిజ్ఞానమున ననుపయోగియే యయినను జీవునకు సర్వజ్ఞానమునకును మూలకంద మగునది సందేహాతీతము. జీవునకు జ్ఞాతృత్వము సహజగుణమైనను జ్ఞానవ్యాపారము శరీరసంబంధముతోనే యారంభ మగుచున్నది. కేవలస్థితిలో ననగా శరీరసంబం

ధము కలుగక పూర్వము జ్ఞానవ్యాపారము లేదు. కారణము తద్వ్యాపారసాధనమైన మనస్సంబంధము లేకపోవుటయే.

జ్ఞానవ్యాపారము మనోద్వారా ఆరంభమైనతరువాతనే యాస్తికుడైనాడు. అనగా పరమేశ్వరుడున్నాడని భావింపగలిగినాడు. తద్విజ్ఞానార్థము గురువు నభిగమించి బ్రహ్మవిద్యావిషయ ముపదేశింపబడినాడు. మృత్యుమోక్షమును కోరి త్ర్యంబకారాధన మారంభించినాడు. లింగారాధనము గావించుచు 'నేదం య దిద ముపాసతే' ప్రతీకము బ్రహ్మ గాదని తెలిసికొని 'ప్రాణే ష్వంత ర్మనసో లింగ మాహుః' దహరాంతర్వర్తి లింగారాధన గావించుచు 'సత్యేన పంథా వితతో దేవయానః' దేవయానమార్గమున పయనించుట కారంభించి 'యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్' పరమేశ్వరుని చేరి 'యథోదకే శుద్ధే శుద్ధ మాసిక్తమ్' శుద్ధోదకమున శుద్ధోదకమువలె నపునరావృత్తముగ సాయుజ్యము నందినాడు.

ఈసమస్తమునకును నసగా ఆస్తికత్వమునుండి సాయుజ్యప్రాప్తి వఱకును - అధిష్ఠానమగు శరీరమును, సాధనమగు మనస్సును నత్యంతావశ్యకము లనునది పరమరాద్ధాంతము. కావుననే శరీర మాద్యధర్మసాధన మని ప్రతిపాదింపబడినది. మఱియును నాత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః అను వేదమంత్రము జీవేంద్రియమనస్సముష్టికే భోక్త యను వ్యవహారమని ప్రతిపాదించుచున్నది. ఇక మనోవిషయము గాంతము.

యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా
త స్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః

ఎవడు బ్రహ్మవిషయకపరిజ్ఞానము గలిగి యెల్లప్పుడును నధ్యాత్మయోగయుక్తమైన మనస్సుతో పరమేశ్వరు నుపాసించునో వాని కింద్రియము

లన్నియు సారథికి సదశ్వములవలె స్వాధీనములై యుండును. ఈవిధముగ నింది్రియముల నదుపులో నుంచికొని

యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః
స తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే

ఏయుపాసకుడు బ్రహ్మవిషయకపరిజ్ఞానము గలిగి యెల్లప్పుడును పరిశుద్ధుడై సమనస్కుడగునో యతడు పునరావృత్తిరహితమైన పదమును పొందును.

ఈకఠమంత్రములు ఇంద్రియజయమునకును, 'తత్పదప్రాప్తికిని' మనస్సంబంధావశ్యకతను సూచించుచున్నవి. కావున నాసాయుజ్యము మనస్సంబంధ మావశ్యక మని తేలుచున్నది.

ఇక విషయవిమర్శ గావింతము. మనస్సు లేనిది జ్ఞానవ్యాపారము లేదు. అదిలేనిది యుపాసనము లేదు. ఉపాసనము లేనిచో సాయుజ్యము లేదు. కావుననే కఠోపనిషత్తు ఇంద్రియజయమునకును, తత్పదప్రాప్తికిని మనఆవశ్యకతను ప్రతిపాదించుచున్నది. ఇక మనశ్శబ్దార్థవిషయము గాంతము. మనశ్శబ్దమునకు జ్ఞానసాధనమైన భౌతికపరమాణు వర్థము. కాని యీప్రకరణమున మననము వివక్షింపబడినది. మనన మనగా జ్ఞాతవిషయము నావృత్తి చేయుట. 'అనేన చైత ఉపస్మర త్యభీక్ష్ణం సంకల్పః' జీవుడు మననముచేత ఈబ్రహ్మత్వమును ఎల్లప్పుడును స్మరించుచున్నాడు. ఈవిధముగ స్మరించుచు

ఆనంతే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి

అనంతమును, సుఖకరమును, శ్రేష్ఠమును నగు హార్దబ్రహ్మలోకము నందు ప్రతిష్ఠ నందును. అనగా నపునరావృత్తముగ సాయుజ్యము నందును,

## షష్ఠమంత్రము

తద్ధ తద్వనం నామ తద్వన మిత్యుపాసితవ్యమ్ స య ఏత దేవం వే దాభిహైనం సర్వాణి భూతాని సంవాంఛంతి

అర్థము :- తత్ హ నామ = ఆబ్రహ్మతత్త్వమే, తత్ = ప్రసిద్ధమైన, వనమ్ = ఉపాస్యవస్తువు. తత్ = ఆబ్రహ్మతత్త్వము, వన మితి = ఉపాస్యవస్తువని, ఉపాసితవ్యమ్ = ఉపాసింపదగినది. సః యః = ఏవాడు, ఏతత్ = ఈబ్రహ్మతత్త్వమును, ఏవమ్ = ఈప్రకారముగా, వేద = ఉపాసించుచున్నాడో, ఏనమ్ = ఈయుపాసకుని, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, అభిసంవాంఛంతి = కోరుచున్నవి.

తాత్పర్యము :- బ్రహ్మతత్త్వమే యుపాసింపదగినది. ఎవడు బ్రహ్మతత్త్వము నుపాసించుచున్నాడో వానిని సర్వభూతములును కోరుచున్నవి.

## వివరణము

తద్ధ తద్వనం నామ – బ్రహ్మతత్త్వమే ప్రసిద్ధమైన యుపాస్యవస్తు వని యర్థము.

వనమ్ – వన్యతే సంభజ్యతే అని వ్యుత్పత్తి. వన షణ సంభక్తౌ అను ధాతువునుండి నిష్పన్నమైన వనశబ్దమునకు ఉపాసింపబడిన దని యర్థము.

వాచాఽనభ్యుదితమ్ = వాక్కుచేత వర్ణింపనలవికానట్టియు, య న్మనసా న మనుతే = మనస్సుతో మననము చేయుటకు వీలు కానట్టియు, య చ్ఛ్రోత్రేణ నశృణోతి = చెవిచేత వినుటకు వీలు కానట్టియు, యత్ = ఏబ్రహ్మతత్త్వము కలదో, తత్ హ = ఆ బ్రహ్మతత్త్వమే, వనమ్ = ఉపాస్యవస్తువు. తత్ = అదియే వన మితి = ఉపాస్యవస్తు వని ఉపాసితవ్యమ్ = ఉపాసింపదగినది.

ఏవంవిధలక్షణవిశిష్టమైన వస్తువు నుపాసించుట యెట్లు? కావు ననే పరమానుగ్రాహకుడగు పరమేశ్వరుడు అంగుష్ఠమాత్రః పురుషో

మధ్య ఆత్మని తిష్ఠతి = జీవాధిష్ఠానమైన దహరమునందు అంగుష్ఠ మాత్రపరిమాణవిశిష్టుడై యధివసించియున్నాడు. ప్రథమావస్థయందు దహరోపాసనమును శక్తికి మించినవిషయమని యెంచియే పరమేశ్వరుడు బాహ్యారాధనోపయోగిలింగరూపమున నుపాసింపబడుచున్నాడు. బాహ్యారాధనము గావించుచు నేదం య దిద ముపాసతే=తా నారాధించుచున్న ప్రతీకము బ్రహ్మతత్త్వము గాదని యెంచి 'తస్మి న్యదంత స్త దుపాసితవ్యమ్' దహరాంతర్వర్తియగు అంగుష్ఠమాత్రుడగు పురుషు నుపాసించి 'యథోదకే శుద్ధే శుద్ధ మాసిక్తమ్' శుద్ధోదకమునందు శుద్ధోకమువలె లీనమై 'న స పున రావర్తతే' అపునరావృత్తస్థితి నందుచున్నాడు.

స య ఏత దేవం వే దాభిహైనం సర్వాణి భూతాని సంవాంఛంతి – ఈవిధముగ నుపాసించువానిని సర్వప్రాణులును కోరుచున్నారని యర్థము.

యదా సర్వే ప్రముచ్యంతే కామాః = సర్వసంకల్పత్యాగము గావించి సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః = కర్మఫలసన్న్యాసయోగము నవలంబించి చిత్తశుద్ధి గలిగి యే నాకరమంతి ఋషయో హ్యాప్తకామాః = ఆప్తకాముడై దేవయానమార్గమున పయనించువానిని సర్వాణి భూతాని సంవాంఛతి = సర్వప్రాణులును కోరుదురు. దేవయానమార్గపరిజ్ఞానముగలవాడుగాన తత్పరిజ్ఞానము గలిగించుటలో సమర్థుడని యాతని నభిగమింతురని తాత్పర్యము.

## సప్తమమంత్రము

ఉపనిషదం భో బ్రూహీ త్యుక్తా య ఉపనిష ద్బ్రాహ్మీం వావ త ఉపనిషద మబ్రూ మేతి

అర్థము:– భో=ఓయీ! ఉపనిషదమ్=ఉపనిషత్తును, బ్రూహి=ప్రవచింపుము, ఇతి=అని, (అపృచ్ఛః=అడిగితివి). యా=ఏ, ఉపనిషత్=ఉపనిష

స్తుకలదో, సా = అది, ఉక్తా = ప్రవచింపబడినది. తే = నీకు, బ్రాహ్మీం వా వ = బ్రహ్మసంబంధమైన, ఉపనిషదమ్ = ఉపనిషత్తును, అబ్రూమ = ప్రవచించితిమి, ఇతి = అని, గురుః = గురువు, ఉవాచ = పలికెను.

తాత్పర్యము :- శిష్యుడు గురువును బ్రహ్మవిషయకోపదేశము గావింపుమని యడుగ బ్రహ్మకు సంబంధించిన యుపనిషత్తు నుపదేశించితి మని గురువు పలికెను.

## అష్టమమంత్రము

తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః
సర్వాంగాని సత్య మాయతనమ్

అర్థము:- తస్యై = ఆయుపనిషత్తుకొఱకు, తపః = సాంతపనచాంద్రాయణాదికమును, దమః = బహిరింద్రియనిగ్రహమును, కర్మ = విహితకర్మయును, ప్రతిష్ఠా = స్థితిహేతువు. వేదాః = ఋగాదివేదములను, సర్వాంగాని = కల్పాదిషడంగములను, సత్యమ్ = సత్యమైన, ఆయతనమ్ = స్థానము.

తాత్పర్యము:- బ్రహ్మసంబంధమైన యుపనిషత్తుకొఱకు కృచ్ఛ్రచాంద్రాయణాదికమును, బహిరింద్రియనిగ్రహమును, సంధ్యాదివిహితకర్మలును, ఋగాదిసంహితలయొక్కయు, శిక్షాదిషడంగములయొక్కయు నధ్యయనమును ముముక్షువుల కావశ్యకములగు విషయములు.

## వివరణము

ఉపనిషత్ :— జీవేశ్వరజగద్విషయకసమగ్రజ్ఞానమును గలిగించి సాయుజ్యోపయోగియగు నుపాసనామార్గమును బోధించు గ్రంథమున కుపనిషత్తని పేరు.

బ్రాహ్మీం వావ త ఉపనిషదమ్ :- బ్రహ్మసంబంధమైన యుపనిషత్తని యర్థము.

బృహతి బృంహయ తీతి బ్రహ్మ :— తాను విస్తరించి జీవ జగత్తులను విస్తరింపజేయునది యని బ్రహ్మశబ్దమున కర్థము. బ్రహ్మ శబ్దముచేత జీవజగదీశ్వరులు వివక్షింపబడుచున్నారు. కావున బ్రాహ్మీ శబ్దమునకు జీవజగదీశ్వరులకు సంబంధించిన దని యర్థము. ఈ విషయము

శక్తిః శివ శ్చ సచ్ఛుద్ధప్రకృతిప్రత్యయోదితౌ
తౌ బ్రహ్మ సామరస్యేన సమస్తజగదాత్మకౌ

అను శివపురాణవాయుసంహితావచనముచే ప్రతిపాదింపబడుచున్నది. నామరూపవిభాగానర్హస్థితియందు జీవుడు శరీరసంబంధములేని స్థితిలో జడప్రాయుడుగా నుండుటచే జగదంతర్భావ మంగీకరింపబడినది. కావున శక్తిశబ్దముచే జీవజగత్తులు గ్రహింపబడుచున్నవి.

ప్రథమమంత్రమునందలి కేనశబ్దముచే పరమేశ్వరుడును, మన శ్శబ్దముచే శరీరమును, వదంతి అనుక్రియచే తత్కర్తయగు జీవుడును గ్రహింపబడుచున్నారు. శిష్య ప్రశ్న జీవేశ్వరజగద్విషయసంబంధి కావున గురు వావిషయమును వివరించి యుపసంహారమున 'బ్రాహ్మీం వావ త ఉపనిషద మబ్రూమ' అని విషయోపసంహారము గావించినాడు.

పూర్వమంత్రమునందు జీవేశ్వరజగద్విషయక సమగ్రజ్ఞానప్రతి పాదకమైన యుపనిషద్విషయము ప్రస్తావింపబడినది. ఈమంత్రమునందు తదంగములు ప్రతిపాదింపబడుచున్నవి.

తపోదమకర్మ వేదతదంగము లుపనిషదంగములుగా నిర్ణయింప బడినవి. కేవలాధ్యయనముచేత నుపనిషత్తులకు సార్థక్యము గలుగదు. కావున నధ్యేతలు తత్ప్రతిపాదితవిషయముల నాచరణయం దుంచినపుడే యుపనిషదధ్యయనమునకు సార్థక్యము గలుగును. కావున నుపనిష దంగము లనగా నధ్యేతయగు ముముక్షువున కాచరణాంగములని పర మార్థము.

'తపః కృచ్ఛ్రాదికర్మ చ' = కృచ్ఛ్రాదివ్రతములకు తపస్సని పేరు. 'కృచ్ఛ్రం సాంతపనాదికమ్' = సాంతపనాదివ్రతములకు కృచ్ఛ్రమని పేరు. కృచ్ఛ్రాతికృచ్ఛ్రము, చాంద్రాయణము, తప్తకృచ్ఛ్రము త్రిరాత్రకృచ్ఛ్రము, పరాకకృచ్ఛ్రము, ప్రాజాపత్యకృచ్ఛ్రము, సాంతపనకృచ్ఛ్రము అని కృచ్ఛ్ర మేఱువిధములుగా నున్నది.

1. కృచ్ఛ్రాతికృచ్ఛ్రము — ఇరువదియొక్కదినములు పాలు త్రాగి యుండుట.

2. చాంద్రాయణము — వ్రతారంభమగు బహుళపాడ్యమినాడు పదునాలుగు కబళములు భుజించి విదియ మొదలుకొని క్రమముగ దినమున కొక కబళమువంతున తగ్గించుకొనుచు వచ్చి యమవసనాడేమియును దినక యుపవసింపవలయును. శుక్ల పాడ్యమినాడొకకబళము భుజించి విదియ మొదలుకొని యొక్కొక్కకబళమువంతున నెక్కువగ భుజించుచు పూర్ణిమతో వ్రతము సమాప్తి నొందింపవలయును. ఈ విధముగ నొకనెల యాచరించుటకు చాంద్రాయణకృచ్ఛ్ర మని పేరు.

3. తప్తకృచ్ఛ్రము — మూడుదినములు వేడినీరును, మూడు దినములు వేడిపాలును, మూడుదినములు వేడినేయియును త్రాగి, మూడుదినము లేమియును త్రాగక, తినక యుపవసించుటకు తప్తకృచ్ఛ్ర మని పేరు.

4. త్రిరాత్రకృచ్ఛ్రము — మూడుదినములు ఉపవసించుట.

5. పరాకకృచ్ఛ్రము — ఇతరచింతలు లేక నియమాన్వితుడై పండ్రెండుదినము లుపవసించుట.

6. ప్రాజాపత్యకృచ్ఛ్రము — మూడుదినము లుదయము మాత్రముభుజించి, మూడుదినములు సాయంకాలము భుజించి, మూడు దినము లయాచితముగ లబ్ధమైనదానిని భుజించి, మూడుదినము లేమియును భుజింపక యుపవసించుటకు ప్రాజాపత్యకృచ్ఛ్ర మని పేరు.

7. సాంతపనకృచ్ఛ్రము — గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము, కుశోదకము ననువానిని క్రమముగ నొక్కొక్కదినము భుజించి యేడవనాడేమియును దినక యుపవసించుటకు సాంతపనకృచ్ఛ్రమని వ్యవహారము.

ఈవ్రతము లన్నియును శరీరము కర్మాచరణమునకును తద్ద్వారా సాయుజ్యప్రాప్తికిని ననుకూలముగా నుండుటకై యాచరింపవలసినవి.

దమః — దమ మనగా బహిరింద్రియనిగ్రహము.

త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణములు బహిరింద్రియములు. వీని నదుపులోనుంచినగాని శరీర మారోగ్యవంతమై కర్మాచరణమున కనుకూలముగా, సమర్థముగా నుండదు. ఈయింద్రియములు విషయానుభవమునకై యుద్దేశింపబడినవి. శబ్దస్పర్శరూపరసగంధములువిషయములు వీనిమితానుభవమున శరీర మారోగ్యవంతమును, నమితానుభవమున రోగభూయిష్ఠమును నగును. కావున దమమును నాచరణాంగముగా ప్రతిపాదింపబడినది.

కర్మ — సంధ్యావందనాదివిహితకర్మ యని యర్థము.

కర్మలు రెండువిధములు — శారీరకము లని, విహితము లని. ఈ రెంటియందును నీప్రకరణమున విహితకర్మలుమాత్రమే వివక్షింపబడినవి. సంధ్యావందనాదులు శరీరారోగ్యమున కుపయోగపడుచు తద్ద్వారా మానసికాభ్యున్నతికి తోడ్పడుచున్నవి. కావున విహిత కర్మలును నాచరణాంగములుగా ప్రతిపాదింపబడినవి.

వేదాః, సర్వాంగాని — ఋగాదిచతుఃసంహితలును, కల్పాది షడంగములు నని యర్థము.

సంహితాంగాధ్యయనమునగాని సమగ్రపరిజ్ఞానము గలుగదు. కావున నేతదధ్యయనమును నావశ్యకాంగముగా ప్రతిపాదింపబడినది.

సంహితలు కర్మకాండబహుళములు. ఋగ్వేదమునందు కర్మకాండకు సంబంధించిన విషయము లధికముగను, ఉపాసనాకాండకు సంబంధించిన విషయములు తక్కువగను నున్నవి. యజుర్వేదమునందు కర్మోపాసనా కాండలకు సంబంధించిన విషయములు దాదాపు సమానముగ నున్నవి. సామవేదము పరమేశ్వరస్తోత్రబహుళము. అధర్వణవేదమునందు కర్మోపాసనాకాండలకు సంబంధించిన విషయములు చాల తక్కువగ నున్నవి. లోకవ్యవహారమునకు సంబంధించిన విషయము లధికముగ నున్నవి.

'అష్టవర్షం బ్రాహ్మణ ముపనీయీత త మధ్యాపయీత' అను శ్రుతి బ్రాహ్మణబాలున కెనిమిదవయేట నుపనయనము గావించి వేదాధ్యయనము చేయింపవలయు నని శాసించుచున్నది. సంహితాధ్యయనముతోబాటుగ సంగాధ్యయనమును గావింపవలయును.

శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్ప శ్చేతి షడంగాని వేద స్యాహు ర్మనీషిణః

శిక్షావ్యాకరణఛందోనిరుక్తజ్యోతిషకల్పములనునారును వేదాంగములు ఇందు శిక్ష వర్ణస్వరములకును, వ్యాకరణము శబ్దముల సాధుత్వాసాధుత్వములకును, ఛంద స్సనుష్టుబాదివృత్తములకును, నిరుక్తము పదార్థ వాక్యార్థనిర్ణయమునకును, జ్యోతిషము వాస్తుముహూర్తములకును, కల్పము యాగవిధానములకును సంబంధించినవి.

ఈవిధముగ బ్రహ్మచర్యాశ్రమకర్మల నాచరించుచు సంహితాంగాధ్యయనము గావించుచుండ

అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్యయాజినః
సుకృతం భవతి

చాతుర్మాస్యయాగము గావించిన నక్షయ్యమగు సుకృతము గలుగు ననియును

త ద్యథేహ కర్మచితో లోకః క్షీయతే
ఏవ మే వాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే

కర్మచితలోకములవలె పుణ్యచితలోకములును నశించుననను పరస్పరవిరుద్ధవాక్యములను గాంచుటచే సంశయము గలిగినది. మఱియును

స త్వ మగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో!
ప్రబ్రూహి త్వం శ్రద్దధానాయ మహ్యమ్
స్వర్గలోకా అమృతత్వం భజంత
ఏత ద్ద్వితీయేన వృణే వరేణ

అనుశ్రుతి స్వర్గ్యాగ్నిచయనమువలన నమృతత్వము లభించునని ప్రతిపాదించుచున్నది.

త్రియంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మామృతాత్

అనుశ్రుతి త్రియంబకయజనమువలన నమృతత్వము ప్రాప్తించునని బోధించుచున్నది. ఈవిధముగ పరస్పరవిరుద్ధముగనున్న వాక్యములను గాంచి సంశయాపనోదనమునకై గురువు నభిగమించినాడు. ఇంతియే గాదు.

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేద మాయా న్నా స్త్యకృతః కృతేన
తద్విజ్ఞానార్థం స గురు మే వాభిగచ్ఛే
త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్

లోకములు కర్మఫలవ్యాప్తము లనియు, నాకారణమువలన క్షయిష్ణువు లనియును, నకృతమగు సాయుజ్యము కర్మసాధ్యము గాదనియును నిర్ణయించికొని తద్విజ్ఞానార్థమ్=ఆవిషయమునకు సంబంధించిన విశేషజ్ఞానముకొఱకు సమిత్పాణియై శ్రోత్రియుడును, బ్రహ్మనిష్ఠుడును నగు గురువు నభిగమించి 'ఉపనిషదం భో బ్రూహి' = ఉపనిషత్తు నుపదే

శింపు మని ప్రార్థించినాడు. గురువును 'బ్రాహ్మీం వావ త ఉపనిషద మబ్రూమ'=నీకు బ్రహ్మకు సంబంధించిన యుపనిషత్తు నుపదేశించితి మని సమాధానము చెప్పినాడు. ఈవిషయమే సప్తమమంత్రమునందు ప్రతిపాదింపబడినది.

## నవమమంత్రము

యో వా ఏతా మేవం వే దాపహత్య పాప్మాన మనంతే
స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి

అర్థము:- యః వా=ఏముముక్షువు, ఏతామ్=ఈయుపనిషత్తును, ఏవమ్=ఈప్రకారము, వేద=తెలిసికొనుచున్నాడో, సః=అతడు, పాప్మానమ్=పాపమును, అపహత్య=విడిచి, అనంతే=అంతములేనిదియును, జ్యేయే=మిక్కిలిశ్రేష్ఠమైనదియును, స్వర్గే=సుఖకరమైన, లోకే=బ్రహ్మలోకమునందు, ప్రతితిష్ఠతి=ఉండును, ప్రతితిష్ఠతి=ఉండును.

తాత్పర్యము:- ఈయుపనిషత్తును గురుముఖతః అధ్యయనముచేసి తత్ప్రతిపాదితవిషయములను మననము చేయు ముముక్షువు కర్మబంధమును వీడి బ్రహ్మలోకమునందు శాశ్వతస్థితి నందును.

## వివరణము

ఈమంత్రమే యుపనిషత్తునందలి యంతిమమంత్రము. ద్వితీయ ఖండమునందలి

ఇహ చే దవేదీ దథ సత్య మస్తి
న చే ది హావేదీ న్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి

అను నుపసంహారమంత్రమునందు అమృతీభవనము ఫలముగా ప్రతిపాదింపబడినది. ఈమంత్రమునందు అమృతీభవనానంతరస్థితి వర్ణింపబడుచున్నది.

ఏతా మేవం వేద :- ఈయుపనిషత్తు నీవిధముగా తెలిసికొను చున్నా డని యర్థము.

ఏవమ్=ఈప్రకారముగా నని యర్థము. అనగా గురూపదిష్ట మార్గమున నని యర్థము. గురూపదేశము లేనిది విషయజ్ఞానము గలుగుట యసంభవము. ఈవిషయము ఛాందోగ్యమున సోదాహరణముగా చక్కగా ప్రతిపాదింపబడినది.

> యథా సోమ్య! పురుషం గంధారేభ్యోభినద్ధాక్ష మానీయ తం తతోఽతిజనే విసృజే త్స యథా తత్ర ప్రాఙ్వోద ఙ్వాధరాఙ్వా ప్రధ్మాయీ తాభినద్ధాక్ష ఆనీతోఽభినద్ధాక్షో విసృష్టః. తస్య యథాభినహనం ప్రముచ్య ప్రబ్రూయా దేతాం దిశం గంధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామా ద్గ్రామం పృచ్ఛన్ పండితో మేధావీ గంధారా నే వోపసంపద్యే త్తైవ మే వేహాచార్యవా న్పురుషో వేద

గంధారదేశవాసియగు నొకనిని దొంగలు కన్నులకు గంతలు గట్టి తీసికొనివచ్చి యొకనిర్జనారణ్యమునందు విడిచి వెళ్ళిరి. అంత నాతడు కన్నులకు గంతలు కట్టి తీసికొనివచ్చి గంతలతోనే విడిచివెళ్ళినారనుచు నన్నిదిక్కులకు పరువిడుచు నరచుచుండెను. అంతలో నాదారిన బోవు దయామయు డొకడాతనికట్లు విప్పి యీదిశగ గంధారమున్నది. గ్రామములందు దారి నడుగుచు నేగిన గంధారము చేరగలనని చెప్పెను. ఆవిధముగ నడుగుచు గ్రామమునుండి గ్రామము చేరుచు తనయింటికి చేరి సుఖించినట్లు ఆచార్యవంతుడగు వాడు విషయ పరిజ్ఞానముగలవా డగునని చెప్పెను.

కట్లు విప్పి గంధారదేశమునకు మార్గమును తెలియబరచకున్నచో గంధారవాసి స్వదేశమును చేరి సుఖించుట యసంభవము. అటులే కర్మవశమున పరమేశ్వరునకు దూరమై సంసరణచక్రమున

దగుల్కొని పరితపించుచున్న జీవునకు స్వవిషయమును, పరమేశ్వర విషయమును, పరమేశ్వరునినుండి దూరమైనవిషయమును, మఱల నాతని జేరి సుఖించుమార్గము నాచార్యుడు తెలియబర్చకున్న నీసంసార సముద్రమునందు మునుకలు వేయుచున్న ముముక్షువునకు తరించుట కవకాశమే లేదు. కావుననే ముముక్షువున కాచార్యావశ్యకతయెంతేని గలదని తేలుచున్నది. వేద = తెలిసికొనుచున్నా డని యర్థము.

ఉపనిషత్సంప్రదాయమున జ్ఞానార్థకములగు ధాతువులు ఛాగ పశున్యాయమున నుపాసనయందు సమన్వయింపబడినవి. కాని ప్రకృత ప్రకరణమున వేదనము మననమందు పర్యవసించుచున్నది. తెలిసి కొనిన విషయమును మననము చేయుచున్నగాని వేదితవిషయమునకు స్థిరత యేర్పడదు.

ఏతా మేవం వేద — ఈయుపనిషత్తు నీవిధముగ మననము చేయుచున్నా డని యర్థము. కాని కేవలమననము ప్రయోజనకారి కాదు. ఉపనిషదధ్యయనపరమప్రయోజనము సాయుజ్య మనునది నిర్వి వాదము. కేవలాధ్యయనమాత్రమున సాధింపదగిన దేదియును లేదు. అధ్యయనమువలన విషయపరిజ్ఞానమును, విషయపరిజ్ఞానము కలిగిన తరువాత తత్ప్రతిపాదితకర్మాచరణమును క్రమముగ నలవడినగాని యధ్యయనమునకు ప్రయోజన ముండదు. ఇంతియే గాదు. కేవల కర్మాచరణమాత్రమునను సాయుజ్యప్రాప్తి గాదు. కర్మలు సంసరణా పాదకములు. అనగా జననమరణపరంపరాపాదకములు. ఈవిషయము తెలిసికొని విరక్తుడై యీజన్మయందే సాయుజ్యమును సాధించుటకై యత్నింపవలయును. కావున నీవాక్యమునందలి వేద యనుక్రియకు కేవలవేదన మర్థము గాదనియును, వేదన ముపాసనయందు పర్యవసిం చిననే యధ్యయనము సార్థక మగుననియును తేలుచున్నది.

పాప్మాన మపహత్య:- పాపమును విడిచి యని యర్థము.

ఈమంత్రమునందలి పాప్మశబ్దము పుణ్యమున కుపలక్షకము. పాపమువలె పుణ్యమును ప్రతిబంధకమే ఈరెంటిసంబంధమును వదలించికొనినగాని యమృతత్వమున కవకాశము లేదు. పుణ్యపాపసంబంధమున్నంతవఱకును పునర్భవము తప్పదు. పాపానుభవమునకు నరకము స్థానమైనట్లు పుణ్యానుభవమునకు స్వర్గాదులు స్థానములు. పుణ్యపాపముల సమగ్రఫలము నేజన్మయందును సమగ్రముగ ననుభవించుట కవకాశము లేదు. ప్రతిజన్మాంతమునను నననుభూతపుణ్యపాపకర్మల ఫలము సంచితరూపమున నిలువయుండును. సంచితభాగము నాధారముగా గొనియే మఱల జన్మ సంభవించుచుండును. కావున పుణ్యపాపసంబంధమును వదలించికొనుట అపునర్భవదృష్ట్యా యత్యంతావశ్యక మగుచున్నది.

అయిన వీనిసంబంధము వదలించికొనుట యెట్లు ?

ఉపాసనారంగప్రవేశ మైనతరువాత ముముక్షువు తత్ప్రయుక్త కర్మలుమాత్రమే యాచరించుచుండును. కాన తత్కాలమున నాతనికి పుణ్యపాపములతో సంబంధమే లేదు. కారణము స్వార్థపరత నశించుటయే. స్వార్థపరత్వ మున్నగాని కర్మలకు పుణ్యపాపప్రసక్తి యుండదు. ఉపాసనారంగప్రవేశమునకు పూర్వ మీజన్మమున గావింపబడిన కర్మలున్నవి. వానిఫలము ననుభవింపవలయును. సంచిత మున్నది. ఈరెంటి సంబంధము వదలినగాని మృత్యుమోక్షపూర్వకాపునర్భవమున కవకాశము లేదు. ఇవి యున్నంతవఱకును వీని ననుసరించి పునర్భవమును, తత్పూర్వము మృత్యువును తప్పవు. మృత్యుమోక్షపూర్వకాపునర్భవము కావలయునన్న ముందు వీనిసంబంధము వదలించుకొనవలయును.

## సంచితప్రారబ్ధాగామివివరణము

ఈసందర్భమున నొకవిషయము ప్రధానముగా గమనింపవలయును ప్రస్తుతప్రకరణమున కర్మవిషయమును చక్కగా వివరించినగాని

విషయము సుబోధము గాదు. కర్మ సంచిత ప్రారబ్ధాగామిభేదములచే త్రివిధము. సంచిత మనగా కూడబెట్టినది. ప్రారబ్ధ మనగా నారంభింప బడినది. ఆగామి యనగా రాబోవునది.

## సంచితము

కర్మ యనగా చేయబడినది యని యర్థము. ఎవరిచేత? జడములందు కర్తృత్వ మనుపపన్నముగాన చేతనులచేత నని సమాధానము చేతను లనగా నెవరు? ఉపనిషత్సిద్ధాంతమున జీవేశ్వరు లిద్దరే చేతనులు. ఈయధికరణమున జీవులే ప్రకృతులు. కావున కర్తృత్వవిశిష్టులు జీవులనియే చెప్పవలయును. కేవలజీవుల కనగా శరీరవిశిష్టులుగాని జీవులకు కర్తృత్వము లేదు. కారణము సాధనమగు శరీరము లేకపోవుటయే 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' అనువాక్య మీవిషయమునే ప్రతిపాదించుచున్నది. ఛేదనసాధనమగు పరశువు లేనిది ఛేదన మసంభవమైనట్లు కర్మసాధనమగు శరీరము లేనిది జీవునకు కర్తృత్వము లేదు. కావున జీవులు శరీరము సధిష్ఠించి కర్మ లాచరించుచున్నారు. కాని యిచట నొకసందేహమునకు తా వున్నది. జీవుల కీశరీరరూపాధిష్ఠానసంబంధ మెట్లు గలిగినది? ఈజన్మకు పూర్వజన్మ కారణ మనునది యనుభవసిద్ధమును, ప్రామాణికమును నయిన ప్రథమశరీరసంబంధ మెట్లు కలిగిన దను శంక మిగిలియేయున్నది. ప్రథమశరీరము పరమేశ్వరానుగ్రహాలబ్ధ మనువిషయము ముండకోపనిషత్తునందు ద్వితీయ ముండక ప్రథమఖండమున నిర్ణయింపబడినది.

## ప్రథమశరీరసృష్టి

> ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ
> ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ. విశ్వస్య ధారిణీ

ఈమంత్రము పరమేశ్వరుడు జీవులను, మనస్సును, త్వగాదిజ్ఞానేంద్రియపంచకమును, వాగాదికర్మేంద్రియపంచకమును, పృథివ్యప్తేజోవాయ్వా

కాశములను సృజించినట్లు ప్రతిపాదించుచున్నది. తరువాత పంచమ మంత్రము

> తస్మా దగ్నిః సమిధో యస్య సూర్యః
> సోమా త్పర్జన్య ఓషధయః పృథివ్యామ్
> పుమాన్ రేతః సించతి యోషితాయాం
> బహ్వీః ప్రజాః పురుషా త్సంప్రసూతాః

పరమేశ్వరు డగ్నిసమిత్సూర్యచంద్రమేఘఓషధులను సృజించినా డని యును, పురుషుడు స్త్రీయందు రేతఃసేచనము చేయుటవలన మైథున సృష్టి యారంభమైన దనియును ప్రతిపాదించుచున్నది.

ఇచట నొకవిషయము ప్రధానముగా గమనింపవలయును. ద్వితీయమంత్రమున మనఃసర్వేంద్రియసృష్టి ప్రతిపాదింపబడినది. ఐదవ మంత్రమున పుమాన్, స్త్రీశబ్దములు ప్రయోగింపబడినవి. కేవలజీవు నియందుగాని, కేవలశరీరమునందుగాని యీశబ్దములకు ప్రయోగము లేదు. జీవయుక్తమగు స్థూలసూక్ష్మశరీరములకే స్త్రీపురుషశబ్దవ్యవ హారము వాడుకలో నున్నది. జీవాపేతమగు శరీరమునకు శవ మను వ్యవహార మున్నది. పుంస్త్రీవ్యవహారము స్థూలసూక్ష్మశరీరసమష్టిప్ర యుక్త మైనది. కేవలజీవున కీవ్యవహారము లేదు. కావున పరమేశ్వ రుడే మనఇంద్రియములతో బాటు స్థూలశరీరమునుగూడ సృష్టించి 'త త్సృష్ట్వా త దే వానుప్రావిశత్' జీవునితో బాటుగ శరీరమున ప్రవే శించెనని తెలుచున్నది.

> ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః

జీవేంద్రియమనస్సమష్టికే భోక్త యను వ్యవహారమని కఠోపనిషత్తు ప్రతి పాదించుచున్నది. ఇప్పటినుండియే కర్మసాధనమగు స్థూలసూక్ష్మాత్మక శరీరము లభించుటచే కర్మ ఆరంభమగును. కావున ప్రథమశరీరము పరమేశ్వరసృష్టముచు, పరమేశ్వరానుగ్రహలబ్ధము నని తెలుచున్నది.

కర్మలు రెండువిధములు — పుణ్యకర్మ లని, పాపకర్మ లని. పరోపకారకములు పుణ్యకర్మలని, పరాపకారకములు పాపకర్మలని వ్యవహారము. ఇయ్యది సాంఘికదృష్టి ననుసరించి వచ్చిన వ్యవహారము. మతదృష్ట్యా విహితకర్మలని యింకొక విభాగము గలదు. విహితకర్మ లాచరించిన పుణ్యము లేదు. కాని యాచరింపకున్న ప్రత్యవాయము తప్పదు. విహితకర్మలలోనివే నైమిత్తికములు. ఇవియును నాచరింపకున్న ప్రత్యవాయాపాదకములే. కామ్యము లాచరించిన పుణ్యము నుత్పాదించి తద్ద్వారా ఊర్ధ్వలోకప్రాపకము లగుచున్నవి. ఆచరింపకున్న నేవిధమగు ప్రత్యవాయమును లేదు.

పరమేశ్వరసృష్టి ననుసరించి 'శతమితి శతం దీర్ఘమాయుః' అను శ్రుతివలన మానవపరమాయుర్దాయము నూరుసంవత్సరములు. ఇందు బాల్యయౌవనకౌమారవార్ధకము లని నాలుగవస్థలు. ఆయురంతమున మరణము — జీవునకు శరీరవియోగము.

యథా చ మరణం ప్రాప్య అత్మా భవతి గౌతమ!
యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః
స్థాణు మన్యేనుసంయంతి యథాకర్మ యథాశ్రుతమ్

అను కఠమంత్రముల ననుసరించి మరణాంతమున యథాకర్మ = ప్రథమశరీరప్రాప్త్యనంతరమున నాచరింపబడిన కర్మ ననుసరించి మఱల చేతనజన్మయో, యచేతనజన్మయో సంభవించును. ఇయ్యది ద్వితీయ జన్మ. తరువాత జన్మపరంపర. ద్వితీయజన్మ ప్రభృతి యన్నియును కర్మోపాత్తములే.

## సంచితము

ఇక సంచితవిషయము గాంతము. సంచిత మనగా కూడబెట్టిన దని యర్థము. ప్రథమజన్మ పరమేశ్వరానుగ్రహలబ్ధ మగుటచే తత్పూర్వము కర్మ లేదు. ప్రథమశరీర ప్రాప్తితరువాత కర్మారంభ మైనది.

మరణమువఱకు కర్మ లాచరించినాడు. నిర్ణీతకాలాంతమున మరణించి నాడు. పుణ్యపాపాపాదకములు,ప్రత్యవాయజనకములగు కర్మ లాచరించి నాడు. వీనిఫలము కొంతవఱ కాజన్మయందే యనుభవించినాడు. ఏజన్మ యందలి కర్మఫల మాజన్మయందే యనుభవింపవలయునను నియ మము లేదు. మఱియును నాజన్మయందే యనుభవించుట కవకాశమును లేదు. ఇంతియేగాదు, కామ్యకర్మలగు జ్యోతిష్టోమాదులఫలము స్వర్గా దులయం దనుభవింపవలయును. ఈశరీరముతో లోకాంతరములయందు కర్మఫలము ననుభవించుట కవకాశము లేదు. కావున నీశరీరము నిచ్చ టనే విడిచి లోకాంతరముల కేగవలయును. కర్మానుభవమునకై స్వర్గ మున భోగశరీరమును, నరకమున యాతనాశరీరమును నొసంగబడును. ఆయాలోకములయం దాయాఫలము ననుభవించిన తరువాత

> నాకస్య పృష్ఠే తే సుకృతేనుభూ
> త్వేమం లోకం హీనతరం వా విశంతి

ఈలోకమునుగాని, యింతకన్న హీనతరమగులోకమునుగాని ప్రవేశిం చును. ఈమంత్రమునందలి సుకృతశబ్దము పాపమున కుపలక్షకము.

ప్రథమజన్మకృత యావత్కర్మఫలమును మరణానంతరమున స్వర్గనరకాదులయందు సమగ్రముగా ననుభవించుట కవకాశము లేదు. ఒకవేళ ననుభవించుట కవకాశమున్న మఱల జన్మ కవకాశమేయుండదు. యావత్కర్మఫలానుభవావకాశాభావము పరమేశ్వరనిర్ణయము. ఈ నిర్ణయము ననుసరించి కొంత నిలువయుండును. దీనికే సంచిత మని వ్యవహారము. ఈసంచితము కేవలపుణ్యమేయైన నందు కొంతకర్మ ననుసరించి భూరాదిలోకములందు

> యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః
> స్థాణు మన్యేనుసంయంతి యథాకర్మ యథాశ్రుతమ్

ఉత్తమజన్మను, పాపమే నిలువయున్న తదనుసారముగ హీనజన్మను, పాపమును నత్యంతాధికముగనున్న స్థాణ్వాదిజన్మను పొందును. స్థాణువులుగూడ జీవవిశిష్టము లనుట యార్యసంప్రదాయము.

## ప్రారబ్ధము

ఇప్పటివఱకును సంచితవిషయము వివరించినాము. ఇక ప్రారబ్ధ విషయము గాంతము. ప్రారబ్ధ మనగా నారంభింపబడిన దని యర్థము. సంచితమునందలి కొంతకర్మ నాధారముగా జేసికొని యీజన్మయందలి శరీరము గైకొనబడిన దని వివరించినాము. కర్మోపాత్తమగు నీశరీరము నకే ప్రారబ్ధ మని పేరు. ఈవిషయము

మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా
యావ న్న భిద్యతే కాయ స్తావ త్ప్రాజయ శంకరమ్

అను పురాణవచనముచే ప్రతిపాదింపబడినది. ఈప్రారబ్ధము పూర్వ జన్మయందలి కర్మ ననుసరించి యుండును. పాపాధిక్యమున వచ్చిన జన్మ మైనచో శరీర మంగవికలముగనో, రోగభూయిష్ఠముగనో యుండును. ఏవంవిధలోపభూయిష్ఠమగు శరీర మున్నంతవఱకును తత్ప్రయుక్తమైన బాధ లనుభవింపక తప్పదు.

## ఆ గా మి

ఆగామి యనగా రాబోవునది యని యర్థము. ఆగామిశబ్దము సాపేక్షము. ఆగామి = రాబోవునది. ఎప్పటినుండి రాబోవునది? ఇది యొకజటిలమగు ప్రశ్న. కొంత యుపోద్ఘాతము చెప్పినగాని విషయము చక్కగా బోధపడదు. ఆగామి యనగా నొకసమయము హద్దుగా జేసికొని యప్పటినుండి రాబోవునది యని యర్థము. అయిన నాసమయ మేది?

సంచిత మనగా నిలువయున్నది. ప్రారబ్ధ మనగా నీజన్మతో నారంభింపబడినది. కావున నాగామి యారెంటిలోనను జేరదు. కావున నీజన్మయందలి కర్మకు సంబంధించినదియేయని చెప్పవలయును. ఈజన్మ యందు జన్మించినప్పటినుండి మరణించువఱకును ప్రాణి కర్మలు చేయు చునే యుండును. అయిన నీహద్దు ఎప్పటినుండి యేర్పడును?

న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః

ఎవడును, ఎప్పుడును, ఒకక్షణకాలమైనను నేకర్మయును చేయకుండ నుండలేడు. కారణము ప్రకృతికి బద్ధుడై యనగా శరీర మున్నంతవఱ కును నేదియో కర్మ చేయుచునేయుండవలసియుండుటయే. కాయిక వాచికకర్మల నాపవచ్చును. కాని మానసికకర్మ నాపుట కవకాశము లేదు. దీనినిగూడ నాపుట సంభవించిన కర్మసంబంధము పూర్తిగ తొలగిపోవును. కాని దీని నాపుట కవకాశము కలదా యనునది ప్రస్తుత ప్రశ్న.

మానసికకర్మ యనగా నేమో వివరించినగాని విషయము సుబో ధము గాదు. 'అన్నమయం హి సోమ్య మనః' అనుశ్రుతి ననుసరించి మనస్సు పార్థివపరిమాణు వని తెలియుచున్నది. కావున మనస్సు జడ మని చెప్పకతప్పదు. జడములకు కర్తృత్వము లేదుగాన మానసికకర్మ యనుట యనుపపన్నము. అయిన మానసికకర్మ యనగా నేమి? మన అవబోధనే అను ధాతువునుండి మన్యతే అనే నేతి మనః అను శబ్దము నిష్పన్నమైనది. ఈనిష్పత్తి ననుసరించి మనస్సు సాధనముమాత్రమే. సాధకుడగు జీవునకు సాధ్యమును సాధించుటలో మనస్సు సాధనము. మనశ్శబ్దమే మననము జీవునకు సంబంధించినదని తెలియజేయుచున్నది. కావున మానసికకర్మ యనగా జీవునకు సంబంధించిన సంకల్పరూపకర్మ యని తేలుచున్నది. ఈవిమర్శచే మానసికకర్మ నాపుట యనగా సంకల్ప

ముల నాపుట యని తేలుచున్నది. అయిన సంకల్పముల నాపుట సాధ్యమా యనునది ప్రస్తుత ప్రశ్న.

సంకల్పము లున్నంతవఱకును తత్పూర్త్యర్థమై కర్మాచరణము తప్పదు. కర్మ లాచరించుచున్నంతవఱకును పుణ్యాపాపసంబంధము తప్పదు. ఆ సంబంధ మున్నంతవఱకును నూర్ధ్వలోకగమనమును, జననమరణములును తప్పవు. కావున సర్వమునకును సంకల్పము లాధారమని తేలుచున్నది. సంకల్పములు నశించిన కర్మలు లేవు. పుణ్యాపాపములు లేవు, ఊర్ధ్వలోకగమనము లేదు. మరణము లేదు, జననము లేదు.

శరీర మున్నంతవఱకును తత్పోషణ జరుగుచునేయుండవలయును దానికై కర్మ తప్పదు. ప్రత్యవాయము గలుగకుండుటకై విహితకర్మలును తప్పవు. విహితకర్మలను మానిన మానవచ్చునుగాని శారీరికకర్మలు మాత్రము తప్పవు. తత్ప్రయుక్తమైన పుణ్యాపాపసంబంధమును తప్పదు. అయిన శరీర ముండి తత్పోషణము జరుగుచు సంకల్పసంబంధము వదలించుకొనుట సాధ్యపడునా? ఇదియును నొక జటిలమగు సమస్యయే.

సంకల్పపూర్వకముగ నాచరించినను స్వార్థగంధ మున్నపుడే కర్మలకు పుణ్యాపాపసంబంధ ముండును. స్వార్థగంధరహితములైన ఔపాసానికకర్మలకు పుణ్యాపాపసంబంధము లేకపోవుటయేగాక యవి పరమేశ్వరానుగ్రహోపాదకము లగును. ఇందుకు చండీశదక్షులే ప్రబలోదాహరణము. స్వార్థగంధరహితుడై పరమేశ్వరోపాసన గావించుచు నుపాసనకు భంగము గావించిన తండ్రిని పాదచ్ఛేదము గావించిన చండీశుడు శివానుగ్రహపాత్రుడైనాడు. దక్షుడో స్వార్థాంధుడై యనీశ్వరయాగము గావించి శివనిగ్రహమునకు గురియైనాడు. కావున నౌపాసనికకర్మలు సంకల్పపూర్వకములైనను పునర్భవాపాదకములు గావని తేలుచున్నది.

ఇప్పటివఱకు నేమి సంభవించినది? సంకల్పబాహుళ్యము నశించి సాయుజ్యసంకల్ప మొకటిమాత్రము మిగిలినది.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేస్య హృది శ్రితాః
అథ మర్త్యోమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే

కామ్యంతే ఇతి కామాః = కామము లనగా సంకల్పములు. సర్వ సంకల్పనాశ మైనపుడు మర్త్యుడు అమృతు డగును. అనగా మరణింప నున్నవాడు మరణరహితు డగును. అత్ర = ఈజన్మయందే, ఈశరీరము నందే, దహరమునందే బ్రహ్మను పొందును. ఆపొందుటయు 'యథోదకే శుద్ధే శుద్ధ మాసిక్తమ్' శుద్ధోదకము శుద్ధోదకమును పొందునట్లు పొంది 'న స పున రావర్తతే న స పున రావర్తతే' తిరిగి యావృత్తిని పొందడు. 'ఇమం మానవం నాऽవర్తంతే' మఱల మానవాదిలోకము లందు జన్మింపడు.

సంకల్పపూర్వకముగ కర్మల నాచరించు జీవుడు సంకల్పరహితుడై అపునరావృత్తముగ హార్దబ్రహ్మయందు సాయుజ్యము నందినాడు. కాని శరీరమునుండి యుత్క్రమింపలేదు. ఇదివఱకు ప్రారబ్ధభోగాంతమున నుత్క్రమణము సంభవించుచుండెడిది. కాని ప్రారబ్ధశేషమున్నది. అప్పటివఱకును శరీరము పోషింపబడుచుండవలసినదే. కాని సంకల్పపూర్వకముగ పోషించుకొనుచున్న జీవుడు సంకల్పరహితుడై హార్దబ్రహ్మయందు సాయుజ్యము నందినారు. అయిన శరీరపోషణ మెట్లు జరుగును?

డ్రైవరు ట్యాంకులో పెట్రోలు నింపి కారులో కూర్చుండి బ్రేకుమీద కా లుంచి చక్రము పట్టుకొని కారును స్టార్టు చేసినాడు. లోపల ప్రయాణికు లున్నారు. కారు నడుచుచున్నది. కాని దైవికముగ మనస్సు భ్రమించినది. ఆతనికి స్పృహ లేకుండపోయినది. ఇతఃపూర్వము వలె నాతడు సంకల్పపూర్వకముగ కారును నడుపుటలేదు. కాని

యభ్యాసవశమున నన్నిపనులును జరిగిపోవుచున్నవి. బ్రేకును నొక్కుచు వేగము తగ్గించుచు హెచ్చించుచున్నాడు. ఎదుటనుండి వచ్చుచున్న కార్లను తప్పించుకొనుచున్నాడు. కాని యిం దేదియును నాతడు సంకల్ప పూర్వకముగ చేయుటలేదు. గమ్యస్థానమున కారు నాపినాడు. ప్రయాణికులు దిగి తమతమస్థానముల కేగినారు. కాని యాతడు కారునుండి దిగడు. కారుకు సంబంధించిన పనులుమాత్రము యథావిధిగ జరిగిపోయినవి. అయినను నాత డాభ్రమలోనే యున్నాడు. ఆతనిమన స్సొక విషయమునందుమాత్రమే కేంద్రీకృతమై తద్భావములోనే నిమగ్నమై యుండుటచే కారునుండి దిగవలయునను సంకల్పముగాని, తదనుకూల ప్రయత్నముగాని లేదు. ఈస్థితి యాతనిమన స్సాప్రయత్నమునుండి మరలినగాని మారదు.

ఇక ప్రకృతవిషయము మాలోచింతము. సంకల్పవిశిష్టుడై ప్రతికర్మ యందును ప్రవృత్తిగలిగి తదనుగుణముగ కర్మల నొనర్చుచున్న జీవుడు మనస్సంబంధము వదల్చికొని సర్వకామవిముక్తుడై అమృతత్వమునంది హార్దబ్రహ్మయం దపునరావృత్తముగ సాయుజ్యము నందినాడు. ఇతః పూర్వ మాతడు సంకల్పానుగుణముగ మనస్సును ప్రేరించి తద్ద్వారా ఇంద్రియములను ప్రేరించి, బహిఃప్రపంచసంబంధము కలిగించుకొనుచు కర్మల నాచరించి తత్ఫలము ననుభవించుచుండెడివాడు. మఱియిప్పుడో

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే

హృదయగ్రంథిభేదన మైనది. అనగా మనస్సంబంధము వదలినది. నూటయొక్కనాడులు హృదయమునుండి బయలుదేరును. ఆ బయలు దేరుచోటునకే హృదయగ్రంథి యని పేరు. అదియే మనస్సునకు స్థానము. సంకల్పము గలిగినవెంటనే జీవుడు మనస్సు నచటనుండి సంకల్పానుగుణనాడియందు పంపి బహిఃప్రపంచసంబంధము గలిగించు

కొనుచుండును. యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః – సర్వకామ(సంకల్ప)మోచన మైనది. కావున మనస్సంబంధము జీవునకు తొలగిపోయినది. అనగా హృదయగ్రంథిద్వారా మనస్సును ప్రేరించుట యాగిపోయినది. గ్రంధిభేదన మైనదనగా గ్రంథిసంబంధము తొలగిపోయినదని యర్థము. అయిన పోషకుడగు జీవుడు హార్దబ్రహ్మ యందు అపునరావృత్తముగ లీన మగుటచేతను, తత్కాలమందే శరీర త్యాగము గాకపోవుటచేతను శరీరపోషణము జరుగు టెట్లనుప్రశ్న మిగిలియున్నది దైవరుమనస్సేకవిషయ కేంద్రీకృతమైనను పనులన్నియు సక్రమముగా నెరవేరినట్లు జీవుడు హార్దబ్రహ్మయందు లీనుడైనను శరీర కృత్యములు నెరవేరుచునేయుండును. ప్రారబ్ధభోగావసానమున శరీర త్యాగమైనపుడు శరీరమునందలి భూతములు పంచభూతములయందును హార్దాంతర్యామిబ్రహ్మయందు లీనుడైన జీవుడు మహాంతర్యామి యందును గలిసిపోవును.

జీవుడు హార్దబ్రహ్మయం దపునరావృత్తముగ సాయుజ్యము నందినాడు. కాని ప్రారబ్ధభోగావసానము గాలేదు. కావున శరీరత్యాగ మునకును, సాయుజ్యప్రాప్తికిని మధ్య కొంతకాల మున్నది. ఈకాలము నందును కర్మప్రసక్తి యున్నది. ఈకర్మలవిషయమునందును పుణ్యాపాప ప్రసక్తి యున్నది. ఈకర్మకే యాగామి యని యుపనిషత్సంప్రదాయ వ్యవహారము. అయిన నీకర్మలకు సంబంధించిన పుణ్యాపాపఫలము నెవ రనుభవింపవలయును? ఇయ్యవిసంకల్పపూర్వకముగ గావింపబడినకర్మలు గావు. కావున వీనియనుభవముతో జీవునకు సంబంధము లేదు. ఇక కర్మసాధనము శరీర మగుటచే భోక్తృత్వము శరీరమునకు సంబంధించి నచొ యను విషయము గాంతము. శరీరము జడము. జడమగు శరీరము నందు భోక్తృత్వ మనుపపన్నము. అయిన నీకర్మలకు ఫలానుభవ ముతో సంబంధమే లేదా? ఇది యొకజటిలమగు సమస్య.

అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్

అనువాక్యము శుభాశుభకర్మలఫల మనుభవింపక తప్పదని ప్రతిపాదించు చున్నది. శరీరము జడముగాన శరీరమునందు భోక్తృత్వ మనుపపన్నము జీవు డపునరావృత్తముగ సాయుజ్యము నందినాడుగాన నాతని కనుభవ ముతో సంబంధము లేదు.

ప్రారబ్ధం భోగతో నశ్యే త్సంచితం జ్ఞానకర్మణా
ఆగామి భజ్యతే కర్మ తద్ద్వేషిప్రియవాదిభిః

అనుశ్లోకము ప్రారబ్ధ మనుభవమువలన నశించు ననియును, సంచిత ముపాసనవలన నశించు ననియును, నాగామి ద్వేషిప్రియవాదులచే పంచుకొనబడు ననియును ప్రతిపాదించుచున్నది. కాని యిది సంభ వమా? ద్వేషి యనగా ద్వేషించినవాడు. ప్రియవాది యనగా స్తుతిం చినవాడు. ద్వేషించినవాడు పాపఫలమును, భూషించినవాడు పుణ్య ఫలమును ననుభవించునని వాక్యార్థము. మంచిది. ఈపుణ్యపాపము లెవరివి? వాక్యమునందలి యాగామిశబ్దముచే సంచితప్రారబ్ధము లెవ రివో యాగామియును నాతనికి సంబంధించినదే యని తెలియుచున్నది. కావున సంచితము నుపాసనచే నశింపజేసికొనినవాని యాగామియే ద్వేషిప్రియవాదులచే ననుభవింపబడునని వాక్యార్థ మని యంగీకరింపక తప్పదు.

ఇచ్చట నొకవిషయము ప్రధానముగా గమనింపవలయును. నిందించుటవలన పాపము సంభవించుననునది లోకసిద్ధమగు విషయము. అయ్యది నిందించుటవలన సంభవించునదియే. కాని యెవరిని నిందించి తిమో వారిదుష్కృత్యములకు సంబంధించిన పాపము నిందించినవారు పంచుకొనుట కవకాశ మున్నదా? ఇయ్యది కేవల మసంభవము. 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' అనువాక్య మెవరు గావించిన కర్మలఫలమును వారే యనుభవింపవలయునని ప్రతిపాదించు చున్నది. కావున ద్వేషిప్రియవాదులు వారినిందాస్తుతులకు సంబంధిం చిన ఫలమునే యనుభవింతురుగాని యితరుల పుణ్యపాపఫలము పంచు కొనరని తేలుచున్నది.

అయిన 'ఆగామి భజ్యతే కర్మ' అనువాక్యముగతి యేమన్న విచారింతము. ఆగామి యనునది యున్న దానివిషయమున నాలోచింపవలసిన యావశ్యకత యున్నది. కాని సాయుజ్యమునందినవానివిషయమున నాగామికి ప్రసక్తియే లేదు. సాయుజ్యకామనతో నుపాసనగావించుచున్నకాలమున గావింపబడిన కర్మలకు ఫలానుభవముతో సంబంధము లేదు. ఈవిషయమున చండీశ్వరుడే ప్రబలోదాహరణము. ఉపాసనకు భంగము గలిగించినాడను కారణమువలన పితృపాదములు ఖండించియు శివానుగ్రహపాత్రుడైనాడు. కావున నుపాసనాకాలమున గావింపబడినకర్మలకు ఫలానుభవముతో సంబంధము లేదని తెలియుచున్నది. ఉపాసనాకాలమునందే సంకల్పపూర్వకముగ గావింపబడిన కర్మలకు ఫలానుభవముతో సంబంధము లేదని తెలియుచుండ సాయుజ్యము నందినతరువాత నాగామి యున్నదని సంభావించుటయే యనుపపన్నమని తెలియుచున్నది. ఈచర్చ నింతటితో విరమించి ప్రకృతమనుసరింతము.



అనంతే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి – అనంతమును, సుఖకరమును, శ్రేష్ఠమునునగు బ్రహ్మయందు ప్రతిష్ఠ నందు నని యర్థము.

అనంతే – అంతములేని యని యర్థము.

అంత మనగా చివర. అంతశబ్దము సాపేక్షము. ఆది నపేక్షించును. కావున ననంత మనగా ననాద్యనంతమని పర్యవసితార్థము.

అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే



అనుశ్రుతి బ్రహ్మతత్త్వ మనాద్యనంతమని ప్రతిపాదించుచున్నది.

స్వర్గే – సుపూర్వక అర్జ అర్జనే అనుధాతువునుండి సుష్ఠు అర్జ్యతే సుఖ మనుభూయ తేఽస్మిన్నితి స్వర్గః అనువ్యుత్పత్తి ననుసరించి నిష్పన్నమైన స్వర్గశబ్దమునకు సుఖము ననుభవించు స్థాన మని

యర్థము. స్వర్గశబ్దమునందలి సు అను నుపసర్గకు లెస్సగా నని యర్థము. సుఖము లెస్సగా ననుభవించుట యనగా నవిచ్ఛిన్నముగా ననుభవించుటయని యర్థము. హార్దబ్రిహ్మసంబంధము గలిగినప్పటినుండి యనుభవింపబడు సుఖమునకు విచ్ఛిత్తి లేదని భావము.

ఉపాసనారంగప్రివేశమునకు పూర్వ మనుభవింపబడు సుఖములు వైషయికములు — అన్నియును క్షణికములు — తాత్కాలికములు. విషయానుభవజన్యమాన సుఖము లనుభవాంతమున నశించును గాన నయ్యవి తాత్కాలికములు. కాని యుపాసనారంగమున ప్రివేశించినప్పటినుండి విషయజన్యసుఖసంబంధము వదలి పరమేశ్వరోపాసనానంద మారంభ మగును. ఈ యానందమున కెట్టివిచ్ఛిత్తియును లేదని పరమార్థము.

లోకే :— లోకృ దర్శనే అనుధాతువునుండి లోక్యతే ఆలోక్యతే అనువ్యుత్పత్తి ననుసరించి నిష్పన్నమైన లోకశబ్దమునకు చూడబడునదని యర్థము.

ఈవాక్యమునందు లోకశబ్దమునకు అనంత స్వర్గ జ్యేయశబ్దములు విశేషణములుగా ప్రియోగింపబడినవి. అనంతమును, అవిచ్ఛిన్న సుఖానుభవస్థానమును, శ్రేష్ఠమునునగు లోక మని వాక్యార్థము. అయిన నట్టిలోక మేది? పదునాలుగులోకములును అనంతములు గావు. అవిచ్ఛిన్నసుఖానుభవస్థానములును గావు. విశ్వమే పరిచ్ఛిన్నము. అట్టిపరిచ్ఛిన్నవిశ్వాంతఃపాతిలోకములు అనంతములు గావని వేర చెప్పబని లేదు. ఈపదునాలుగులోకములును నావృత్తిమత్తులుగాన నయ్యవి యవిచ్ఛిన్నసుఖానుభవస్థానములు గావు. ఏతాదృశలక్షణవిశిష్టమైన దొకబ్రిహ్మలోకమే. అయ్యదియే అనాద్యనంతమును, అఖండానందవిశిష్టమును. స్వయంప్రిచురానందవిశిష్టుడు గనుకనే పరమేశ్వరుడు 'ఏష హ్యే వానందయాతి' ఇతరుల నానందింపజేయగలుగుచున్నాడు. మఱియును

కో హ్యే వాన్యా త్కః ప్రాణ్యా ద్య దేష
ఆకాశ ఆనందో న స్యాత్

బ్రహ్మానందము నాధారముగాగొనియే సర్వప్రాణులును జీవించగలుగు చున్నా రని యీశ్రుతి ప్రతిపాదించు చున్నది.

పరమేశ్వరుడు జీవులయందలి యనుగ్రహముచే హృదయమునం దంగుష్ఠమాత్రపరిమాణవిశిష్టుడై యున్నాడు. ఈహార్దబ్రహ్మకే బ్రహ్మలోక మను వ్యవహారము. 'అహ రహ ర్గచ్ఛం త్యేతం బ్రహ్మలోకమ్' అనుశ్రుతి ప్రాణులు ప్రతిదినమును సుషుప్తికాలమున నీబ్రహ్మలోకమునందు విశ్రాంతి నొందుచున్నా రని ప్రతిపాదించుచున్నది. కావున నీ ప్రకరణమున ననంతస్వర్గజ్యేయత్వాదిలక్షణవిశిష్టమైనది హార్దబ్రహ్మలోక మని తేలుచున్నది. 

ప్రతితిష్ఠతి, ప్రతితిష్ఠతి — ప్రతిష్ఠ నందును, ప్రతిష్ఠ నందు నని యర్థము.



ప్రతితిష్ఠతి, ప్రతితిష్ఠతి యనుద్విరుక్తి అపునరావృత్తినిసూచించు చున్నది. లోకే = హార్దబ్రహ్మలోకమునందు, ప్రతితిష్ఠతి, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠ నందును, ప్రతిష్ఠనందును అనగా ఆప్రతిష్ఠ శాశ్వతమై యందు ప్రతిష్ఠ నందినవాడు మఱల నటనుండి భూరాదిలోకముల యందు జన్మకై తిరిగిరా డని యర్థము. 

న స పున రావర్తతే న స పున రావర్తతే

ఈమంత్రము గ్రంథమునందలి చివరమంత్రము. ఈమంత్రము నందు ఫలోపసంహారము గావింపబడినది. ఉపనిషదధ్యాయమునకు పరమప్రయోజనము హార్దబ్రహ్మయం దపునరావృత్తముగ లీన మగుట. ఈవిషయము ఈక్రిందివాక్యముచే నిర్వచింపబడినది.

అనంతే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి

ఇతి శమ్.

ఓమ్

ఆప్యాయంతు మమాంగాని వాక్ ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథో బల మింద్రియాణి చ సర్వాణి సర్వం బ్ర హ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరో దనిరా కరణ మ స్త్వనిరాకరణం మేస్తు తదాత్మని నిరతే య ఉపని షత్సు ధర్మా స్తే మయి సంతు తే మయి సంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

## కేనోపనిషద్గతమంత్ర

# అకారాద్యనుక్రమణిక

